# సంపూర్ణ రామాయణము.

(6 అంకముల నాటకము.) 7/3

గ్రంథకర్త:

కీర్తిశేషులు, శతావధాని బాలసరస్వతి

మల్లాది గోపాలకృష్ణ శాస్త్రిగారు.

ఇది

ముత్తినేని వేంకట చెన్నకేశవులుచే

పరిష్కరింపఁబడినది.

1 వ కూర్పు: 1000

పబ్లిషర్:

రంగా వేంకటరత్నము,

బుక్కుసెల్లరు, బెజవాడ.



వెల రు. 1—4—0.




# ఈ నాటకమున వచ్చు పాత్రలు.

## పురుషులు.

ాత్రధారుఁడు
వు
హ్మ
రాముఁడు
ష్మణుఁడు
రతుఁడు
త్రుఘ్నుఁడు
రథుఁడు
వ్యపురుషుఁడు
వామిత్త్రుఁడు
ష్ఠుఁడు
జనేయుఁడు
ంగదుఁడు
గ్రీవుఁడు
ంబవంతుఁడు
లి
ఁడు
ాత్తుఁడు
భుఁడు
షభుఁడు
ంధమాదనుఁడు
ందుఁడు

ద్వివిదుఁడు
దారుఁడు
జటాయువు
అక్షయుఁడు
ఇంద్రజిత్తు
విభీషణుఁడు
కుంభకర్ణుఁడు
రావణుఁడు
అతికాయుఁడు
మహాకాయుఁడు
ప్రహస్తుఁడు
ధూమ్రాక్షుఁడు
శుకుఁడు
నారదుఁడు
గరుత్మంతుఁడు
సుపార్శ్వుఁడు
మాతలి
ఇంద్రుఁడు
అగ్నిదేవుఁడు
శివుఁడు
మారీచసుబాహులు, మఱికొందరు రాక్షసులు, సారధి వత్తురు.

## —◆ స్త్రీలు ◆—

సరస్వతి
సీత
భూదేవి
త్రిజట
శూర్పణఖ

మంథర
కైక
కౌసల్య
సుమిత్ర
మఱికొందఱు రాక్షసాంగనలు



శ్రీ

# సంపూర్ణ రామాయణము

## ప్రథమాంకము.



(నాంది)

శా॥ శ్రీరాముం, డవనీసుతాహృదయరా ♦ జీవాబ్జమిత్త్రుండు, దు
ర్వారానల్పపరాక్రమక్రమశిఖా ♦ జ్వాలాపరీతాంబుద
ద్వారుం, డుగ్రనిశాటమారణకళా ♦ ప్రావీణ్యుఁ, డెంతేనిస
త్కారుణ్యామృతపూర మొల్కఁగ మిముం ♦ గాపాడు నశ్రాంతమున్॥

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును.)

సూ— (పుష్పాంజలి జల్లి) సభాసదులారా!

తే॥ గీ॥ పూజ్యమగుహరితసగోత్ర ♦ మున జనించె
నెలమి మల్లాది గోపాల ♦ కృష్ణసుకవి
యతఁడు నాటకఫక్కిరా ♦ మాయణంబు
వ్రాసె నాచంద్రసూర్యమై ♦ వసుధ వెలయ.

అట్టినాటకము నేఁడు మేమిచ్చటఁ బ్రదర్శింపఁ బోవుచున్నారము. కాన సర్వజ్ఞులగు మీరందఱు క్షీరమరాళన్యాయంబుగ నెరసులున్న నిరసించి కేవలరసాస్వాదనాతత్పరులై యానందించి మమ్ముఁ గృతార్థుఁ జేయుదురు గాక!

(నిష్క్రమించును.)

# ప్రథమాంకము.

---

(౧ రంగము:—సత్యలోకము; ప్రవేశము-బ్రహ్మ సరస్వతీసహితుండై)

భూదేవి—(ప్రవేశించి స్వగతము) అక్కటా! మహాపాపులగు రావణాది దుష్టరాక్షసులు ప్రబలినకతంబునఁ దద్భారంబు సహింపలేక నామెడ విఱిగిపోవుచున్నది. ఈ మహాభరముఁ బాపి నాకు విశ్రాంతినొసంగు మహామహుఁడెవ్వఁడొకొ కదా? ఈ కమలాసనుఁ బ్రార్థించిచూచెద, (ప్ర) ఓమహాత్మా! వాణీమనోహరా! శరణు! శరణు!

బ్రహ్మ—ఓహో! భూదేవియా! అమ్మా! వసుంధరాసతీ! నీ హృదయసంతాపమంతయు నేనంతర్దృష్టి నెఱింగితి. ఎట్టివారికైనఁ గాలవశంబున నాపదలు గలుగుచుండును. నీ విందులకై చింతింపవలదు. దేవతలతోడను, ఋషిపుంగవులతోడను గూడి మనమందఱము సమ్మహావిష్ణువుం బ్రార్థించి దీనికుపాయ మాలోచింతము. ఆమహానుభావుండే దుష్టనాశనమొనర్చి నీ చింత దీర్పఁగలండు. పోదము, రమ్ము. (నిష్క్రమింతురు.)

---

(౨ రంగము, క్షీరాబ్ధి)

(విష్ణువు శేషతల్పశయనుఁడైయుండ దేవతలు, ఋషులు, భూదేవి, బ్రహ్మ ప్రవేశము)

అందఱు—జే జే జయ త్రివిక్రమ! దైత్యారి! ♦ జయ మురారి!
జయ ముకుంద! హృషీకేశ! ♦ జయ రమేశ!
జయ జనార్దన! రిపుభంగ! ♦ జయ ఘనాంగ!
జయ చతుర్భుజ! సురపాల! జయ సుశీల!

విష్ణువు—(బ్రహ్మతో) కుమారా! మీరాక కేమికారణము?

బ్రహ్మ—తండ్రీ! ఏమని విన్నవింతును? భూలోకమ్మునఁ బులస్త్యసుతుండు రావణుఁడు నాచే వరంబులంది యెల్లలోకంబులఁ దల్లడమందించుచుఁ బ్రాభీతిలేక సంచరించుచున్నాఁడు. వానిదౌర్జన్య మింతంతగాదు. ఆదుష్టునిచేఁబున లోకంబులు నిస్తరవోవ్వుటలేదు. వానికి నరునిచే లయంబును విధించితిని. కృపాకాండవగు నీవే విషయంబునఁ దగుసుపాయము యోజించి భయముఁ లఁ గాపాడవలయు.

విష్ణు—కుమారా! తొల్లి కశ్యపముని నన్నుఁ దనకుఁ బుత్త్రుఁడవు గమ్మని ప్రార్థించెను. అతఁడే భూలోకంబున దశరథుఁడనుపేర జన్మించియున్నాఁడు. ఆరాజు చంద్రునిగర్భంబున మానవుండనై జన్మించెద. యోగమాయ సీయనుపేర

జనకుండను భూపాలునకుఁ బుత్త్రికగాఁగలదు. తన్మూలమ్మున దుష్టరాక్షస
కులనాశనంబు సంభవించును. మీరింక శంకదక్క యుండుఁడు.

బ్రహ్మ—దేవా! క్రూరరాక్షసకల్పితమహాబాధానలసంతప్తహృదయులమగు మాకు నీ వచోమృతవృష్టిచే నమితానందము గలిగినది. అమ్మా! భూదేవి! వింటివి కదా! దయామయుండగు నిమ్మహాత్మునివాక్యములు! ఇంక నీభారము డుగఁగలదు. చింతవక్క యుండుము. సురలారా! మునులారా! పోదము రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

---

౨ రంగము యజ్ఞవాటిక.

(దశరథుఁడు పుత్త్రకామేష్టి చేయుచుండును.)

(అప్పుడగ్నికుండమునుండి పాయసపాత్రతో దివ్యపురుషుఁడు ప్రవేశించును.)

దశ—మహాత్మా! రక్తాంబరాలంకృతదివ్యదేహా! నమస్కరించుచుంటిని.

దివ్య—రాజా! నీయజ్ఞనిష్ఠవలన నేను సంతృప్తుండనైతి. ఇదిగో! నీపాయసపాత్రిం బుచ్చుకొమ్ము. ఇందుఁ బుత్త్రోత్పత్తికరంబును, గల్మషహారంబును నగు పాయసాన్నంబు గలదు. ఇది నీపత్నులకిమ్ము. (ఇచ్చి అంతర్ధానమగును.)

దశ—నేనిప్పటికి ధన్యుండనైతి. నాజన్మ మిప్పుడు సార్థకమయ్యె. ఇంక నీపాయసము నాభార్యల కిచ్చెదఁగాక! (నిష్క్రమించును.)

---

(౩ రంగము, దశరథుని యాస్థానము)

(దశరథుఁడు వసిష్ఠసహితుఁడై ప్రవేశించును)

దశ—గురూత్తమా! వసిష్ఠమునీంద్రా! నాతనయు లిప్పుడు విద్యావంతులును బుద్ధిమంతులును నైయున్నారు. నాకిత్తఱి వారి వివాహమహోత్సవముఁ గన్నులారఁజూచి సంతసింపవలయునను నాస పొడమచున్నది.

వసి—రాజేంద్రా! నీ యభీష్టము కొలఁది కాలముననే నెఱవేఱఁగలదు.

ద్వారపాలకుఁడు—(ప్రవేశించి) మహాప్రభూ! విశ్వామిత్త్రమహర్షి విజయము చేసియున్నాఁడు.

దశ—ఓహో! ఇది యెంతయు సుదినము. ఎదురేఁగి తోడ్కొనివచ్చెదను—(నిష్క్రమించి విశ్వామిత్త్రునితోఁ బ్రవేశించి) మహాత్మా! ఈ పీఠము నలంకరింపుఁడు.

విశ్వా—(కూర్చుండి) రాజా! సబాంధవమ్ముగ నీకుఁ గుశలమా?

దశ—మీయనుగ్రహమున మాకందఱికిని కుశలమే. ఆర్యా! మీతపోనియమాదులు నిర్విఘ్నముగ సాగుచున్నవిగదా?

విశ్వా—రాజా! ఏమని చెప్పుదును?

వశి—మహాత్మా! అట్లనుచుంటిరేమి?

ఉ॥ ఓ మహితప్రభావ కలి ♦ తోజ్వలదివ్యతపోధనాఢ్య! మీ
హోమ జపాధ్వరాదులకు ♦ నొందినవిఘ్నము లెవ్వి? మీకు నే
నేమిటనైన లోపము ఘ ♦ టించినఁ దప్పుఁ గృపన్ క్షమించి మీ
కేమికొఱంతగల్గెనో వ ♦ చింపుఁడు దీర్చెద మీయభీష్టముల్॥

యజ్ఞాదులు నిర్వర్తించుట కాజ్యాది సామగ్రిలేమైనఁ గావలయునా? లేక ధనమేమైనఁ దక్కువయయ్యెనా? తెలియఁజేయుఁడు. కోరినదాని నొసంగ సంసిద్ధుఁడనై యున్నాఁడను.

విశ్వా—రాజచంద్రా! మత్రేమియు లేదు. కాని నే నొకయజ్ఞముసేయ నుద్దేశించినాఁడను. తద్విఘ్నమొనరింపఁ గుటిలరాక్షసులు వేచియుందురు. కావున సవనరక్షణార్థమై నీ కుమారులగు రామలక్ష్మణులను నా వెంటఁ బంపుము. యజ్ఞము పూర్తియైనపిమ్మట నీ తనయులఁ దెచ్చి నీ కప్పగించిపోయెదను.

దశ—(స్వ) అన్నా! యీతండెట్టి బెట్టిదంపుఁగోరికఁ గోరుచున్నాఁడు. నా ముద్దులరామునిఁ జేసేత రాక్షసులపై కెట్లుపంపుదును. రామునిఁబాసి నేను ప్రాణము లెట్లుభరింతును? (ప్ర) ఆర్యా! మీరు కడుఁజిత్రముగ మాటలాడుచున్నారు. కన్నులుదెఱవని పసికూనలా యజ్ఞ సంరక్షణము సేయువారు?

తే॥ గీ॥ ఏఁగి యెఱుఁగరు పెఱచోట్ల ♦ కెన్నఁడేనిఁ
బోరులందాటితేరిన ♦ వారుగారు
చిన్నిపాపలు చూడ నా ♦ కన్నతనయు
లిట్టివారేఁడ? దైత్యులఁ ♦ గొట్టులేఁడ?

కావలయునన్న నేనే చతురంగబలసమేతుండనై యరుదెంచెదను. ఆదుష్టరాక్షసులవృత్తాంత మెట్టిదో తెలుపుఁడు.

విశ్వా—రాజా! ఆకుటిలాత్ములు మారీచసుబాహులను దేవారులు. రావణు పంపున నతిక్రూరకర్ములై వర్తించుచుందురు. వారధికబలవంతులు. నీనందనులచే నాఖలులు తుత్రుటిలో మడయఁగలరు. కావున విచారింపక నా వెంట బంపుము.

దశ—(నివ్వెఱపడి) మునీంద్రా! త్రిలోకకంటకుఁడగు రావణునిపంపున వచ్చి దైత్యుల నిరోధింప మానవమాత్రులకు వశమా! దేవేంద్రాదులయిన న

దుష్టులకు వెఱచుచుందురు. అట్టిచో నేనన నెంత? నాచిన్నసుతు లాభీకరాకారులఁ గన్నెత్తియైనఁ జూడఁగలరా? వలసినచో మీకెట్టి సాహాయ్యమైనఁ జేయఁగలనుగాని మమ్మీవిషయమునమాత్రము మీరు కరుణింపవలయును.

విశ్వా—ఓరీ! అసత్యవాదీ! మహాతాపసులమగు మాతోఁ బరిహాసము సేయుచుంటివా? ఇంతకుముందు నీవేమంటివి? ఇప్పు డేమనుచుంటివి? సూర్యవంశమునఁబుట్టిన నీకు రెండునాల్కలా?

తే॥ గీ॥ వెనుక ముందారయక సత్య ♦ ధనువిభంగిఁ
దొలుతఁ గోరినదానిని ♦ త్తునని పలికి
బొంకెదిప్పుడు ఛీ నిను ♦ బోటిదుష్ట
భూధవాధముఁ డెందును ♦ బుట్టఁబోఁడు॥

ఇఁక నీముఖముఁ జూడరాదు. ఓరీ! నీచరాజాధమా! ఈయసత్యగుణము నీకు స్వయముగఁ గలిగినదికాదు. ఇదియంతయు నీగురువగు దుష్టవసిష్ఠుని కృత్రిమము. (వసిష్ఠునితో) ఓరోరి! బ్రాహ్మణాధమా! నీవు గురుఁడవై యీరాజునకు నేర్పిన దిదియేనా? నీవెప్పుడు నిట్టిదుర్వృత్తిచేతనే పొట్టఁబోసికొనుచుంటివి! నీయందు సద్వృత్తి లేశమైనఁ గనుపట్టదు. ఛీ. ఛీ. నిన్నుఁజూచినఁ బాపమువచ్చును.

వసిష్ఠు—(స్వ) ఓహో! ఈవిశ్వామిత్రుఁడు నన్నుగూడ నిందించుచున్నాఁడు! ఆడలేక మద్దెలమీఁదఁ బడినట్లున్నది. ఇప్పుడు నేనుగూడ నోరుచేసికొన్న మాయిరువురినడుమ నీరాజునకు ముప్పువాటిల్లును. ఎట్లైన రామలక్ష్మణుల నితనివెంటఁ బంపుటయే యుచితము. (ప్ర) దశరథా! సూర్యవంశసంభూతులగువారు మాటతప్పరాదు. నీవు ధర్మమూర్తివి. సూర్యాన్వయదీపకుండవు. కీర్తిశాలివి. నీవన్యథా విచారింపక రామలక్ష్మణుల నితనివెంటఁ బంపివేయుము. ఈవిశ్వామిత్రుఁడు సకలాస్త్రశస్త్రవేది. మహామహిమాన్వితుఁడు. ఇతనిమూలమున నీతనయు లపారధనుర్వేద పారంగతులును యశశ్శాలులును గాఁగలరు. వీరికి శుభము గలుగఁగలదు. నీవింక విచారింపక నాచెప్పినచొప్పునఁ జేయుము.

దశ—(అపవారించి) గురువర్యా! సర్వజ్ఞులగు మీరు శుభము గలుగునని చెప్పుచున్నారుగావున మీయాజ్ఞ శిరసావహించెదను. (విశ్వామిత్రునితో) మహాత్మా! గాధేయా! భవదిచ్ఛానుసారముగ నాతనయుల మీవెంటఁ బంపె

దను. నాపై నాగ్రహం బుడుగవలయును. పసిపాపలగుటచేతను గన్నవాఁడ నగుటచేతను వారి నెడఁబాసియుండఁజాల కట్లంటిని. సేవకా!

సేవ—దేవా! యేమియాజ్ఞ?

దశ—రామలక్ష్మణుల నిటకుఁ గొనిరమ్ము.

(సేవకుఁడు నిష్క్రమించి రామలక్ష్మణులఁ గొనివచ్చును.)

రామలక్ష్మణులు—తండ్రిగారు! నమస్కారము. గురువర్యా! వందనములు.

దశ-వసి—కల్యాణమస్తు!

దశ—నాయనలారా! ఈ విశ్వామిత్రమహర్షికి నమస్కరింపుఁడు.

రామ-లక్ష్మ—మునిచంద్రా! నమస్కారము.

విశ్వా—కల్యాణమస్తు!

దశ—యతిచంద్రా! ఈ నాపుత్త్రులు మిగులఁ గోమలాంగులు. గడియయైనను దల్లిదండ్రుల విడచి యెఱుంగరు. మఱియును,

చ॥ అరువది వేలయేండ్లు మని ♦ యాపయి నెట్టటో కాంచినాఁడ శ్రీ
హరికృప నేఁటి కాత్మజుల ♦ నట్లగుటన్ మునివర్య! ప్రాణముల్
నిరతము వీరి యందునె ♦ నిల్పి దినంబులు పుచ్చుచుంటి, స
త్కరుణఁ గనుండు నాసుతులు ♦ గారిక మీసుతులంచు బాలురన్ ॥

విశ్వా—దశరథా! నీవింక నేమియుఁ జెప్పనక్కఱలేదు. భయములేదు.

దశ—నాయనలారా! ఈ బ్రహ్మర్షిచంద్రునితోఁ బోయి యీ మహాత్ముని యాగ్ఞ నెఱవేర్చి రండు.

రామ-లక్ష్మ—చిత్తము. (వసిష్ఠునకు దశరథునకుఁ దిరిగి నమస్కరింతురు.)

దశ-వసి—కల్యాణమస్తు!

(విశ్వామిత్త్రుఁడు రామలక్ష్మణులు నిష్క్రమింతురు)

దశ—గురువర్యా! మనమింకఁ బోవుదము.

వసి—మంచిది.

(నిష్క్రమించుచున్నారు.)

---

## ౫. వ రంగము;—అరణ్యము.

(విశ్వామిత్త్రుఁడు రామలక్ష్మణులు ప్రవేశింతురు)

విశ్వా—రామచంద్రా! మనమిప్పుడు గంగానదిని దాఁటితిమి.

రాము—మహాత్మా! రానురా నీయరణ్యమంతయు నిసుముఁజల్లినను రాలక భయంకరమై యొప్పుచున్నది. చూడుఁడు.

సీ॥ చటుల హర్యక్ష గ ♦ ర్జానినాదవిదీర్ణ
శైలమండపిచండ ♦ సముదయంబు
పటుబలాన్వితసము ♦ ద్భటమదోత్కటగండ
భాగస్రవద్దాన ♦ పంకిల బు
కాకోలరుఝల్లికా ♦ ఘూకాదినానాన
గాక దుష్టారావ ♦ భీకరంబు
ఉరుతరవ్యాళ దు ♦ ర్భరవిషానలశిఖా
జాల భస్మీభూత ♦ సాలచయము
తే॥ గీ॥ వటకుటజసాల ఖదిరబి ♦ ల్వాద్యనేక
గగనచుంబిమ్రమకృతాంధ ♦ కారసాంద్ర
దురలోక్య దురపగాహ ♦ దుర్గమోగ్ర
మీవనం, బెవ్వరిది వచి♦యింపు మనఘ!॥

విశ్వా—రాజపుత్రా! యీభూమి తొల్లి కరూశదేశమనుపేరఁ బరఁగుచుండె డిది. తాటకయను దానవి తనపుత్రిల మారీచసుబాహులఁ గూడి యీ దేశమంతయు నాశనమొనరించుటచే నిప్పుడిది యి ట్లరణ్యమైపోయినది. ఇచ్చటకుఁ గొంతదూరమున నా రక్కసి వసించుచుండును. మీరిప్పు డాదుష్టు రాలిని వధింపవలయును.

లక్ష్మ—మునీంద్రా! ఇదియేమి? మాచే స్త్రీవధఁ జేయింపనెంచితివా? మేమిట్టి యధర్మకార్యములకు సమ్మతింపువారముగాము.

రాము—యతిచంద్రా! నిశ్చయముగ స్త్రీ లవధ్యలుగదా? ఈపని యెట్లుపొసఁ గును?

తే॥ గీ॥ అఖిలశాస్త్రాస్త్రవిద్యల ♦ నభ్యసించి
సకలధర్మజ్ఞులైన సు ♦ క్షత్రియులకుఁ
బోరఁ బురుషులఁ బొలియింపఁ ♦ బోలుఁగాని
తలిరుఁబోఁడులఁ జంపుట ♦ తగునటయ్య॥

విశ్వా—నాయనలారా! మీరీవిషయమున సంశయింపఁ బనిలేదు. ప్రజాసంరక్ష ణార్థమై జగదపకారిణులగు దానవకాంతలఁ దునుముట ధర్మవిరుద్ధముగాదు. మున్నుఁ బెక్కుమంది యీధర్మము నెఱవేర్చియున్నారు. కావున నన్యథా తలంపక మీరిప్పుడు ధనుష్టంకారము గావింపుఁడు. అదివిని యద్దానవి మీ చెంతకు రాఁగలదు. అప్పుడు దానిని గడతేర్పవచ్చును.

రాము—దేవా! సకలధర్మవేదులగు మీయాజ్ఞ దలఁదాల్చితిమి. ఇదిగో! ధనుర్జ్యా రావము సేయుచున్నారము.

(వింట్లెక్కు వెట్టి నారులు మోఁగియింతురు.)

తాట—(ప్రవేశించి) ఆఁ! ఆఁ! ఎవఁడురావాఁడు? ఎవఁడురావాఁడు? ఓ! ముగ్గురు; మూఁడుకబళములు! (మీఁదికి వచ్చుచున్నది)

లక్ష్మ—ఔరా! దీనియాకార మెంతభయంకరముగా నున్నది!

రాము—(నవ్వుచు) దీనినిఁజూచిన దేవతలైన నిశ్చేష్టులగుదురు.

తాట—వీరారో? ఎందులకు వచ్చితిరిరా? పాలుదాఁపుటకా? చెటిమొకచంక నెక్కుఁడు. మీయాఁకలి దీర్చెదను. నాయాఁకలి దీర్చుకొనెదను. ఊఁ. ఊఁ.

విశ్వా—రామచంద్రా! తడవేల? దీని నీక్షణముననే మార్గణమున కెరగావింపుము.

రాము—ఓసీ! నిన్నాఁడుదానవని యుపేక్షింపరాదు నీక్రొవ్వడఁగించి నిన్నిప్పుడే యమాలయమున కంపెదఁ జూడుము.

(బాణము ప్రయోగించును.)

తాట—హా! హా! (పడిపోవును.)

విశ్వా—దశరథరాజనందనా! ఇప్పటి కీదానవి వధింపఁబడినది. మేలయ్యెను.

రాము—మునిచంద్రా! భాస్కరుం డపరాద్రిఁ గ్రుంకుచున్నాఁడు. చూడుఁడు.

గీ॥ పొసఁగ నీడలు పడమటి ♦ దెసకు జాఱె
ఖగచయంబు గులాయసం ♦ ఘముల దూఱె॥
నెల్లరాజీవముల కాంతి ♦ తెల్లవాఱెఁ
గైరవశ్రేణి వగదీఱె ♦ కాంతి మీఱె

విశ్వా—ఔను, సంధ్యాసమయమైనది. ఆకన్పట్టు సరోవరంబునఁ గాల్యకృత్యముల నిర్వర్తించుకొని యీరాత్రి యీ వింధ్యారణ్యమున నివసించి తెల్లవాఱిన తోడనే మదీయాశ్రమమునకుఁ బోవుదము. రాజపుత్రా! నాకడ ననేక దివ్యాస్త్రశస్త్రములుగలవు. సురగరుడోరగ యక్షరాక్షసుల కభేద్యములగు దండచక్ర, ధర్మచక్ర, కాలచక్ర, విష్ణుచక్ర, ఐంద్రాస్త్ర, వజ్రాస్త్ర, బ్రహ్మాస్త్ర, వారుణాస్త్ర, ధర్మపాశ, కాలపాశ, వరుణపాశ, మోహన, శోషణ, సంతాపన, మారణాది మహాసాధనములన్నియు నీకొసంగెదను. వానిని నీవు స్నానమొనర్చి శుచివై పరిగ్రహింపవలయు—కాన నా కమలాకరతీరమున కరుగుదము రండు.

రాము—చిత్తము.

(నిష్క్రమించుచున్నారు.)

---

6 రంగము.

(ప్రదేశము - విశ్వామిత్రాశ్రమ సమీపభూమి)

(ప్రవేశము - మారీచ సుబాహులు)

సుబా—మారీచా! విశ్వామిత్రుండేదో యజ్ఞముఁజేయుచున్నాఁడఁట. మనమేఁగి యజ్ఞ సామగ్రులన్నియు హరించి యజ్ఞవేదిపై రక్తముఁ గురిపించి వత్తము, రమ్ము.

మారీ—మంచిది నడువుము.

(నిష్క్రమింతురు.)

(నేపథ్యమున)

హా! హా! మోసమువాటిల్లినది. రాక్షసమాయచే మేఘములు రక్తము వర్షించుచున్నవి. యజ్ఞసామగ్రులు మాయమైపోవుచున్నవి. ఓ మహాత్మా! రామా! రక్షింపుము రక్షింపుము.

రాము—(ఆగ్రహముతో ధనుఃపాణియై ప్రవేశించి) ఓరోరి నిశాచరాధములారా! మదాంధీభూతచేతస్కులై యజ్ఞమును భంగమొనర్ప నారంభించితిరా? చూడుఁడు. మిమ్మిదే వధించెదను.

(అట్టహాసముఁజేయుచు మారీచసుబాహులు ప్రవేశించుచున్నారు.)

రీ—ఓరీ! నరాధమా! ఎవఁడవురా నీవు?

బా—మాటాడవేమిరా?

రీ—నోరులేదా?

సుబా—చెవుడా?

రాము—ఛీ! దుర్మార్గులారా! నోరుమూయుఁడు- మీదుండగములింక సాఁగవు. వజ్రసదృశములగు నా బాణముల మీప్రాణములఁ గొనెద, వీక్షింపుఁడు.

(బాణములఁ బ్రయోగించును.)

సు—(పడిపోవును)

మారీ—(బాణము తగిలి ఎగిరిపోవును)

(యవనికపడును)

---

2 రంగము.

ప్రదేశము - విశ్వామిత్త్రాశ్రమము.

(ప్రవేశము - రామలక్ష్మణులు, విశ్వామిత్త్రుఁడు.)

విశ్వా—నాయనలారా! మీవలన దుష్టరాక్షసులు వధింపఁబడిరి. నాయజ్ఞమును బూర్తియయ్యెను. మేమందఱము నిప్పుడు జనకుఁడు చేయుచున్న యాగమును దిలకింపఁబోవుచున్నారము. కావున మీరును మావెంట రండు. అచ్చట దుర్ధరంబగు మహేశ్వర చాపంబొండు గలదు. దానిం దిలకించివత్తురుగాక.

రాము—చిత్తము.

(పరిక్రమింతురు.)

రాము—మునిసత్తమా! ఇదియొక యాశ్రమమువలె నున్నది.

విశ్వా—ఇది పూర్వమున గౌతమాశ్రమము.

రాము—ఏమి? ఇందేకదా గౌతమశాపంబునఁ దత్పత్ని యహల్యాదేవి పాషాణమై పడియున్నదని మీరు చెప్పితిరి?

విశ్వా—అవును.

రాము—(పాదమున కొకశిలయితగులును. అదియే యహల్యయగును)

రాము—మహాత్మా! ఇదియేమి? ఈమె యెవరు?

విశ్వా—ఈమెయే యహల్య.

అహ—తండ్రీ! రామచంద్రా! పెక్కువత్సరములనుండి పాషాణమై పడియున్న నేను మీ చరణము సోఁకుటచే శాపవిముక్తి వడసితిని. మీకివే వందనములు. శిలగాఁబడియున్న నాకాయము దాఁకుటచే మీ మృదుపదములు నొచ్చియుండును. కొంచెమొత్తెద. (పదములంటఁబోవును.)

రాము—అమ్మా! వలదు. నీవిక నీభర్తకడకుఁబోయి సుఖింపుము.

విశ్వా—సోదరీ! గౌతమమునిచంద్రుఁడిప్పుడు హిమవత్పర్వతంబునఁ దపంబొనర్చుచున్నాఁడు. అక్కడకుఁ బొమ్ము.

అహ—చిత్తము. (నిష్క్రమించుచున్నది.)

(యవనిక జాఱును.)

---

౮. రంగము.

ప్రదేశము—జనకుని యాస్థానము.

(రాముఁడు, లక్ష్మణుఁడు, జనకుఁడు, విశ్వామిత్రుఁడు ప్రవేశింతురు)

విశ్వా—జనకభూధవా! ఈరాజతనయుండు నీకడఁగల మహేశ్వర చాపముం జూడదలఁచుచున్నాఁడు. కావునఁ దెప్పింపుము.

జన—మహాప్రసాదము. (అపవారించి) మునీంద్రా! సురాసురదుర్ధరంబగు నమ్మహాశరాసనము నీబాలుఁ డెక్కువెట్టఁ గలఁడా?

విశ్వా—(అపవారించి) నీవట్లు చూచు చుండుము.

జన—(స్వ) ఈరాజకుమారునిఁ జూడ శౌర్యరాశివలెఁ దోఁచుచున్నాఁడు. నానో మిప్పుడు ఫలించిన ఫలింపవచ్చును. (ప్ర) ఓరీ! ఎవఁడురా అక్కడ?

భటు—(ప్ర) మహాప్రభూ! ఏమియాజ్ఞ?

జన—మందిరమున నున్న రుద్రచాపంబును భటులచేఁ బట్టించుకొనిరమ్ము.

భటు—చిత్తము- (నిష్క్రమించును)

(కొందఱుభటులు విల్లు నెత్తుకొనివచ్చి దింపుదురు)

విశ్వా—రామచంద్రా! అదియే మహేశ్వర శరాసనము! దీని నెత్తఁ జాలక యెందఱో మహారాజులు పరాభవమందిరి.

జన—రాజకుమారా!

ఉ॥ ఈమహనీయ మౌ ధనువు ♦ నేఘనుఁ డెక్కిడు నట్టివానికెం
తేముద మొప్ప నాతనయ ♦ నీయఁబ్రతిజ్ఞ యొనర్చినాఁడఁజు
మ్మీ! మహినోపెదేని బల ♦ మేర్పడఁ గార్ముక మెక్కువెట్టి
సీతామహిళాలలామను ము ♦ దంబునఁ గైకొను మీవు భూవరా!

రాము—(ధనువును దేలికగా నెత్తి నవ్వుచు) ఇది యెక్కిడఁజాలక యెందఱో పరాభవ మందిరఁట. దీనిలా వేమాత్రము చూచెదఁగాక.

(ఎక్కువెట్ట విఱుగును.)

(అందఱుఁ గరతాళ ధ్వనులుగావింతురు.)

జన—మేలు! మేలు! రాజకుమారా! నినుబోఁటివీరాగ్రణి నింతవఱకుఁ జూడను - నేనెకా!

సేవ—(ప్రి) దేవా! యాజ్ఞయేమి?

జన—ప్రసవమాల్యమొసంగి సీతను గొనిరండని దాసీజనమ్మునకుఁ దెలుపుము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును.)

(ప్రవేశము - పుష్పహారముతో సీత - కొందఱు చెలులు.)

జన—అమ్మా! (రాముని జూపి) పుష్పదామ మీరాజకుమారుని యఱుత నలంకరింపుము.

సీత—(సిగ్గుపడుచు నట్లుచేయుచున్నది.)

(అందఱుఁ గరతాళధ్వనులుగావింతురు.)

విశ్వా—(అపవారించి) జనకరాజేంద్రా! ఇందనుక సందేహించితివే! రాముఁడన్న నేమనుకొంటివి.

చ॥ అరయఁగ యజ్ఞరక్షణకు ♦ నై చనుదెంచుచు మార్గమధ్యమం
దురుతర విక్రమంబున మ ♦ హోన్నతిఁ దాటకఁ ద్రుంచినాఁడ నం
తరమునఁ దత్తనూజుల, ను ♦ దగ్రబలంబున నేలఁగూల్చె స
త్వరగతి, రాముఁడన్నఁ బ, టు ♦ దైత్యవిరాముఁడు గానియొండెడే!

జన—మహాత్మా! ఈ జగదేకపరాక్రమశాలి నల్లునిఁగాఁ బడయుటచే ధన్యుఁడనైతిని. ఇంకఁ బరిణయమ్మునకు రండని దశరథేశ్వరునకు జాబునంపెదను. నగరాలంకారాదిప్రయత్నములఁ జేయించెదను.

విశ్వా—మంచిది కానిమ్ము. (అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

౯ రంగము.

ప్రదేశము - జనకుని సౌధము.

జనకుఁడు, విశ్వామిత్రుఁడు, దశరథుఁడు.

జన—దశరథేశ్వరా! మీతో వియ్యమందు భాగ్యము గలిగినందులకు నేనెంతయు సంతసించుచున్నాఁడను.

దశ—నేనుమాత్రమో! ఇదియంతయు నీవిశ్వామిత్రమునీంద్రుని కటాక్షము.

విశ్వా—దశరథా! నీనలువురు పుత్త్రులకుఁ దగినకన్నెలు లభించినారు—ఇంక—

దశ—దేవా! నిశ్చయము. రామునకు సీతయు భరతునకు మాండవియు లక్ష్మణున కూర్మిళయు శత్రుఘ్నునకు శ్రుతకీర్తియు మిగులఁ దగియున్నారు.

విశ్వా—రాజేంద్రా! నీవింకఁ గొడుకులతోడను గోడండ్రతోడను శుభముహూర్తమున గృహప్రవేశ మొనర్చి సకలసౌఖ్యముల ననుభవింపుము. కీర్తిశాలురును బరాక్రమనిధులును నగు తనయులం బడయుటచేఁ గనకమునకుఁ దావియబ్బనట్లయ్యె. మేమింక నాశ్రమమునకుఁ బోయెదము.

జన—మహాత్మా! అనుగ్రహముంచుఁడు.

దశ—బ్రహ్మర్షిచంద్రా! మీ రొనరించిన యుపకృతికి నేనెంతయుఁ గృతజ్ఞుఁడను.

విశ్వా—మీకు సర్వశుభములు సమకూఱుఁగాక. పోయివచ్చెదను. (నిష్క్రమించును.)

దశ—బావగారూ! మేమింక నయోధ్యకుఁ బ్రయాణము గావలయునుగదా?

జన—చిత్తము. ఇదిగోఁ! బ్రయాణమునకు సన్నాహముఁ జేయించెదను—

దశ—మంచిది. (నిష్క్రమింతురు.)

---

౧౦ రంగము.

ప్రదేశము - అరణ్యము.

(ప్రవేశము—రామలక్ష్మణులు, దశరథుఁడు, వసిష్ఠుఁడు, మఱికొందఱు రథారూఢులై)

దశ—వసిష్ఠమునీంద్రా! మనము బయలుదేరినది మొదలు మార్గమున నన్నియు నపశకునంబులే చూచుచున్నారము. దీన మనకేమియుఁ గీడుగలుగదు గదా?

వసి—అమంగళ మేమియు లేదుకాని మనకుఁ గన్పట్టు నీశకునములన్నియు నేదేనొక భయము గలిగి యది నివారణమగునని సూచించుచున్నది.

రామ—(ప్రక్కకుఁజూచి) జనకా! గురువర్యా! ఆవచ్చుచున్న మహాత్ముఁ డెవ్వడో చూడుఁడు!

తే॥ చండమధ్యందినోగ్ర మా ♦ ర్తాండుమాడ్కి
బ్రహ్మతేజంబు మోముపైఁ ♦ బరిఢవిల్ల
భుజముపై గండ్రగొడ్డలిఁ ♦ బూనివచ్చు
సీ మహాదివ్యపూరుషం ♦ డెవ్వడొక్కొ?

దశ—(ఉలికిపడి) ఇంకేమున్నది? రాజకులాంతకుఁడగు నాపరశురాముఁడేమైయు వచ్చెను. అయ్యో! అయ్యో! ఇప్పుడేమిచేయవలెను. గురువరా! కర్తవ్యముపదేశింపుఁడు.

రాము—తండ్రిగారూ! మీకింత భయమెందులకు? మనల నతఁడేమి చేయఁగలఁడు

(ప్రవేశము - పరశురాముఁడు)

దశ—దేవా! నమస్కారము.

రాము—బ్రాహ్మణోత్తమా! నమస్కారము.

పర—నమస్కారములకేమిగాని ముందు నేనువచ్చిన కారణము వినుము.

తే॥ గీ॥ ఘనపరాక్రమమున నల ♦ జనకునింట
నమరులకునైన దుర్ధరం ♦ బైతనర్చు
శూలి విలు విఱచిన బల ♦ శాలివంట!
చూడవచ్చితి నీలావు ♦ శూరవర్య!

దశ—(చేతులుమోడ్చి) మహాత్మా! పసిపాపయగు మారామునకు మీరు పరీక్షింపదగిన శౌర్యమున్నదా? కల్పవృక్షము దుర్వసగిరిపురింబోలు మీరెక్కడ? కసికందు వీఁడెక్కడ? మారాముని దయఁజూడుఁడు.

పర—ఆఁ! ఏమి? వీఁడును రాముఁడా?

రాము—ఔను - నేనును రాముఁడనే.

పరుశు—ఓరీ! అల్పుఁడా!

తే॥ గీ॥ నాగురుండగు హరుని బా ♦ ణాసనంబు
విఱచుటయె గాక రాముండ ♦ ధరణినుండ
నేను రాముఁడ ననిపల్క ♦ దీవు, నిట్టి
రాములును గీములును నాకు ♦ లక్ష్యులొక్క?

అపన్నగాభరణుం డెన్నిదినంబులో వాడుకొని యువ్వెఁ బాఱవైచి యనంతరము తుప్పుపట్టిన విల్లు విఱచుట యొకప్రజ్ఞ యనుకొనుచుంటివా నిక్కముగ నీవొక చిక్కని బంటవేని నాయీబాణాసనము నెక్కువెట్టుము (ధనువునొసంగును)

రాము—(అందికొని) ఇదిగోఁ! జూడుము. ఎక్కిడుచుంటిని. (అట్లుచేసి) ఇప్పు బాణమున నీచరణముల ఖండించెదను.

పరశు—(తెల్లపోయిచూచుచు) ఏమిది? వింతగానున్నది. (యోజించి) వింతయేమియులేదు. ఇతండాచతుర్భుజుండు గాని మానవుండుగాండు (చేతులు జోడించి) మహాత్మా! ఆర్తత్రాణపరాయణా! నారాయణా! లీలామానవవిగ్రహా! లక్ష్మీమనోహరా! నీమహిమంబు దెలియ నెంతవారైన నసమర్థులు. మూర్ఖుండనై నీయెడ నపరాధంబొనర్చితి. దయాంతరంగుడవై మన్నించి కోపం బుడిగి ప్రసన్నుండవు గమ్ము. నేనదినంబును మహేంద్రాచలంబున కరుగవలయును గావున నాపదంబుల ఖండింపకుము. నీకిదే మ్రొక్కెద. (నమస్కరించి) నాకింక ననుజ్ఞ యిమ్ము. పోయివచ్చెద.

రాము—మంచిది. పోయిరండు.

(పరశురాముండు నిష్క్రమించుచున్నాండు.)

దశ—కుమారా! మనమిప్పటికీ గండము గడచి బయటం బడితిమి. ఇంకం ద్వరగ నయోధ్యకుం బోదము. రమ్ము.

(నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రథమాంకము.






## ద్వితీయాంకము.

---

౧ రంగము.

ప్రదేశము - కైకమందిరము.

ప్రవేశము - మంధర.

మం—(స్వ) దశరథుఁడు వృద్ధుఁడగుటచేఁ దనకగ్రతనూజుఁడగు రాముని వసుంధరాతలమునకుఁ బట్టభద్రునిఁ గావింపఁదలఁచి పురమలంకరింప నాజ్ఞాపించినాఁడఁట. ఈదుర్వార్త వినినప్పటినుండియు నాకుఁ గడుపు కోఁతగానున్నది. ఎట్టులైన నిప్పుడీ పట్టాభిషేకోత్సవమునకు విఘ్నముగావించినఁగాని నామనసు కుదుటఁబడదు. అందులకై కైకకు దుర్బోధలు చేయవలయును. ఈమె యేమి చేయుచున్నదో పిలిచిచూచెదను. (ప్ర) కైకా! కైకా! ఎక్కడ?

కైక—(ప్ర) మంధరా! నీవువచ్చి యెంతసేపైనది.

మం—ఎంతసేపైననేమి? వచ్చిననేమి? రాకున్ననేమి? బ్రతికిననేమి? చచ్చిననేమి? నేనింక దిక్కుమాలినదాననై పోవలసి వచ్చెఁగదా?

కైక—ఓసీ! అదియేమీ? అట్లనుచుంటి వెందులకు? ఈకైక నాశ్రయించియున్న నీకెట్టికొఱంతయైనఁ గలుగునా?

మం—సరి, సరి. నీకు గతియున్నగదా నాగతి విచారించుట. తిండిలేనమ్మ తిరి మేమి పెట్టునమ్మా!

కైక—ఆ! అ! ఆదేమే? తిండిలేకపోవుట యేమే? అసందర్భము లాడెదవేమి?

మం—నీవు రాజునకత్యంతప్రియురాలవై యుంటచే నింతకాలమునుండి నీయండనుండి హాయిగాఁ గాలము గడపుకొనుచుంటిని. ఇంకేమున్నదమ్మా!

కైక—ఓసీ! ఏమే అది? ఇంతకాల మత్యంతప్రియురాలనై యుంటినంటివి? ఇప్పు డప్రియురాలనైతినా?

మం—కాకేమున్నదమ్మా? కౌసల్యపైఁగల గాఢానురాగమునఁ గదా రాజేంద్రుఁ డిప్పుడు రాముని బట్టభద్రుం జేయుచున్నాఁడు!

కైక—(సంతోషముతో) ఆ! ఆ! మా రామభద్రుని పట్టాభిషేకమా! నేఁడెంత సుదినము!

మం—ఏడ్వవలసిన దానికి నవ్వెద వేమమ్మా?

కైక—ఛీ! పలుగాకీ! ఏడ్పుట యెందులకే?

మం—నీకు రాజ్ఞీత్వము నేఁటితో సరిగదా? మఱి నీసవతికిఁ గౌసల్యకు రాజమాతృత్వ మబ్బినట్లేగదా? నీవు — నీపుత్త్రుఁడు భరతుఁడు—నీ బానిసనగు నేను—నామాట యెందులకు?—మీ యిరువురు వారికి దాస్యము గావింపవలసినదే కదా? ఏడ్పుగాకిం కేమున్నదమ్మా! ఆ కౌసల్యాదేవి యెంత యదృష్టవంతురాలమ్మా! ఏమో యనుకొంటినమ్మా! ఆ దశరథునకుఁ గౌసల్యమీఁద నింత ప్రేమ యఁటమ్మా! ఇంతకాలమునుండి నీవేమో మురిసిపడితి వేవమ్మా! రాజునకు నీయెడలనే ప్రేమ మధికమైన నీపుత్త్రునకే రాజ్యమొసంగకపోవుట యేమమ్మా! ఇంతకు మీ దినములు మంచివికావమ్మా!

కైక—మంథరా! నీవు నిజముఁబలికితివి. నాసవతి, కౌసల్య కుమారుఁడు రాముఁడు రాజైనపిమ్మట నానాథునకు నాపైఁ బ్రేమయుండుట కల్ల.

మం—నిజమేనమ్మా! ఇప్పుడులేనిప్రేముడి యప్పుడెట్లువచ్చునమ్మా?

కైక—హా! ఇంక నేను నిర్భాగ్యురాలను గదా?

మం—నీపుత్త్రుఁడు భరతుఁడంతకన్న నిర్భాగ్యుఁడమ్మా! నేను మఱింత దురదృష్టవంతురాలనమ్మా!

కైక—మంథరా! నేనిప్పుడేమిచేయుదును? నాథునివలనఁ గలిగిన యీపరాభవాగ్ని నెట్లుసహింతును? నాసవతికుమారుఁడు వసుంధరాపతియై రాజ్యమేలుచుండ మదీయపుత్త్రుఁడు తదీయభృత్యుఁడై నీచదశయం దుండవలసినదా?

మం—నాయేడ్పందులకే నమ్మా!

కైక—నేనింకఁ బ్రాణత్యాగ మొనర్చెదను.

మం—వెఱ్ఱిదానా! నీకంతయవస్థ యేమివచ్చినది? ఈ గడియావఱకింకను నీ

నాథుఁడు నీచేతిలో నున్నాఁడుకాని మించిపోలేదు. సత్వరమే యేదైన నుపాయ మాలోచించి నీతనూజుఁడు రాజగునట్లు చేసికొనుము. లేకున్న నీ వెంతయు దుర్దశ పాలైపోయెదవు.

కైక—అయ్యో! నా కాపాటిభాగ్యము పట్టునా?

మం—నామాటలఁ జెవిఁబెట్టిన నట్టిభాగ్య మవశ్యముపట్టఁగలదు.

కైక—చెప్పుము! ఏదైనను పాయముఁ జెప్పుము, నీమేలు మఱవను.

మం—వినుము. తొల్లి శంబరాసురయుద్ధంబున నీనాథుఁడు నీకు రెండు వరము లిచ్చియున్నాఁడు. ఇప్పుడవి జ్ఞప్తికిందెచ్చి యొకవరంబున నీకుమారుని రాజగునట్లు చేసికొనుము.

కైక—సెబాసు! మంథరా! సమయమునకు జ్ఞప్తికిఁదెచ్చితివి. ఈ మణిహారము బహుమతిగాఁ గొనుము. (ఇచ్చును.)

మం—(పుచ్చుకొని) నీయనుగ్రహమున్నఁ జాలును.

కైక—మంథరా! నాకింక నొకశంక పొడముచున్నది. సత్యబద్ధుఁడై రాజు యే వేళ నాతనయునకు రాజ్యమిచ్చినను రాముఁ డీర్ష్యచే సమయముఁ జూచుకొని యేదేని హానిఁ గావించునేమో?

మం—నిజమేనమ్మా! అయిన దానికొక యుపాయముఁ జెప్పెదవినుము —— రెండవవరమున్నదికాదా? రాముఁడు పదునాలుగేండ్లు వనవాసము సేయునట్లు కోరుకొనుము. అంతఁ బితృవాక్యపరిపాలనార్థమై రాముఁ డరణ్యమునకేఁగఁగలఁడు. నీకుమారుఁ డప్పుడు హాయిగా రాజ్య మేలుకొనఁగలఁడు. పదునాలుగువత్సరముల వనవాసమొనర్చి రాముఁడు బ్రదికివచ్చినఁ జూచుకొందము.

కైక—చక్కనియాలోచనఁ జెప్పితివి. ఇఁక రాజును రానిమ్ము. ఎట్లో మాయచేసి నాయావచ్ఛక్తి నుపయోగించి రెండువరములు గొనెదను. నీవు మాత్ర మెల్లప్పుడు నాకు సాయముగ నుండుము

మం—దానికేమిగాని నీవిఁక రాజువచ్చుసరికి శయ్యాగృహమునఁ జీఁకటికొట్టులో నొకమూలఁ బడియుండుము. ఆయనవచ్చిన వెనుకఁ గృత్రిమకోపము నభినయించి వశ్యునిగఁ జేసికొని కార్యమును సాధింపుము. కార్యమంతయు నీ తెలివితేటలలో నున్నది. వింటివా?

కైక—నీవుచెప్పినట్లు చేసెదను.

మం—నేనింకఁ బోయివచ్చెదను.

కైక—మంచిది.

మం—(నిష్క్రమించును)

కైక—(స్వ) నేనిప్పు డీవేషముఁ దీసివేయవలయును.

(నిష్క్రమించుచున్నది.)

---

౨ రంగము.

ప్రదేశము - కైక యంతఃపురము.

(ప్రవేశము - ముసుఁగుపెట్టుకొని యొకమూలఁ బరుండి కైక-కొంతదూరమున దశరథుఁడు)

దశ—(స్వ) ఏమిది? మందిరమంతయుఁ గళాహీనమై యున్నదేమి? నా ప్రియుతన్వి కైక గానరాదేమి? (అటునిటు వెదకి కైకనుఁ జేరి) ఓహో! కైకేయి శయనించియున్నది. ఈ సుందరాంగి విచారగ్రస్తయై యున్నట్లు తోఁచుచున్నది? ఎందులకో? పలుకరించి చూచెద. (ప్ర)

ఉ॥ ఓ వనితాలలామ! యిటు ♦ లుగ్రతఁ బూనితివేల నావయిన్?
నీ వదనేందుబింబమును ♦ నేఁడిటు లేల ఘనాంశుకంబుచే
నీవిధిఁగప్పియుంచితి వ ♦ చింపుము చ చదపాంగదృష్టి ని
న్నేవకుఁజూచి ధన్యునిగఁ ♦ జేయుము మాఱుపచింపు ముగ్ధలీ!

(కొంచెము ముసుఁగుదీయుచున్నాఁడు.)

కైక—(విదలించుకొని) చాలుఁ జాలు. దూరముగఁబొమ్ము. నన్నంటవలదు.

దశ—సఖీ! యెందుల కీకోపము? నావలనఁ గలిగిన లోపమేమి?

కైక—ఎంతమాట? నీవలన లోపముగలుగునా? లోపమంతయు నాదే—నీకేమో నాపై ననురాగ మధికమని యింతకాలమునుండి నమ్మి మోసపోయితిని! నా తెలివితక్కువ నన్నిఁతచేసినది.

దశ—తన్వీ! కారణములేక నన్నేలదూరెదవు?

కైక—నీవు నన్ను విడిచిపోయి యెంతసేపైనది?

దశ—బాలా! యీమాత్రమున కేనా యింతటికోపము? రాముని పట్టాభిషేకము గావునఁ దత్ప్రయత్నములు సేయుటయందు నీమాత్ర మాలస్యమైనది.

కైక—అవును. నీకు రాముఁడు పట్టభద్రుఁడైనఁ జాలును. కైకేయి యెట్లు చచ్చిననేమి?

దశ—అమంగళము ప్రతిహతమగుఁగాక! మానినీ! ఏమిమాటలివి? నీ కేమికోరిక గలిగినదో వచింపుము తీర్చెదను. తుదకు నాశిరమైన నిచ్చెదను.

కైక—ఇదివఱ కిచ్చెదనని వాగ్దత్తమొనర్చిన విచ్చినఁజాలును. నేఁడు క్రొత్తగా నీయ నక్కఱలేదు.

దశ—నే వాగ్దత్త మొనర్చినదేమి?

కైక—అదియు మఱచితివా? ఔను! నీ కాకౌసల్యను రామునిఁ జూచిన సమస్తమును మఱపునకు వచ్చును. ఇఁకఁ గైకేయి యొకలెక్కయా? తొల్లి శంబరాసురయుద్ధంబున నాకు రెండువరము లిచ్చియుంటివి. ఇప్పుడైన జ్ఞప్తికి వచ్చెనా?

దశ—ఔను.

కైక—నాకిప్పు డా రెండువరములు దయచేయవలయును.

దశ—అవశ్యమిచ్చెదను ఇంతమాత్రమున కింత వాగ్వివాదమేల? కోరుకొనుము.

కైక—అసత్యమాడవుగదా?

దశ—కాంతా! యీదశరథుఁ డిదివఱ కేనాఁడైన నసత్యమాడెనా? ఈ సందేహమేల? వేఁడుకొనుము.

కైక—గట్టిగ నిచ్చెదనంటివి గావున వేఁడుకొనుచుంటిని. ప్రథమవరము నాపుత్త్రుని భరతుని రాజుసేయుట— ద్వితీయవరము రామునిఁ బదునాలుగుసంవత్సరము లరణ్యావాసము గావింపఁబంపుట—

దశ—(గుండెలుగొట్టుకొనచు) హా! హా! కఠినాత్మురాలా! ఎంతమాటాడితివే! ఎంతద్రోహము దలపెట్టితివే! ఎంతమాయఁ బన్నితివే! ఛీ! ఛీ! నీముఖముఁ జూడరాదు. నీతో మాటలాడరాదు. నిన్నుఁ బాపమనరాదు. దర్వీకరభీకరంబైన మత్కరవాలంబున నిన్నింతింత ముక్కలుగఁగోసి గ్రద్దలకు వైచెదను. నీనాలుక ఛేదించెదను. నీకావర మడంచెదను

ఉ॥ ఒక్కనిమేషమైన నిఁక ♦ నోర్తునె? భీషణ కాలసర్పము
న్నొక్కెడ దాపరించితివి ♦ సీ! కులనాశ మొనర్ప; నాఁడు ని
న్నక్కట రాజనందిని వ ♦ టంచు వరించితిఁ, గాక నేఁడు ని
విక్కరణిం బొనర్తువని ♦ యెన్నఁడెఱుంగను గాదె దుర్మతీ!

పాపాత్మురాలా! పరమశాంతుండును సుగుణవిరాజితుండునై లోక మెల్ల మేలు మేలన వాసిగన్న నాముద్దులపట్టిని శ్రీరామభద్రుని నట్టడవులకుఁ బంపనెంచితివా? నాపాప నీకే మపకార మొనర్చెను?

కైక—రాజా! ఎందుకీ వాగ్వాదము? పరమధార్మికుఁడవనియు, సూర్యవంశసంజాతుండవగుటచే సత్యసంధుఁడవనియు గట్టిగ నిచ్చెదఁ గోరు కోరుమని బలవంతపెట్టినవాఁడవుగావునను వరములడిగితిని. తొలుత నీవిట్టివాఁడవని యెఱింగియున్న నే నిన్నడిగియుందునా? పోనిమ్ము—ఇప్పు డేమిపోయినది. నాకు వరములువలదు. ఈప్రాణములు వలదు—ఇదిగో! విషముఁద్రావి ప్రాణత్యాగ మొనర్చెదను—పిమ్మట భరతుని వధించి నీవును రాముఁడును నిరాటంకముగ నిష్కంటకముగ రాజ్యమేలికొనుఁడు. (పోఁబోవును.)

దశ—(పట్టుకొని) కైకేయీ! కొంచెమాఁగుము (స్వ) స్త్రీ లెంతకైన సాహసింతురు. హా! దైవమా! నారాముని నాసుగుణాభిరామునిఁ గానల కెట్లంపుదును? ప్రాణము లెట్లుభరింతును? (ప్ర) ఓకైకేయీ! కైకేయీ! నీయిచ్చవచ్చినట్లు నీపుత్త్రుని భరతుని రాజొనర్చెదఁగాని నాయందు దయయుంచి రాముని వనముల కంపవలసినవరము వదలుకొనుము. నాప్రాణములైన విడచెదఁగాని నాకులవర్ధనుని శ్రీరామభద్రుని విడువఁజాల. నాకుఁ బుత్త్రభిక్షఁ బెట్టుము.

కైక—నాకింకఁ బలుమాటలతోఁ బనిలేదు—వరములిచ్చెదవా? ప్రాణములఁ బాయుమనెదవా?

దశ—అక్కటా! ఇంక నేమిగతి? హా! రామభద్రా! నాయనా!

గీ॥ తండ్రి! సింహాసనమునఁ గూ ♦ ర్చుండఁబెట్టి
కనులపండువుగాఁ జూడఁ ♦ గాంక్షవడెడు
నేను, నట్టడవులలోన ♦ నిన్నుఁద్రోసి
యేగతిని పాడుప్రాణంబు ♦ లింక భరింతు?

హా! ముద్దులతండ్రీ! చేసేత నిన్నరణ్యముల కెట్లంపుమనోయీ! నాపాపపుపొట్టఁ గానకుఁ బొమ్మని యెట్లందునోయీ! నీమాత కౌసల్యమోము

నింక నెట్లుచూతునోయీ! రామా! రామా! (తలవంచి కన్నీళ్ళు విడచుచున్నాఁడు.)

కైక—నృపాలా! వరము లిచ్చెదవా? లేదా?

దశ—(మాటాడకుండును.)

కైక—మాటాడవేమి? ఈటక్కులు నాకడ సాఁగిరావు. ఇట్లేల నిశ్చేష్టుఁడవై యున్నాఁడవు? తెలిసినది. కౌసల్యకు వెఱచి యిట్లు సందేహించుచున్నాఁడవు—ఆఁడుదానికి నడలిపోవు నీవిట్లు తొలుత స్వతంత్రించుట యెందులకుఁ వరములిచ్చెద వేఁడుకొనుమనుట యెందులకు? ఇప్పుడిట్లు చింతించు టెందులకు?

(నేపథ్యమున మంగళధ్వనులు.)

ఏమో! మంగళధ్వనులు వినవచ్చుచున్నవి. ఓహో! ఇదియంతయు రాముని పట్టాభిషేకసన్నాహము కాఁబోలు? అప్పుడే తెల్లవాఱినది. (తెర వంకఁజూచి) అదిగో! రాజును బిలుచుటకై కాఁబోలును సుమంత్రుఁడు వచ్చుచున్నాఁడు. ఈయన దుఃఖవశమున మాట లుడిగియున్నాఁడు. నేనిప్పుడొకయుక్తిఁ బన్నవలయును.

సుమంత్రుఁడు—(ప్రవే) మహారాజా! జయము. జయము.

కైక—ఏమిపనిమీఁద వచ్చితివి?

సుమ—అమ్మా! తెల్లవాఱినది. పట్టాభిషేకార్థమై సకలసన్నాహములు చేయఁబడినవి. రాజులందఱు విచ్చేసి యభిషేకమంటప మలంకరించియున్నారు. లగ్నము వేళ సమీపించినది. మహారాజుగారు రానందున నేనిటకు వచ్చితిని.

కైక—సుమంత్రా! అది యటుండనీ—మొదట మహారాజుగారి యాజ్ఞయైనదని రామభద్రు నిటకుఁ గొనిరమ్ము.

సుమం—చిత్తము— (నిష్క్రమి)

కైక—ఇప్పుడు రాముఁడు రాఁగలఁడు. ఈయన యెట్లును రామునిఁ దననోట నరణ్యమునకుఁ బొమ్మని చెప్పఁజాలఁడు. నేను తండ్రిచేసిన వాగ్దానమును రామున కెఱింగించెదను. అంత నాతఁడు తండ్రిమాట నిర్వర్తింప వనముల కేఁగఁగలఁడు. నాసంకల్పము సిద్ధింపఁగలదు. వాఁడుగో! రాముఁడు సీతాలక్ష్మణసహితుఁడై వచ్చుచున్నాఁడు.

(ప్రవేశము—రామలక్ష్మణులు, సీత, సుమంత్రుఁడు.)

రాము—(దశరథునిఁజూచి) ఏమిది? జనకుఁ డేలకో చింతాక్రాంతుఁడై యున్నాఁడు.

ఉ॥ వన్నె దొఱంగి యెంతయును ♦ వాఁడిన పద్మముఁబోలు మోమునన్
విన్నదనంబు దాల్చి కడు ♦ విహ్వలభావముఁ దోఁపఁజేయుచున్
గన్నులవెంట బాష్పములు ♦ గాలువలై ప్రవహింపఁ దండ్రి యి
ట్లున్న తెఱంగుఁ జూడఁగఁ గ ♦ డున్ భయమయ్యెడు నాకు నెమ్మదిన్.

కారణమేమో యెఱుఁగసెదఁగాక! (సమీపించి) తలిదండ్రులారా! నమస్కరించుచున్నాఁడను—ఏమిది? తండ్రిగారు నన్నుఁ గన్నెత్తియైనఁ జూడకున్నారు అమ్మా! జనకునివిచారమున కేమికారణము? నాయెడ నేమైన లోపము గలుగదుకదా?

కైక—నాయనా! రామభద్రా! దాఁచిన నేమిలాభము? తెలిపెదను. వినుము. తొల్లి శంబరాసురయుద్ధమున నే నొనర్చినసాయమునకు మెచ్చి మీతండ్రిగారు రెండువరములిచ్చెదమనిరి. వాని నాయక్కఱఁ జూచుకొని వేఁడుకొందునని చెప్పియుంటిని—అవి యిప్పుడిమ్మంటిని. మొదటివరము నాపుత్రుఁడగు భరతునకు రాజ్యమిచ్చుట—రెండవవరము పదునాలుగువత్సరములు నిన్ను వనములయుండ నాజ్ఞాపించుట—ఇందులకు మీతండ్రిగా రంగీకరించియు నవ్వార్త నీకుఁ దననోట వచింపనేరక యిట్లు మౌనముదాల్చియున్నాఁడు. ఇంతేగాని మఱేమియులేదు—నీ వేమందువు? నీతండ్రిగారిమాట నెఱవేర్చెదవా?

రాము—(చిఱునగవుతో) తల్లీ! ఈమాత్రమునకుఁ దండ్రిగారికింతచింత యెందులకు? ఇంతయు సందేహింపక వనములకేఁగెదను.

లక్ష్మ—అక్కటా! ఇది యేమివైపరీత్యము? పట్టభద్రుఁడుగాబోవు రామభద్రుని దండ్రి యిక్కడకుఁ బిలిపించుటకుఁ గారణ మీదుర్వార్త వినిపించుటకా!

సీత—(స్వ) అక్కటా! విధీ! ఎంతలో నెంతవిపత్తు గలిగించితివి?

తే॥ గీ॥ సకలరాజన్యకోటులు ♦ సన్నుతింపఁ
బట్టభద్రుఁడు గాఁబోవు ♦ ప్రాణవిభుని
ఘోరవనవాస కష్టముల్ ♦ గుడుచుకొఱకుఁ
బంపఁదలఁచితె దైవమా! ♦ పాపివగుచు॥

రాము—సీతా! లక్ష్మణా! మీరు విచారింపవలదు. నేనిప్పుడెంతయు ధన్యుఁడనైతిని ఏమనిన?

తే॥ గీ॥ వేడ్కఁ గనెతల్లి వరములు ♦ వేఁడుటయును
దండ్రి యొసఁగుటయును నవి ♦ తత్సుతుండఁ
నైన నాచే నివర్తింప ♦ నగుటయబ్బె
నింతకన్నను గావలె ♦ నేమినాకు?

సీత—ప్రాణేశ్వరా! నామనవి నించుక యవధరింపవలయును.

రాము—జానకీ! అదియేమి?

సీత—

ఉ॥ వీఁకనరణ్యభూములకు ♦ వేగమ మీరలుపోవ నొంటినై
మీకడఁ బాసియుందునని ♦ మేమము, తీవ్రవిభవద్వియోగ దుః
ఖాకులచిత్తనై బ్రదుకఁ ♦ గాఁ గలదాననె? నన్నుఁగూరిమిన్
జేకొనిపొందు కానలకు ♦ శీఘ్రము మీ వెనువెంట వచ్చెదన్॥

రాము—దేవీ! ఇది యేటికోరిక? శరభశల్యభల్లూకాది మహామృగ భయంకరంబులగు వనంబులకు నబలవగు నీవు రాఁజెల్లునా? అసూర్యంపశ్యవగు నీవెక్కడ? వనవాసమెక్కడ? నగరములందుఁ గలుగుభోగమ్ము లందుఁ గలుగనేరవు. వినుము.

సీ॥ భర్మనిర్మితఘన ♦ ప్రాసాదములుగావు
లఘుపర్ణమయమంది ♦ రములుగాని
లలితచిత్రితనువ ♦ ర్ణదుకూలములుగావు
తరువల్కలాంబర ♦ తతులుగాని
ఆతతమృదులశ ♦ య్యాతలంబులుగావు
పటుతృణరచిత త ♦ ల్పములుగాని
రాజితమందిరా ♦ రామసీమలుగావు
ప్రకటకాంతార మా ♦ ర్గములుగాని
తే॥ గీ॥ దివ్య మధురలసత్పదా ♦ ర్థములుగావు
వనకుటజలబ్ధ ఫలమూల ♦ గణముగాని
ఇంతి నాతోడ నడవుల ♦ కేఁగుదెంచి
కష్టములకేల పాల్పడఁ ♦ గడఁగెదీవు?

నామాటవిని నే మరలివచ్చువఱకు నత్తమామలకడ నుండుము.

సీత—ప్రాణేశ్వరా! నన్నొంటిగ విడచిపోవుటకు మీకు మనసొప్పుచున్నదా?

తే॥ గీ॥ అగ్నిసాక్షిగ వరియించి ♦ నట్టిచెలియ
నకట సహధర్మచారిణి ♦ నైననన్ను
నీవిధంబున విడనాడి ♦ పోవనౌనె?
యఖిలవేదోక్త ధర్మజ్ఞు ♦ లైనమీరు.

రాము—(స్వ) నేను నీకాంతను విడచియుండఁజాలను. వెంటఁదీసికొని పోవుద మన్న నీసుకుమారి వనవాసకష్టము లనుభవింపఁగలదాయని విచారము గలుగుచున్నది. ఏమిచేయుదును?

సీత—నాథా! మీరు సంశయింపవలదు.

తే॥ గీ॥ విమలకాసార సంస్థితి ♦ విడచెనేని
పద్మినీలత కళవీడి ♦ వాడునట్లు
జీవితేశునిఁబాసి సు ♦ శీలమైన
చాన క్షణమైన బ్రిదుకంగఁ ♦ ♦ జాలదెందు!

కావున నాబ్రిదుకు మీకిష్టమేని నన్నుఁగూడ మీవెంటఁ గొనిపొండు.

రాము—రమణీమణీ! నీవు శ్రమపడుదువని యిట్లనుచున్నాఁడను. కాని నేను మాత్రము నిన్ను విడిచియుండఁగలనా? అట్లే వత్తువుగాని చింతఁదక్కుము.

సీత—ఇప్పుడు ధన్యనైతిని.

లక్ష్మ—అక్కటా! కుసుమకోమలయగు నీమెగూడ వనముల కేఁగవలసివచ్చెనే! ఈకైక—ఈపిశాచి—యెంతపనిఁ జేయుచున్నది! (ప్ర) అగ్రజా! నీవెంతయు నశక్తునివలె నామె చెప్పినంతమాత్రమునఁ బత్నీసహితముగ నడవుల పాలైపోవఁ జూచుచున్నాఁడవు. ఈమతిమాలిన రాజు—ఈమాయలాఁడి మాటలకు లోఁబడి యిట్లుచేయుచున్నాఁడు. ఈతం డెప్పుడో యీామెకేవో వరములిచ్చినాఁడఁట! ఈవరము లీమెయు నీతఁడునుదప్ప నితరులెఱుంగరు—అన్నన్నా! స్త్రీలోలుండై యీభూపాలుం డెంతద్రోహముఁ దలపెట్టె?

మ॥ చెలయఁగా రాజసభాంతరాళమున నిం ♦ వేడ్కన్ సమస్తావనీ
స్థలికిన్ బట్టముఁ గట్టువాఁడనని తే ♦ త్సన్నాహముం జల్పి, నీ
కొలదిన్ జూడక పంపఁజూచునె నినున్ ♦ ఘోరాటవీవాటికిన్
సెలవిమ్మిప్పు డయోధ్యయంతయును భ ♦ స్మీభూతముం జేసెదన్ ॥

రాము—తమ్ముఁడా! శాంతింపుము. పూజ్యులగు తండ్రిగారి నట్లు దూషింపవలదు. ఆయన సత్యవాక్పాలనార్థమై యిట్లొనర్పవలసి వచ్చినది.

లక్ష్మ—ఏమిసత్యము? నిన్నుఁ నేఁడు భూతలంబునకు నిన్నుఁ బట్టభద్రునిఁ గావింతు'న నెల్లవారితోఁ బలికి యిప్పు డిట్లొనరించుట సత్యమా? ఇదియంతయు నసూయాపరవశుండై యీభరతుఁడు పన్నిన పన్నుగడ. (కోపముతో భరతు నుద్దేశించి) ఓరీ! తుచ్ఛుఁడా! భరతా! నాయగ్రజునియెడ నింత మహాపకారము దలపెట్టిన నిన్నుఁ బ్రాణములతో విడతునా?

ఉ॥ ఓరి మహోగ్రపాతకుఁడ! ♦ యోరి జడాత్ముఁడ! రామచంద్రుఁ డిం
పారఁగఁ బట్టభద్రుఁడగు ♦ టారయనేరక క్రొవ్వి విఘ్నమీ
తీరునఁ జేయఁ జూచితె? మ ♦ దీయమహోగ్ర ధనుర్విముక్త దు
ర్వార శిలీముఖాగ్ని శల ♦ భంబుగ నిన్వొస మాడ్చివేయనే?

అగ్రజా! శ్రీరామచంద్రా! ఆలస్యమేల? ఆజ్ఞయిమ్ము.

రాము—సోదరా! ఇట్లేల త్వరపడెదవు? నాచెప్పఁబోవువాక్యంబు లొక్కింత శాంతుఁడవై యాకర్ణింపుము. వరములు వేఁడిన కైకేయి మనతల్లి. వరము లొసఁగిన మహారాజు మనతండ్రి. రాజ్యమేలనున్నవాఁడు మనసోదరుఁడు భరతుఁడు. ఇందితరు లెవ్వరును లేరు. కావున మనపరాక్రమము నిందెవ్వరియందునుఁ జూపఁదగదు. ఇంతియేగాక నేను దండ్రిగారిమాటను జెల్లించి తీరెదను. కావున నాపూనిక నిర్వహింపఁ జేయుటయే నీకుఁ గర్తవ్యము. నీవు భరతునికడనుండి రాజ్యమేలించుచుండుము. నేను బదునాలుగేండ్లు వనవాసముఁ జేసి సుఖముగఁ దిరిగివచ్చెదను.

లక్ష్మ—అగ్రజా! మీరు లేకున్నఁ బాడువడిన యీ యయోధ్యయందు నేనుండ జాలను. దయయుంచి నన్నుఁ గూడఁ గొనిపొండు.

రాము—తమ్ముఁడా! భరతునకుఁ దోడుగ నయోధ్యలో నుండక నాతో నడవుల కేల రాఁదలంచెదవు? వలదు.

లక్ష్మ—మీరు నన్నీవిషయమున ననుగ్రహింపకున్న నిప్పుడే ప్రాణములవిడిచెదను. మీ పదములకన్న నాకీ భరతుండును నయోధ్యయు నధికముగాదు.

రాము—అట్లైన నీవుగూడ నా వెనువెంట నరుదెంతువుగాని, తొలుత మనమిప్పుడు తండ్రిగారికడ ననుజ్ఞఁ గైకొనవలయును. (తండ్రితో) జనకా!

దశ—(లేచి రామునిఁ గౌఁగిలించుకొని) హా! తండ్రీ! రామభద్రా! రామభద్రా! నిన్నీపాడుకైక యెంతచేయుచున్నదిరా! నాయనా! హా! ముద్దులపట్టీ! నిన్ను విడిచి నేనెట్లు బ్రదుకుదును?

రాము—తండ్రీ! ఊఱడిల్లుము.

తే॥ గీ॥ అడవులందును బదునాలు ♦ గబ్దములును
గడగి పదునాల్గుదినముల ♦ కరణిఁగడపి
శీఘ్రకాలంబుననె పురిఁ ♦ జేరవత్తు
మనఘ! సెలవిమ్ము మనమున ♦ వనటమాని॥

దశ—హా! తండ్రీ! ఏమని సెలవిత్తునురా? నాయనా!

ఆ॥ వె॥ మామగారుపిలువ ♦ మగువతో నత్తింటి
కేఁగివత్తు సెలవు ♦ నీయుమన్న
'ఉహుహు,' యనెడువాఁడ ♦ 'ఊఁ! పొ'మ్మనుచు నని
కెట్లు సెలవునిత్తు ♦ నిపుడు? తండ్రి!

ఓసీ! దురాత్మురాలా! కైకా! ఇలునెడలియుండఁగని యీ సీతాసతిక
సైతము నీమూలమున నెంతకష్టము గలుగుచున్నదే? ఓయీ! సుమంత్రా!
పట్టణమున కెంతయు నలంకారభూతుండగు రామభద్రుఁ డడవులకేఁగ
నింక నాకీభోగములును—ఈ సంపదలు నెందులకు? కావున సప్త చతురంగ
బలములతోడను, మంత్రులతోడను, దాసదాసీజనములతోడను, ప్రజల
తోడను సీతారామలక్ష్మణులతో నరణ్యమునకుఁ బొమ్ము—పిమ్మట కైక
తనకుమారునితోఁగూడి కళాహీనమును బ్రజాహీనమును సర్వశూన్యమును
నగు నీనగరమును బాలించునుగాక! పిన నీవిమ్మ మేమిమూలఁ గట్టు
కొనునో చూతము!

సు—మహాప్రసాదము.

కైక—(కోపముతో) ఏమి? రాజా! ఇదియా నీసత్యము? సీతారామలక్ష్మణులిప్పుడు
నాకన్నులయెదుట సర్వభూషణములఁ దీసివైచి నారచీరలుధరించి వనముల
కేఁగవలయును. అట్లులైన వరము లిమ్ము. కాదేని నసత్యవచనుఁడవు గమ్ము.
నాదారి నేను జూచుకొందును.

దశ—ఛీ! దుష్టురాలా! నీయాటలింక సాఁగవు!

(ఖడ్గమెత్తి నఱుకఁ బోవును.)

రాము—(ఖడ్గముఁ బట్టుకొని) తండ్రీ! యిట్లు త్వరపడఁజెల్లునా? అమ్మగారియానతి
యొప్పున నిప్పుడే కాషాయాంబరములు గట్టుకొని వనమున కేఁగెదము—
అమ్మా! నామనసాక్షిపై నలుకమానుము. నీమాటప్రకారమే యట్లే యాచ
రించెదము.

దశ—హా! తండ్రీ! కిరీటాదులధరించి సింహాసనాసీనుఁడవైయుండ నినుఁజూడగల్గుదు నని సంతసించుచున్న నేను నాపాడుకన్నులతో నీవు మునివేషముధరిం నెట్లు భరింపఁగలనురా తండ్రీ! నీవియోగము నే నెట్లుసహింతును? నేనిం నెవరింజూచుకొని మనము వహింతును? ఈయపారదుఃఖము నెట్లపనయిం తును? హా! పుత్త్రా! హానాయనా! హా! నాప్రాణమా! హా! నాసర్వస్వమా హా! రామభద్రా! రఘుకులాంబుధి చంద్రా! రామా! రామా!

(మూర్ఛిల్లును.)

రాము—జనకా! సర్వజ్ఞుఁడవు నీవిట్లుదుఃఖింప నేనేమనఁగలను? (పరికించి) తమ్ముఁడ తండ్రిగారు దుఃఖవశమున మూర్ఛమునింగి యున్నారు. మనమింక వల్క లాంబరముల ధరించి తల్లులకడ ననుజ్ఞగొని వనములకేఁగుదము. అమ్మా! నారచీరలు దెప్పింపుము—ధరించుకొందుము.

కైక—మంచిది. రండు. (సీతారామలక్ష్మణులతో నిష్క్రమించును.)

యవనిక జారును.

---

## 3 రంగము.

ప్రదేశము - గంగానదీతీరము.

(ప్రవేశము - సీతారామలక్ష్మణులు రథారూఢులై సుమంత్రునితో)

రాము—సోదరా! ఇదిగోఁ ద్రిలోకపావనియగు గంగానదిని సమీపించితిమి. చూడుము.

సీ॥ చక్రవాకక్రౌంచ ♦ జాలకాదంబాది
జలవిహంగారావ ♦ కలకలంబు
ఫుల్లహల్లకసితాం ♦ భోజకల్హారాది
పుష్పషండమరంద ♦ పూరితంబు
భయదమత్స్యగ్రాహ ♦ పాఠీనకమఠాది
సలిలజంతువితాన ♦ సంకులంబు
తటవిభాస్వద్విశం ♦ కటయానపాత్రంబు
తతగభీరావర్త ♦ దారుణంబు
గీ॥ గగనచుంబిసముత్తుంగ ♦ ఘనతరంగ
సంచయాన్యోన్య ఘట్టన ♦ సంప్రభూత

సంతతారాప పూర్ణగో ♦ దోంతరాళ
మహాహా గంగానదీ ప్రవా ♦ హంబుగంటె.

లక్ష్మ— తే॥ గీ॥ హరిపదాంభోజ సంభూత ♦ మైనదాని
హరజటాజూటమండన ♦ మైనదాని
నరయ నబ్ధికిఁ బ్రియభార్య ♦ యైనదాని
గంగఁ గన్గొంటిఁగన్నుల ♦ కఱవుదీఱ.

రాము—(సుమంత్రునితో) సుమంత్రా! మాకింక రథగమన మర్హముగాదు. కావున నీవి యరదంబు నయోధ్యకుం గొనిపొమ్ము— మేమిప్పు డీగంగానదినిదాఁటి పోయెదము.

సుమం—శ్రీరామచంద్రా! మిమ్మిట విడచి నేనరుగఁజాలను దయయుంచి నన్నుఁగూడ మీవెనువెంటఁ గొనిపొండు.

రాము—సుమంత్రా! వలదు. నీవుపోయి గంగానదిని వారుదాఁటిరని చెప్పినఁగాని మాతల్లిగారు కైకమ్మ నమ్మదు. కావున విచారముడక్కి నగరాభిముఖుండవుగమ్ము.

సుమం—(దుఃఖముతో) రామచంద్రా! పోవఁగాళ్లు రాకున్నవి? ఏమిసేయుదును?

రాము —నీకెట్లును బోవకతప్పదు.

తే॥ గీ॥ ఏల విలపింప? వైళంబ ♦ యేఁగుమయ్య!
సుతవియోగార్తి మదిగుందు ♦ పితలకడకు
మాజనకునకు మువ్వుర ♦ మ్మలకు మేము
భక్తిమ్రొక్కితి మంచును ♦ బలుకుమయ్య.

సుమం—(దుఃఖముతో) చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు.)

రాము—తమ్ముఁడా! మనమింక గంగను దాఁటవలయును.

లక్ష్మ—రాత్రి మనల సత్కరించిన యాగుహుఁడింకను రాఁడయ్యె నేమి?

రాము—వాఁడుగో! వచ్చుచున్నాఁడు.

గుహు—(ప్ర) బాబూ! దండాలు—దండాలు.

రాము—శబరనాయకా! నీకు శుభము గలుగుఁగాక! మమ్మింక గంగను దాఁటింతువా?

గుహు—సిత్తం. పడవెక్కి తారుగాని రాండి.

రాము—మంచిది. (అందఱు నిష్క్రమింతురు.) యవనిక జాఱును.

౪ రంగము.

ప్రదేశము - కైకమందిరము.

ప్రవేశము - కైక—భరతుఁడు.

భర—అమ్మా! మాటాడవేమి? ఎందులకిట్లు చింతించుచుంటివి?

కైక—నాయనా—

భర—తల్లీ! యేమోచెప్పఁబోయి మిన్నకుంటివేమి? ఏమైన దుర్వార్త వినవలసి రాదుగదా? పలుకవేమి? అయ్యో! కన్నీరునించెదవేమి?

ఉ॥ ఉల్లములోనఁ దల్లడిలు ♦ చున్నటు గన్పడుచుంటివమ్మ! యే
బల్లిదమైనపాటు మహిఁ ♦ బాటిలెనో వచింపవమ్మ! మా
తల్లులుఁదండ్రియుం సుగుణ ♦ ధాముఁడు రాముఁడు లక్ష్మణుండు ను
త్ఫుల్లదళాక్షి జానకియుఁ ♦ బొల్తురఁటమ్మ! సుఖమ్మువారికిం?

కైక—నాయనా! అందఱు సుఖులేకాని మీతండ్రిగారు.—

భర—ఆఁ! ఆఁ! ఏమి? తండ్రిగారేమి? చెప్పుము. తల్లీ! చెప్పుము.

కైక—గతించిరి.

భర—హా! తండ్రీ! తండ్రీ! (మూర్ఛిల్లుచున్నాఁడు.)

కైక—(విసరుచు) నాయనా! లెమ్ము.

భర—(లేచి) హా! తండ్రీ! తండ్రీ!

ఆ॥ వె॥ గారమార నన్నుఁ ♦ గాంచి పెంచిన నీదు
ఋణమొకింతయైన ♦ నీఁగనైతిఁ
గడకు మరణవేళ ♦ గరిపెడు తులసి తీ
ర్థమ్ము నొసఁగనైనఁ ♦ దగకపోతి.

హా! రామలక్ష్మణులుగదా యదృష్టవంతులు!

కైక—నాయనా! వారుమాత్రమే యదృష్టవంతులు? వారు మాత్రమందులకు నోఁచిరా?

భర—ఆ! ఆ! వారుగూడ నిక్కడలేరా? ఆదశరథసార్వభౌముఁడు నలువురుఁ బుత్త్రులఁ గనియు దిక్కుమాలినవానివలె నితరులచే దహింపఁబడెనా? హా! విధీ! ఎంతపని జరిగినది? మేమెంత నిర్భాగ్యులమైతిమి?

కైక—నాయనా! మీనాయనగారు దహింపఁబడలేదు. తైలఘటమున నున్నారు.

భర—అమ్మా! ముందక్కడకునడువుము. నాతండ్రిగారిని జూడవలయును.

కైక—కుమారా! నీతో నొకమాటఁ జెప్పవలసియున్నది. కొంచెము నిలువుము.

(నేపథ్యమున)

నిలువుము. గురాత్మురాలా! మంథరా! నిన్నుఁ గరవాలమున కెఱఁ జేసెదను.

(పరుగెత్తుచు మంథరయు శత్రుఘ్నుఁడును బ్రవేశించుచున్నారు.)

మంథర—అమ్మా! నన్నీతఁడు చంపఁజూచుచున్నాఁడు రక్షింపుము.

భర—తమ్ముఁడా! ఇదియేమి?

శత్రు—ఈ రాకాసివలననే యింతకలిగినది? దీనిం జంపినఁగాని నే నూరకుండఁజాలను.

భర—అదియేమి?

మంథ—అమ్మా! నీవు మాటాడవేమమ్మా! రాము నడవులకుఁబంపి భరతుని బట్టభద్రుని గావింప రాజుగారిని నిర్బంధింపుమని నీకు బోధించితినఁటమ్మా!

భర—ఆ! ఆ! రామభద్రు నరణ్యముల కంపుటయేమి? భరతునిఁ బట్టభద్రుని గావించుటయేమి? ఇట్లని నాతల్లి రాజుగారిని బలవంతపెట్టినదా?

శత్రు—బలవంతపెట్టుటయేగాదు—ప్రాణములఁ దీసినది. రామచంద్రుని సీతతోడను లక్ష్మణునితోడను నరణ్యములఁ దోలినది—

భర—హా! హా! యిదియేమి? అమ్మా! ఇదియంతయు నిక్కమా?

కైక—నాయనా! ఇంకఁ దాఁపనేల? ఈ పాపాత్మురాలిమాటలు విని యిట్టివరముల వాంఛించితిని—పితృవాక్యపరిపాలనమునకై రాముఁ డరణ్యముల కేఁగెను—అతనివియోగము భరింపఁజాలక మీ తండ్రిగారు మరణించిరి.

భర—హా! హా! పాపాత్మురాలా! యెంతపనిఁ జేసితివి?

కం॥ ఓరక్కసి! యెపుడేనియు
నీరాజ్యము నెత్తిఁగట్ట ♦ వేయుని నిన్నుం
గోరితినే? యేరీతిని
మారాముని గానకంప ♦ మదిఁ బూనితివే?

హా! నేనెంత నిర్భాగ్యుఁడను!

చ॥ వరసుతు రామభద్రు వని ♦ వారక త్రోయఁగఁ గారణంబయో!
భరతుఁడెగాయటంచు మదిఁ ♦ బ్రాణము వీడెడువేళఁ దండ్రి యె

ప్పరుసున నన్ను నెంచెనో? య ♦ పపృథ నాతల నుంచెనో? కటా!
హరి హరి! యేలపుట్టితి వి ♦ రా యిటునాకనుచుగ్ర దపించెనో?

అయ్యో! పరమసుకుమారుఁడు రఘుశేఖరుఁ డడవుల కరుగుచు నన్నెట్లు భావించెనో? పితృప్రతిమానుఁడగు నగ్రజునకిట్టి పాటుగలుగ నీచుండాలుఁడు భరతుఁడెక్కడ దాపరించెనని యాలక్ష్మణుఁ డెంతయాగ్రహించెనో? తన ముద్దులకూనకు రామచంద్రున కెట్టిగతికల్గెనని మాయమ్మ కౌసల్యాదేవి యెంతదుఃఖించి యెంతగ నన్నుఁ దూలనాడెనో? పరమపతివ్రతాతిలకము సీతమ్మ తనప్రాణనాథునకు సంభవించినయాపద కెంతవిలపించెనో? ప్రజ లెల్ల నాపై నెట్లు దుమ్మెత్తిపోసిరో—హా! యింతకుఁ గారణ మీరాకాసి గదా?

శత్రు—ఇదికూడను—అగ్రజా! మొదట దీనిమట్టుఁబెట్ట నాజ్ఞయొసంగుము.

భర—తమ్ముఁడా! ఈ యిరువురఁ జంపవలసినదేకాని రామాజ్ఞలేనిది మన మీపనిఁ జేయరాదు. ఇక్కడ దండ్రిగారికి దహనక్రియలు గావించి పిమ్మట నార చీరెలుధరించి యరణ్యమునకరగి శ్రీరామభద్రుని పాదములఁబడి ప్రార్థించి యయోధ్యకుఁ గొనివచ్చి పట్ట చంద్రునిగా వింతము. అప్పుడువీరికి ఆమహా త్ముఁడే శిక్ష విధింపఁగలఁడు.వసిష్ఠాదులకడకుఁ బోదము. నడువుము.

(భర, శత్రు నిష్క్రమింతురు.)

మం—ఇదేమమ్మా! తుదకిట్లయిన దేమమ్మా!

కైక—ఛీ! కులటా! నీవలనఁగదా యింతఁగలిగె?

మం—ఏమి కలిగినదమ్మా! నీపుత్త్రునకు రాజ్యముగాదా?

కైక—ఛీ! యింకవాఁడు రాజ్యమంగీకరించునా?

మం—అంగీకరింపఁజేయువలయును. అందుల కుపాయము—

కైక—ఛీ! నోరుమూయుము. ఇదివఱకుఁ జెప్పినయుపాయము చాలును.

(నిష్క్రమించును.)

మం—పోనీ! నాకేమి?

(నిష్క్రమించును.)

౫ రంగము.

అరణ్యము.

ప్రవేశము - సీత, రాముఁడు.

(నేపథ్యమున)

అగ్రజా! ఎక్కడనుంటివి?

రాము—తమ్ముఁడా! ఇటు, ఇటు!

లక్ష్మ—(ప్రవేశించి) అగ్రజా! చూచితిరా, దుర్మార్గుఁడు భరతుఁ డెంతకు సాహసించెనో?

రాము—ఏమి?

లక్ష్మ—

ఉ॥ కైకొనె రాజ్యముఁ జనని ♦ కైకసహాయమొనర్ప, నంతతోఁ
బోక యిదే దురాత్ముఁడు ♦ మూఢుఁడు మచ్చరమొప్ప సైన్యముం
జేకొని మిమ్ము దాఁకుటకుఁ ♦ జెచ్చెరవచ్చుచునున్నవాఁడు దే
వా! కరుణించి యాజ్ఞనిడు ♦ మా! పలువం బరిమార్తు వ్రేల్మిడిన్॥

రాము—తమ్ముఁడా! వేగిరపడకుము. భరతుని యభిప్రాయ మట్టిదై యుండదు.

లక్ష్మ—రామభద్రా!

(నేపథ్యమున)

రామభద్రా! రఘువీరా! ఎక్కడనుంటివి? రామా! రామా!

రాము—లక్ష్మణా! వాఁడుగో భరతుఁడు వచ్చుచున్నాఁడు! ఆహా! ఈతఁ డీముని వేషమేల ధరించెనో? సోదరా! లక్ష్మణా! మనకిప్పు డాతఁడు ప్రభుఁడుగదా! కావున నెదురేఁగుదము. రండు. (నిష్క్రమింతురు.)

ప్రవేశము—సుమంత్రుఁడు.

సుమ—(స్వ) ఆహా! తండ్రిమరణమువిని రామలక్ష్మణులు భరతశత్రుఘ్నులఁ గౌఁగిలించుకొని విలపించుచున్నారు—జానకి కౌసల్యాదేవియొడిం గూర్చొని యెంతకరుణముగా నేడ్చుచున్నది—వీరిదుఃఖముఁజూడ ఱాలునుగరఁగక పోవు—

(ప్రక్కకుఁ జూచి)

ఓహో! వీరందఱును స్నానమొనర్చి వచ్చుచున్నారు. ఆహా! విధీ! సార్వభౌముని క్రియలు నట్టడవిలోనా?

(ప్రవేశము—రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు, వసిష్ఠుఁడు.)

భర—అగ్రజా! రామచంద్రప్రభూ!

చ॥ నినువనికంపి తండ్రి మర ♦ ణించఁగఁ గారణమైనమారికిన్
దనయుఁడ నౌటఁదప్ప మఱి ♦ తప్పు నెఱుంగ మహానుభావ! నిన్
వనములఁబట్టఁ జేసి మహి ♦ పాలునిఁదన్ను నొనర్పఁదల్లికిన్
గొనకొని బోధసేయు నల ♦ కూరుఁడు ఘోరరుజన్ గతించుతన్॥

రాము—తమ్ముఁడా! ఇదేమి? నిన్నునే నెఱుంగని వాఁడనా?

భర—మహాత్మా! ధన్యుఁడనైతిని. నన్ను మఱింత ధన్యుని గావింపవలయును.

రాము—ఏమి?

భర—అయోధ్యకరుదెంచి పట్టముఁ గట్టుకొని మీరు మమ్మెల్లఁ బాలింపవలయును.

రాము—వెఱ్ఱితమ్ముఁడా!

గీ॥ తండ్రిసత్యంబు నిలుపంగఁ ♦ దలఁచికాదె
యరుగుదెంచితి నీరీతి ♦ నడవులకును
పదియునాల్గు వత్సరముల ♦ పైనిగాక
తిరిగివత్తునె జనకాజ్ఞ ♦ మఱచినేఁడు॥

గీ॥ నాకు వనవాసము విధించి ♦ నాఁడు తండ్రి
నీకు విధియించె రాజ్యము ♦ నేకొనంగ
దీని నేనెఱవేర్చెద ♦ దాని నీవు
వేగనెఱవేర్పఁ బురికింక ♦ వెడలుమయ్య॥

భర—మహానుభావా! నన్నుఁ బొమ్మనుచుంటివా? రాజ్యమేలుకొనుమనుచుంటివా?
నాకయోధ్యవలదు. రాజ్యమువలదు.

గీ॥ త్వచ్చరణసన్నిధియె యయో ♦ ధ్యయగు నాకుఁ
ద్వచ్చరణసేవయే రాజ్య ♦ పాలనంబు
నిన్ను విడిచి యీ యసువుల ♦ నిలుపఁజాల
నిందయుండ వర మనుగ్ర ♦ హింపుమయ్య॥

రాము—భరతా! పితాజ్ఞ నాకుఁబలె నీకాచరణీయముగాదా? మాఱుమాట
డక తిరిగిపొమ్ము.

భర—ఆహా! అగ్రజా! తిరిగిపోవలసినదే? ఊరక తిరిగిపోవలసినదే—పోనిండు—

మహానుభావా! మీరు రాకున్న మీపాదుకలనైవ నోనంగుడు. వానికిఁబట్టముఁ గట్టి ప్రతినిధినై రాజ్యమేలెదను.

రాము—(లక్ష్మణునితో) లక్ష్మణా! చూచితివా భరతుని భక్తి—

లక్ష్మ—అగ్రజా! నేఁ బారవడితిని.

రాము—సోదరా! నీభక్తికి మెచ్చితిని. ఇవిగోఁ బాదుకలఁ గొనుము—(ఇచ్చును.)

భ—(తీసికొని కన్నులకద్దుకొని) ధన్యోస్మి. అగ్రజా! ఈపదునాల్గు వత్సరములు గడచినపిమ్మట మీరు రాకున్న నేనగ్నిప్రవేశ మొనర్చెద.

రాము—తమ్ముఁడా! సందేహింపకుము. తప్పకవచ్చెదను. కాని యొకమాట—మన తల్లిని గైకమ్మనుగాని మంథరనుగాని నీవేమియు ననవలదు—వారినేమైన ననిన నన్ననినట్లుగా భావింతును.

భ—చిత్తము. వసిష్ఠమునీంద్రా! రామభద్రుఁడు లేని యయోధ్యకు నే రా పోపను. నందిగ్రామమునకేఁగి పాదుకాపట్టాభిషేక మొనర్చి యందే వసింతును.

వసి—మంచిది.

(యవనిక పడును)

---

### 6. రంగము.

ప్రదేశము—దండకారణ్యము.

(ప్రవేశము.—రామలక్ష్మణులు—సీత మార్గాయాసము నభినయించుచు)

రాము—హా! హా! నేనెంతకఠినుఁడను? నిరంతరంబును గనకమయ శుద్ధాంతంబుల నుండి యెండకన్నెఱుంగని యీలతాతన్వి నీకుసుమకోమల నీముద్దులగుమ్మను నేఁడెంత మార్గాయాసముపా లొనరించితిని. తమ్ముఁడా! ఇప్పుడీలతాంగి దురవస్థఁజూచిన నెట్టికఠినహృదయమైన జలప్రాయము గాకుండునా?

చ॥ నిటలతటమ్మునన్ ముసురు ♦ నీలకచావళిఁ జక్కఁజేయుచున్
గుటిలమహాతపంబునకుఁ ♦ గొందలమొందుచు ఘోరమైన యీ
యటవిని గాల్నడన్ దిరుగు ♦ నంగనపాటును గన్నులార నే
నెటుఁగనుఁగొందు? నెట్టులు భ ♦ రింతు విషాదభరమ్ము తమ్ముఁడా?

సీత—ఆర్యపుత్రా! మీరిట్లువగవనేల? నాకంతగా శ్రమలేదు.

రాము—హా! జీవితేశ్వరీ! నీశ్రీమను నీవెంతదాఁచినను జలజాకరంబు వెలువడి భానుకిరణంబులఁ గమలిన పద్మినింబోలెఁదోఁచు నిన్నునీక్షించుచు నేనెట్లు సహింతును? అయ్యయ్యో! నిన్నిన్నికష్టములపాల్గొనర్చిన నన్ను నేనేమని దూరుకొందును!

సీత—హృదయేశ్వరా! విధివశంబునఁ దటస్థించు కష్టము లవశ్య మనుభవనీయములై యుండఁ జింతించిన నేమిఫలము? ధైర్యమువహింపుఁడు.

రాము—ప్రాణేశ్వరీ! ఎట్టివిపత్తులనైన ధైర్యమువహింపఁ గలనుగాని నిస్తుల విషాద నిర్మగ్నవగు నిన్నుఁజూచి యెట్లుధైర్యము వహింతు?

సీ॥ ఉండిలేనటు దోఁచు ♦ చున్న మధ్యము నితం
బాతిరేకమున గం ♦ పమువహింప
గమనశ్రీమోద్భూత ♦ ఘర్మాంబుపటలంబు
విరివిగఁ గాల్వలై ♦ ధరణిఁదొఱఁగఁ
బటుతర దుర్వార ♦ చటులచండమయూఖ
తీవ్రదీధితుల మైఁ ♦ దీవవాడఁ
గఠినకంటకములు ♦ గ్రిత గాడుటంజేసి
చరణాంబుజముల నె ♦ త్తురులుగ్రిమ్మ

తే॥గీ॥ అతులితాయాసమున నూర్పు ♦ లతిశయిల్ల
విమలవదనాబ్జ వదనంబు ♦ వెల్లఁబాఱ
నడవఁజాలమిఁ దడబడు ♦ నడుగులిడుచు
నడచు నినుఁగాంచి దుఃఖమ్ము ♦ నడఁపఁగలనె?॥

అక్కటా! రాజోపచారములందు నీకు నేఁడెంత దుర్దశ గలిగెను?

సీ॥ లలితహాటకసౌధ ♦ ముల నీడయే నీకు
రమణి! కాంతారవృ ♦ క్షముల నీడ?
సరసపదార్థ భో ♦ జనసౌఖ్యమే నీకుఁ
గందమూలాహార ♦ కఠిన బాధ?
మంజులానూనకో ♦ మల తల్పమే నీకుఁ
గ్రొల్లంటి పాషాణ ♦ కలితభూమి?
మానితశుకపిక ♦ మధురనాదమె నీకుఁ
గమలాక్షి! హర్యక్ష ♦ గర్జనములు?

తే॥ గీ॥ కనకసోపానయాన సుఖంబెసీకు
అతిభయంకర పటుఘనా హార్యకటక
చటులసానుప్రదేశసం కటము లకట!
జలజమృదుగాత్రి! జనకభూ జానిపుత్రి॥

సీత—నాథా! మీరుమాత్ర మీకష్టము లనుభవింపుట లేదా? మీకన్న నేనధిక రాలనా?

రాము—తన్వీ! పురుషుఁడనగు నేనును నబలవగు నీవును సమానులమా!

సీ॥ నడచితే యెపుడేనిఁ బడఁతి! తీక్ష్ణమహాగ్ర
ఘటిలకంటకచమూ ఘోరభూమిఁ
గంటివే యెపుడేని ఘనదవానలధూమ
విస్ఫులింగాభీల విపినసీమ
వింటివే యెపుడేని వీనుల శార్దూల
శరభహర్యక్షాది చటులరవము
నిలిచితే యెపుడేని నీరజాప్తమయూఖ
తప్తసైకతశిలా స్థలములందు
తే॥ గీ॥ జనకనరపాలుపట్టివై నను వరించి
సంతతముఁ బరిచారికా జనములెల్లఁ
గొలువ సుఖయించునీవిట్లు తలఁపరాని
కష్టములఁబొందుచుంటివే కమలనయన॥

ప్రాణేశ్వరీ! నీవిట్టిదురంతాయాసముపాలు కావలసివచ్చునని యొకదా, నిన్నింటనుండుమని యెన్నియోవిధములఁ జెప్పితిని. నీవు విననైతివి.

లక్ష్మ—(విషాదముతో) ఆహా! విధికృతంబునుదాఁట నెంతవారికైన నశక్యము గదా! దశరథునంతవాని కగ్రసూనుండై యుదయించిన యీమహాత్మునకును జనకునంతవానికి గారాబుకూఁతురైన యీ సీతాసతీమతల్లికిని నిట్లు దీర్ఘకాంతారవాసక్లేశము కలుగుట విధివశంబునఁగాక మఱియేమి? ఎంతవారికెంత హీనదశ కలిగినది?

సీ॥ కమనీయపీతాంబ రములఁదాల్చు ఘనుఁడు
నారచీరలఁదాల్చె నాఁడు నేఁడు
లలితహర్మ్యములఁ గా లముఁబుచ్చు మహనీయుఁ
డడవులఁగాలంబు గడపె నేఁడు

పుష్పకోమలతల్ప ♦ ములనిద్రి గను భోగి
వట్టినేలఁ బరుండ ♦ వలసె నేఁడు
రుచిరపదార్థముల్ ♦ రుచిఁజూచుపార్థివుం
డెలమి దుంపల నార ♦ గించె నేఁడు

తే॥ గీ॥ సకలరాజన్య వరశిర ♦ స్తటకిరీట
ఖచితమణినికరప్రభా ♦ కలితపాదుఁ
డిట్లు నిజపత్నిఁగూర్చి దుః♦ఖించె నేఁడు
అక్కటా! విధికృతము నే ♦ మనఁగవచ్చు॥

(అప్పుడు శూలధరుఁడై యట్టహాసముతో విరాధుఁడు ప్రవేశించును.)

విరా—అహాహా! ఎచ్చటి దీ నరవాసన? త్రిజగద్భయంకరంబును, బ్రళయరుద్రావతారసదృశంబును, నిజదర్శనమాత్ర విభీతపలాయితసకలప్రాణిసమూహంబును, లోకకంటకంబును నయినమహోద్భుతాకారముఁదాల్చి చతుర్దశభువన విదితవిక్రమాటోపయుతుండనైన నాకు నివాసస్థానమై, అన్యదుర్గమమైన యీప్రదేశమందు సింహగుహాంతరముఁజొచ్చి పరిభ్రమించు లేఁడిపిల్లవలెఁ దిరుగు నీమానవాధముఁడెవ్వఁడో వెదకిచూచెదను. (అందందు వెదకి రామాదులనుజూచి) ఓరోరి నరాధములారా! మిమ్మిప్పుడే పట్టుకొని మ్రింగివేసెదనుండుఁడు. (సమీపించి సీతనుజూచి) ఓహో! యీచాన యెవతె? ఎవతెయైననేమి? ఇది నాసొమ్ము. తొలఁగుఁడు (అని హాహాకారములు చేయుచున్న సీత నెత్తుకొని పోవుచున్నాఁడు.)

రామ—హా! హా! తమ్ముఁడా! నాచేత శరాసనముండ నా మేనఁ బ్రాణములుండ నీ ముద్దుఁగుమ్మ యిట్లన్యాయముగ నొక్కదానవుని పాలై పోవుచున్నదికదా. అయ్యో నేనేమిచేయుదును? (దుఃఖించును)

లక్ష్మ—అన్నయ్యా! యిదియేటి బేలతనము?

ఉ॥ లావున రుద్రునైన రణ ♦ రంగమునన్ వెఱపింపఁజాలు నీ
వీవిధినాత్మఁగుందనగు ♦ నే? యొకతుచ్ఛనిశాటుఁ జూచి, ధా
త్రీవర! నీపరాక్రమ వి ♦ జృంభణ మోర్వఁగ నీతఁడెంత, యు
ద్ధావని నీవు కార్ముకము ♦ దాల్ప జగత్త్రయమున్ వడంకదే॥

అగ్రజా! వదినెగారి మూర్ఛాయాసమును జూచుటచేఁ గలిగిన దుఃఖాతిరేకమున నీవు నేఁడు ధైర్యముదూలి మైమఱచియున్నట్లున్నాఁడవు!

నీవట్లు చూచుచుండుము. నేనే యీదురాత్ముని యమాలయంబునకంపి వచ్చెదను. (విరాధునిదిక్కై) ఓరోరి దానవకులాధమా!

ఉ॥ ఓరిమదాంధ! పూతచరి ♦ తోజ్వల నీధరణీతనూజ నీ
తీరునఁబట్టెదే నిలుము ♦ దే రణరంగమునందు నిన్ను మ
ద్ఘోరమహాశరాసనవి ♦ ముక్తశరప్రకరానలార్చులన్
ధారుణిఁగూలఁజేసెద మ ♦ దగ్రజుఁడాత్మఁ బ్రమోదమందఁగా॥

(విరాధుని వెంట నిష్క్రమించును.)

రాము—(ధైర్యముఁ దెచ్చుకొని) ఛే! కుటిలదైత్యా! దుఃఖవశమున నే నన్యమనస్కుఁడనై యుండ నాప్రియకాంతను హరించి పోవుచున్నాఁడవా, ఇదుగోఁ జూడుము. మదీయశరవర్షధారాపరంపరలచే నీప్రతాపానలము నార్పెదను.

(ధనువు నెక్కు వెట్టుచు నిష్క్రమించును.)

(తెరలో)

ఓమహాత్మా! రామా! నాయుదంతంబు వినఁదలఁచితివి కావునఁ జెప్పెద నాకర్ణింపుము. తొల్లి నేను తుంబురుఁడను గంధర్వుండను. కుబేరశాపంబున నిట్లు రాక్షసరూపముఁ గైకొని విరాధుఁడనుపేరఁ బరఁగుచుంటిని. నేఁటికి నాపూర్వపుణ్యము ఫలించుటంజేసి మీవలన శాపవిముక్తిఁ జెందినాఁడను. నేనింకఁ బూర్వాకృతి ధరియించి నాలోకమునకుఁ బోయెదను. మీకు శుభము కలుగుఁగాక. మీరిప్పుడు శరభంగాశ్రమమునకుఁ బొండు.

(రామలక్ష్మణులు, సీత ప్రవేశించుచున్నారు.)

రాము—తమ్ముఁడా! మనచే హతుఁడై గంధర్వత్వముఁ గైకొన్న యీదానవుని చరిత్ర మతివిచిత్రముగ నున్నదికదా!

లక్ష్మ—ఔను.

రాము—(సీతతో) ప్రాణేశ్వరీ! ఎట్టివానికైనఁ గన్నెత్తిచూచినమాత్రమున నతిభీతి గొలుపు నీదానవుని ఘోరాకారముఁజూచి నీవెంత భయమందితివో కదా! మఱియును—

ఉ॥ చెచ్చెరఁబూవు తాఁకినను, ♦ జెన్నగు పున్నమరేయి నొప్పున
వ్వ్యచ్ఛపుఁ బండువెన్నెల ర ♦ యంబున నించుకయేని సోఁకినన్
నిచ్చలు కందికుందఁదగు ♦ నీతను వీఖలుచేతఁజిక్కి నేఁ
డిచ్చట యెంతనొచ్చెనొక ♦ దే ప్రమదాళివినీలకుంతలా॥

లక్ష్మ—అన్నయ్యా! దుష్టరాక్షసాకరమైన యీప్రదేశము మనకు నివాసయోగ్యముకాదు. ఈగంధర్వుఁడు చెప్పినచొప్పున శరభంగునికడకేఁగి యమ్మునీంద్రునివలన నుచితస్థలమెఱింగి యందు మన వనవాసదీక్షఁ గడపుదము.

రాము—అట్లేచేయుదము. (ముగ్గురు నిష్క్రమించుచున్నారు.)

---






# తృతీయాంకము.



(౧ వ రంగము -- పర్ణశాల)

(రామలక్ష్మణులు, సీత ప్రవేశించుచున్నారు.)

రాము—తమ్ముఁడా! మొదటమొదటఁ గొంచెము కష్టముగనున్నను రానురా నీ వనవాసమే మనకు సుఖప్రదముగ నున్నదిగదా? చూడు!

ఉ॥ తక్కక రాజ్యమున్విడిచి ♦ తమ్ముఁడ! వచ్చినదాది హాయిగా
నొక్కెడ వత్సరంబును మ ♦ ఱొక్కెడ నిండుగ మాసషట్కమిం
కొక్కెడ మూఁడుమాసములు ♦ నొయ్యనమాసయుగంబు లీల వే
ఱొక్కెడ నిట్లుగాఁ గడుపు ♦ చుంటిమి యేఁడొక వాసరంబుగాఁ॥

ఇప్పటి కీతీరుగ నరణ్యవాసదీక్షఁ బది పన్నెండేండ్లకన్న నెక్కువ జరిపినారము

లక్ష్మ—ఔను, మనమింకఁ గొలఁదికాలమున నీదీక్షఁ బూర్తిచేసి నగరమున కేఁగి రాజ్యసుఖము లనుభవింపఁగలము.

రాము—తమ్ముఁడా! రాజ్యమని పేరునకుఁ బెద్దయేకాని వనవాసమున నున్నంత స్వేచ్ఛయు నానందమును రాజ్యపాలనమున నుండదుసుమీ! ఈ మహామును లందఱుఁ దమకు నగరములఁ జోటులేకయా యి ట్లరణ్యముల నివసించుట?

లక్ష్మ—మీ రానతిచ్చినది సత్యము.

రాము—సోదరా! మన కీవనవాసకారణమున నెన్నిలాభములు చేకూరినవో చూడుము.

సీ॥ పరఁగ భాగీరథీ ♦ ప్రిముఖంబులైనట్టి
విమల తీర్థములఁ సే ♦ వించినాము
కడఁగి విరాధాది ♦ ఖలదానవులను ని
ర్జించి శాశ్వతకీర్తి ♦ గాంచినాము
అఘనాశనుల నగ ♦ స్త్యాది మౌనీంద్రుల
నెందఱెందఱినో వీ ♦ క్షించినాము
ధూర్జటికైనను ♦ దుర్భేద్యతరములౌ
ప్రబలాస్త్ర శస్త్రముల్ ♦ వడసినాము
తే॥గీ॥ తమ్ముఁడా! యివియెల్ల పాప్రి ♦ ప్తంబులగుట
యరయఁ దనసుతుపై రాజ్య ♦ భరముఁ బెట్టి
మనకు స్వేచ్ఛనొసంగిన ♦ యనఘుకైక
కరుణగా? యామెమేలును ♦ మఱవఁగలమె?

లక్ష్మ—(అయిష్టముగ) ఔనామె మనకు గొప్పయుపకారమే చేసినది. పట్టభద్రులు కాఁబోవుమిమ్ము నారచీరలతో నట్టడవులకంపి యీపాటిపుణ్యము గట్టుకొన్న యామెమేలును మనము నిశ్చయముగ జన్మాంతమువఱకు మఱవఁజాలము.

రాము—తమ్ముఁడా! ఆమె మనకుఁ బూజ్యురాలుకాని నింద్యురాలుకాదుసుమా?

లక్ష్మ—పోనిమ్ము! నీ కేదియిష్టమో నాకు నదియే యిష్టము.

రాము—(తెరవంకఁ జూచి) సోదరా! ఆవచ్చునది యెవరో చూడుము.

లక్ష్మ—(చూచి) ఇది యొక్క దైత్యాంగనవలె నున్నది!

శూర్పనఖ—(ప్రవేశించి రామాదులను జూచి) నే నీపురుషుల నిందెప్పుడును జూచి యుండలేదు. వీరెవరో క్రొత్తవారివలెనున్నారు. సమీపించి తెలిసికొందును గాక. (రాముని సమీపించి ప్రి) పురుషవరేణ్య! నే నింతకుమున్నిచ్చట మిమ్మెన్నఁడును గనలేదు మీపూర్వనివాస మెక్కడ? మీ రెవరు? మీ వృత్తాంతమేమి? తెలుపుము.

రాము—చెప్పెదను వినుము.

ఉ॥ ఓ జలజాక్షి! మానగర ♦ మొప్పు నయోధ్యయనంగ, లోకసం
పూజిత సూర్యవంశమునఁ ♦ బుట్టినవారము, దుర్మదద్విష
ద్రాజవరూధి నీద్విరద ♦ దర్పవిదారణ కేసరీంద్రమై
తేజముగన్న యా దశర ♦ థునని పుత్త్రులమేము తొయ్యలీ!॥

మఱియును,

తే॥గీ॥ పడఁతి! యీ సుందరాంగి మ ♦ త్పత్ని సీత,
లలన! యీతఁడు తమ్ముఁడు ♦ లక్ష్మణుండు

లక్ష్మ— అరయఁబరవాహినీ భయం ♦ కరబలాఢ్యుఁ
డితఁడు రాముఁడుసుమ్ము పూ ♦ ర్ణేందువదన!

శూర్ప—అట్లైన రాజపుత్త్రులగు మీరి ట్లరణ్యవాసమొనర్చుట కేమికారణము?

రాము—మాసవతితల్లియగు కైక తనసుతుఁడగు భరతునకు రాజ్యమిచ్చునట్లును మమ్ముఁ బదునాలుగేండ్లు వనవాసముసేయఁ బంపునట్లును బతిచే వరములం బడసె. మేమును బితృవాక్పాలనార్థమై యిట్లడవులకు వచ్చితిమి. మావృత్తాంతమిది. ఇంక నీయుదంత మెఱిఁగింపుము.

శూర్ప—సుందరాంగా! నేను త్రిలోకవిదిత పరాక్రమశాలియగు రావణునకు సోదరిని. నాపేరు శూర్పనఖ. నాయన్న లంకాపట్టణము రాజధానిగఁ జతుర్దశభువనములును శాసించుచుండును. అతని కెంతయు నెదురులేదు. ఇంక దాఁపనేల? నిన్నుజూచినదాది నేను పంచశరబాధకు లోనైతిని. మారాడక నన్నుఁ జేపట్టి సుఖింపుము. అట్లుచేసితివేని మాయన్నకుఁజెప్పి నిన్నమితధనవంతునిగఁ జేయించెదను.

రాము—(స్వ) ఓహో! దీనిదుష్ప్రవర్తనమంతయు నిప్పుడు తేటపడినది. ఈరాక్షసాంగనను తగినట్లుశిక్షించి పంపెదను. (యోజించి) కాదు, కాదు. ఒకచమత్కారము చేసెదను. (ప్ర) ఓవిలాసినీ! నాకిప్పు డొకభార్య కలదు. నీకు కామేచ్ఛకలదేని ఒకమాటజెప్పెదను వినుము. ఏనువిన నాతమ్ముఁడు ప్రస్తుత మంగనారహితుఁడై యున్నవాఁడు. నీవతనిఁగూడి కామసుఖము లనుభవింపుము.

తే॥ గీ॥ లలన! సోదరుఁ డెనలేని ♦ రసికవరుఁడు
నరయ నెఱజాణ వీవట్టు ♦ లఁగుటఁజేసి
యతని కీవెంతయును దగి ♦ నట్టిదాన
వతఁడు నీకెంతయును దగి ♦ నట్టివాఁడు॥

శూర్ప—ఓయీ నీపై గంపెఁడాసఁ బెట్టుకొనివచ్చిన నన్నిట్లుచేయఁదగునా?

రాము—వెఱ్ఱిదానా! నీసుఖమును నీవెఱుఁగకున్నదానవు! భార్యగల నాతోనున్న నానందమో వనితారహితుఁడగు నాతమ్మునితోనున్న నానందమో విచారించుకొనుము—

తే॥ గీ॥ ఏలయీయాలిల నాడెదు ♦ బేలవగుచు
ముస్నెయొకకాంతఁ గైకొని ♦ యున్న నేను
పొసఁగ నిన్నును జేపట్టఁ ♦ బులగమందు
నూపమును జేర్చినట్లగుఁ ♦ జూవెకాంత!

శూర్ప—నీ వెన్ని చెప్పినను నేనన్యులఁ గోరను.

రాము—మానినీ! నీవు బొత్తుగఁ దెలివిమాలినదానవు. నన్నుఁ జేపట్టిన నీకేమిలాభము?

చ॥ కలదొకకాంత నాకుఁ బయి ♦ గా నినుగూడ గ్రహింతునేని నీ
కలవడఁబోదు సౌఖ్యము ర ♦ వంతయుఁ నయ్యదియట్టులుండ నా
కలికికి వైరివౌదు వటు ♦ గావున శీఘ్రమయేఁగి లక్ష్మణుఁ
గలిసి మనోజవైభవము ♦ గాంచు మపారముఁగాదళోదరీ॥

శూర్ప—(స్వ) ఈతనిఁ జేపట్టి సవతితోఁ గయ్యమాడుటకన్న నిదియె బాగుగనున్నది. (లక్ష్మణునిఁ జేరి) ఓపురుషశ్రేష్ఠా! మీయన్న వట్టినిర్భాగ్యుడు. రావణునంతవానికి సోదరినగునన్నుఁ గైకొని సకలభోగము లనుభవింపనొల్లక నీకడకు బొమ్మని పంచె. నీయదృష్టము మంచిది. జాగుచేయక నాతోఁగూడి సురతవిలాసము లనుభవింపుము.

లక్ష్మ—కాంతా! నీవు కడు తెలివిమాలినదానవు. ఏమనిన,

ఉ॥ ఆరయరూపసంపదని ♦ నంగజయంతులమీఱి కాంతిచే
సారసమిత్రునిం దెగడఁ ♦ జాలి మహారసికాగ్రగణ్యుఁడౌ
నారఘురామునిన్ విడచి ♦ యక్కట! నాకయి వచ్చితేల బం
గారము రోసి లోష్టమును ♦ గాంచి భ్రమించినభంగి మానినీ॥

నీవంటి యమాయకురాలిని నేనెందునుజూడలేదు. నిన్నాతఁ డొల్లక యేయట్లుపలికెనని నమ్మితివా?

చ॥ అలికులవేణి! నీమనము ♦ నారయ నీహృదయేశుఁడాగతిన్
బలికినదాని సత్యమని ♦ భావమునందును నమ్మి నన్నుఁగిన్
గలియఁగఁ గోరివచ్చితివి ♦ గాని భవత్ప్రియుచిత్తమెట్టిదో
తలఁపవు వట్టిముగ్ధవు గ ♦ దా! వికచాబ్జదళాయతాంబకా!॥

నీయందమునకు జందమునకు నాసుందరాంగుఁడే తగినవాఁడు కావున నామాటవిని మాయన్నకడకుఁ బొమ్ము.

శూర్ప—సరసాగ్రేసరా! నాకింక మీయన్నపై నిష్టములేదు. అతనిని మెడకుఁ జుట్టుకొని సవతితోఁ గాపురముఁ జేయఁజాలను.

లక్ష్మ—వెఱ్ఱిదానా! చందనవృక్షమును సర్పావృతమని త్యజించినట్లు సవతితోఁ గాపురము సేయవలసివచ్చునని మహారాజగువానిని జేపట్ట సందేహించుచున్నావా?



చ॥ అతులితరూపశౌర్య విభ ♦ వాన్వితు నూతనపంచబాణు నా
చతురునిగూడ నొల్లకిటు ♦ చాన! వివేకవిహీనురాలవై
యతిథనహీను మూఢమతి ♦ నజ్ఞు నిరక్షరకుక్షి నంతెకా
కతనికి నొక్క సేవకుఁడ ♦ నౌననుఁ గోరెద వెంత బేలవో॥

శూర్ప—ఏమి నీవాతని సేవకుఁడవా?

లక్ష్మ—మఱి యేమనుకొంటివి?

శూర్ప—తమ్ముఁడవుకావా?

లక్ష్మ—పేరునకుఁ దమ్ముఁడనుగాని యీయనకు నీయనభార్యకును నహోరాత్రములు దాస్యముసేయుటయె నాపని! నీవు నన్నుఁ జేపట్టితివేని నాతోఁబాటు వీరికి దాస్యముచేయవలసివచ్చును. నీకింతశ్రమయేల! మహారాజ్ఞివలె రామునితో సుఖింపుము. ఓహో! నేనింక నీకుఁగూడ దాస్యము చేయవలయును గాఁబోలు! దయమాత్రముంచుము.

శూర్ప—(స్వ) ఇతఁడు చెప్పినది సత్యము! తొలుత రామునిఁ జేపట్టిన క్రమముగ నితఁడుగూడ నాచేతఁజిక్కును. అప్పు డిరువురితో సుఖింపవచ్చును. (తిరిగి రాముని చెంతకుఁ బోవును.)

రామలక్ష్మణులు—(నవ్వు నాఁపుకొనుచున్నారు.)

సీత—ఇది యేమిచిత్రము! (నవ్వును.)

శూర్ప—(సీతనుజూచి కోపముతో) ఓసీ! నాసవతీ! నన్నుఁజూచిన నీకు నవ్వువచ్చెనుగా. నిన్నిప్పుడే వడియములాగున నమలి మ్రింగివేసెద నుండుము. (సీతపై దుముకుచున్నది.)

రాము—ఆ. ఆ. నిలువుము. (సీతను శూర్పనఖను చెరియొకచేతఁ బట్టుకొని) తమ్ముఁడా! దీనిసరస మెంతవఱకుదెచ్చెనో చూచితివా? ఇట్టివారితో నవ్వులు పనికిరావు. పాపమిది వచ్చి చాలసేపైనది. దీని నూరకపంపుట పాడిగాదు. తగినట్లు సత్కరించి పంపుము.

లక్ష్మ—చిత్త . పడఁతీ! రమ్ము.

శూర్ప—ఇదిగో వచ్చితిని. నాయభీష్ట మీఁడేర్పుము. (లక్ష్మణునికడకుఁ బోవును.)

లక్ష్మ—సమీపమునకు రమ్ము (అని ముందుకులాఁగి ముక్కు బట్టుకొనును.)

శూర్ప—(స్వ) ఏమిది? ఇతఁడు సురతవిలాసము లెఱుఁగనివానివలె నున్నాఁడు. నేత్రాధరకుచకపోలాది చుంబనస్థానముల వదలి పాదాంగుష్ఠజానుప్రముఖములగు కళాస్థానములు స్పృశింపక యెక్కడనో ముక్కుఁబట్టుకొని మురియుచున్నాఁడు. ఇది యేదేశాచారమో? (ప్ర) ప్రియా! తడవేల?

లక్ష్మ—తొందర పడకుము. (ఖడ్గములాఁగి) ఓసీ!

తే॥గీ॥ ఒడలు మత్తెక్కి శూరుల ♦ ముగ్రబలుల
మేము కనుచుండ మదిభయ ♦ మింతలేక
కూళవై యిట్లు సీతా వ ♦ ధూలలామఁ
బట్టి మ్రింగఁగఁబోదువా ♦ పాపురాల॥

(ముక్కును చెవులునుగోసి) పొమ్ము. నీకిప్పుడు తగినబహుమానమైనది.

శూర్ప—(పెద్దగా నేడ్చుచు) ఓరీ! దుష్టుడా! నన్నిట్లు సేయుదువా? (రామునితో) ఓయీ! చూడుము. నీతమ్ముఁ డేమిచేసినాఁడో!

రాము—చక్కనిపనిఁ జేసినాఁడు. ఇంక మాఱాడక తొలఁగిపొమ్ము.

శూర్ప—(ఏడ్చుచు) ఓరోరి కఠినాత్ములారా! మీరు న స్త్రీతీరునఁ బరిభవింతురా? మాయన్నలకుం జెప్పి మీయసువులఁ దీయించెదను చూడుఁడు.

(నిష్క్రమించును.)

సీత—నాథా! మన కీదనుజాంగనమూలమున నేయాపదయుఁ గలుగదుకదా?

రాము—ఏమియు భయములేదు. (అందఱు నిష్క్రమింతురు)

---

2. రంగము. రావణుని కొలువుకూటము.

(రావణుఁడు సింహాసనాసీనుఁడై యుండును.)

శూర్ప—(ప్రవేశించి) హా! దశకంధరా! చతుర్దశభువనశాసనుఁడవగు నీకుఁజెలియలనై తుదకు నేనిట్లొకనీచునిచే నాసాకర్ణములు కోయఁబడి గొప్పపరాభవ మందితిఁగదా? (ఏడ్చును.)

రావ—(కోపముతో) ఓరా! నిన్నిట్లుచేసిన యాదుష్టుడెవఁడు?

శా॥ నాకుం జెల్లెలవైన నీకు నవమా ♦ నం బిట్లుకావించి నా
దాకోపాగ్నికిఁ బాత్రుఁడైన ఖలుఁ ♦ డా యక్షేశుఁడో? కాలుఁడో?
నాకేశుండో? వచింపు మాతని నసిన్ ♦ ఖండితు దండితు బా
హాకండూతిని దీర్చుకొందు మది నీ ♦ వానందముంబొందఁగన్॥

శూర్ప—అన్నా! యేమనిచెప్పుదును! ఇంతబ్రతుకుబ్రతికి యింటివెనుకఁ జచ్చినన్న ట్లున్నది నా వృత్తాంతము. త్రిలోకములకు యమప్రాయుఁడవగు నీకు సోదరి నైన నన్నొక తుచ్ఛనరాధముఁ డిట్లుచేసినాఁడు.

రావ—(కోపముతో) ఎట్లు!

తే॥గీ॥ ఓరి! మదమున నొక్క మ ♦ ర్త్యాధముండె
చెలఁగి నిన్నీవిధంబునఁ ♦ జేసినాఁడె
మిగుల నాఁకొన్న క్రొల్పులి ♦ మీసలంది
మెలమి నుయ్యెలలూఁగంగఁ ♦ దలఁచినట్లు॥

ఆదుష్టుఁడెందున్నవాఁడో వాని వృత్తాంతమెట్టిదో వచింపుము. అద్దురాత్ము నిప్పుడే నా యీఖడ్గముచే నింతింత ముక్కలుగఁగోసి గ్రద్దల కాహారము సేసెదను.

శూర్ప—అన్నా! వినుము. అయోధ్యానాథుఁడగు దశరథునినందనులు రామలక్ష్మ ణులనువారు తండ్రి పంపునవచ్చి పంచవటియందు నివసించియున్నారు. అందు రామునకు సీతయను నొక చక్కనిభార్యకలదు. అది నీ కెంతయుఁ దగియుం డుటచే దానిం గొనితెచ్చుతలఁపుననే నచ్చటికింబోవ నద్దురాత్ముఁడు తన తమ్మునిచే నన్నిట్లు చేయించి నాకుఁ దోడైవచ్చిన ఖరదూషణాదులను వధి యించినాఁడు. అక్కటా! యీపరాభవాగ్ని నెట్లు సహింతును? (ఏడ్చును.)

రావ—(రామునుద్దేశించి కోపముతో) రే! నరాధమా! ఎంతపనిఁ జేసితివిరా?

శా॥ ఓరా! క్రూరుఁడ! సీతఁ రేఁజెలియల ♦ ట్లక్కానకున్ వేడ్క నే
తేరన్ గన్నునుమిన్నుగానక మదాం ♦ ధీభూతచిత్తుండవై
యీ రాజాస్యబరాభవించెదవె దు ♦ ష్టా! యెందుఁబోదింక ను
ర్వారోదగ్రమహోగ్రఘోర దశవ ♦ క్త్రామర్షపాత్రుండవై॥

ఓరోరి మానవాధములారా! మీకు మృత్యు వాసన్నమైనది. సోదరీ! నీవింకజింతిల్లకుము. ముల్లోకము లెత్తివచ్చినను నే నాదుష్టులను విడువను.

మ॥ పటుకీలానికరస్ఫులింగచయ శుం ♦ భద్ఘోరదావానల
చ్ఛట లుగ్రాటవిఁ గాల్చునట్లు వడి భుజా ♦ సంరంభ మొప్పార మ
చ్చటులోదగ్రపరాక్రమజ్వలనప్రా ♦ జ్యజ్వాలికామాలలన్
దురితిలో నాఖలుఁడన్ నరాధములఁ గా ♦ ల్చున్ దుర్నిరీక్ష్యుండనై॥

శూర్ప—ఎట్లైన నా మర్త్యాధముల వధించి సీతఁ దెచ్చుకొమ్ము.

రావ—ఏతత్కార్యసాధనంబునకై యిప్పుడే మారీచునికడ కేగి తగునుపాయ మాలో
చించెదఁగాక! (నిష్క్రమించును.)

శూర్ప—(నిష్క్రమించును.)

—oo:o:oo—

(3 రంగము మారీచాశ్రమము)

(మారీచుఁడు రావణుఁడు ప్రవేశింతురు.)

రావ—మారీచా! యీవిషయమై నీ వభ్యంతరముఁ జెప్పకుము. నీవు పట్టుఁబట్టినచో
నెట్టికార్యమైనను సాధింపఁగలవు. నీశక్తి నేనెఱుంగుదును.

మారీ—రాక్షసేశ్వరా! దేవతలచేఁ బరిచర్యలఁ జేయించుకొనుచు హాయిగ లంకా
నగర మేలుకొనక కుడిచికూర్చుండి మహాత్ముఁడగు నారామునితో నకారణ
వైర మేలతలపెట్టెదవు? ఆయన సామాన్యుఁడు కాఁడు. తొల్లి బాలుండయ్యు
ను సహస్రమదగజసత్త్వుండనగు నన్నొక్క శరమ్మున శతయోజనదూరమ్మున
నఁ బడున ట్లెగఁజిమ్మివైచె. ఇప్పుడాతఁడు రణపాండిత్యమునఁ బ్రవీణుఁడై
మహామునులచే సకలాస్త్రశస్త్రములును నేర్చి ధూర్జటికైన దుర్నిరీక్ష్యుఁడై
వెలుఁగొందుచున్నవాఁడు. కావున నామాటవిని యీ దుశ్చింత విడువుము.

రావ—ఓయీ! నీవేమో ధైర్యశాలివనియుఁ బరాక్రమశాలివనియుఁ దలంచితిని.
ఒకనరాధమునకు వెఱచు నీపాండిత్య మిప్పుడు తెల్లమైనది.

మారీ—దైత్యేశ్వరా! ఆయనను సామాన్యనరుఁడని తిరస్కరింపకుము. ఆతఁడు దను
జవధార్థమై లీలామానుషవిగ్రహము గైకొన్న మహావిష్ణువని యొకకింవదంతి
కలదు. మఱియును,

ఉ॥ రాముఁడు శత్రుసంచయ వి ♦ రాముఁడు దానవజాలశైల సు
త్రాముఁడు భీకరోగ్రసమ ♦ రాంగణభీముఁడు వందితామర
స్తోముఁడు కోమలాస్యజిత ♦ సోముఁడు, భక్తనికాయసన్మనో
రాముఁడు భాస్కరాన్వయ ల ♦ లాముఁడు గాని మనుష్యమాత్రుఁడే?

రావ—నీవెన్ని చెప్పినను నేను వినను. ఆసీతను దెచ్చి భోగింపకున్న నాహృదయసంతాపము చల్లారదు. అతఁడు విష్ణుదేవుఁడగుఁగాక! బ్రహ్మదేవుఁడగుఁగాక! సురాసుర గరుడగంధర్వ కిన్నరాదులజయించి దిక్పతులఁబాఱదోలిన యీ వింశతికరున కెవ్వరివలనను భయములేదు.

మారీ—దానవనాయకా! నీవు వింశతికరుండనని గర్వింపకుము.

తే॥ గీ॥ కరము లిఱువది పెనుమేను ♦ గలిగినంత
రామచంద్రునకీ వెన ♦ రావుసుమ్ము
కొండఁబోలెడు మత్తవే ♦ దండమైన
హరికిశోరమునకు సాటి ♦ యగునె చెపుము!

రావ—చాలుఁజాలు—నీయుపన్యాసమిఁక గట్టిపెట్టుము.

తే॥ గీ॥ అమరులకు ప్రక్కబల్లెమై ♦ యరులపాలి
కాలుఁడై, యింద్రునని బాఱఁ ♦ దోలినట్టి
రావణునకుఁ ద్రిలోక వి ♦ ద్రావణునకు
ఎక్కడనొ బక్కనరుఁడొకఁ ♦ డేమిలెక్క?

మారీ—(స్వ) ఈతఁడెంత చెప్పినను దనమౌర్ఖ్యమును విడువకున్నాఁడు.

తే॥ గీ॥ ఖలునకెంతేని నీతిని ♦ గఱపినను ని
రర్థకంబగుఁ గాని సా ♦ ర్థకముగాదు
మలయపర్వత సంసర్గ ♦ మహిమచేత
నవని వేణువు చందన ♦ మగునె తలఁప॥

ఇంకను జెప్పి చూచెదను (ప్ర) దైత్యేశ్వరా!

చ॥ జడిరయక ముద్దుకై ఘనభు ♦ జంగముతోఁ జెరలాటలాడఁగాఁ
గడఁగినభాతి, నిప్పులోడిఁ ♦ గట్టఁ దలంచినయట్లు, లబ్ధిలోఁ
బడమది నెంచు చందమునఁ ♦ బ్రాణభయం బిసుమంతిలేక యీ
పడఁతిని రాముపత్ని నతి ♦ పావన నిట్లు హరింప నెంచెదే॥

రావ—నీమరుపదేశము లిఁకనిలుపుము. నాకు పిటికిమందు పోయవలదు. నీవిప్పుడు నామాటవిని నాకుసహాయముగవచ్చి కార్యము సిద్ధింపఁజేయుదు వేని నీకు వలయునంత ధనమొసంగెదను. కోరినన్ని రథగజాశ్వాదులైనను తుదకు నాయర్ధరాజ్యమునైనను నిచ్చెదను. కావున మాఱాడక బయలుదేఱుము.

**మారీ**—రాజా! మున్నతనిచే దెబ్బతినినదాది సకలమును ద్యజించి యిట్లు తపోవేషముఁబూని యున్న నాకీధనమోఁదులకు రాజ్యమెందులకు?

తే॥ గీ॥ ధనకనక వస్తువాహన ♦ తతులకాత్మ
నాసవహియించి మృత్యువు ♦ ననుకరించు
వీరు నెదిరించి ప్రాణముల్ ♦ విడుతునో కా?
కూలికెవ్వండు విషమును ♦ గ్రోలుఁ జెపుమ॥

నానిమిత్తమై వచ్చితివి కావున నీక్షేమము గోరినవాఁడనై చెప్పుచున్నాఁడ. నామాటవిని తెలివిఁదెచ్చుకొని వచ్చినత్రోవ నింటికిఁ బొమ్ము. జగన్మాత యగు సీతామహాదేవిని వాంఛించుటచే మాతాసంగమాభిలాషి యెట్టిలోకమున కర్హుఁడో నీవట్టిలోకమును జెందుదువు

రావ—(కోపముతో) ఛీ.ఛీ. ఇఁక నోరు మూయుము. నీపిఱికిమాటలు విని నే నాకాంతను విడువను. ఇదిగో నిప్పుడే బయలుదేరుచున్నాఁడ

ఉ॥ ధారుణి క్రుంగినన్, భువిని ♦ దారలు రాలిన, వహ్ని లాఱినన్.
నీరధు లింకినన్, దినమ ♦ ణీందులు ప్రొద్దిన నస్తమించినన్,
ఘోరున రుద్రు డడ్డమయి ♦ పోరిన, సీతను దెత్తుగాని నే
నూరక రాను ముజ్జగము ♦ లొక్కటియై యని సేయ వచ్చినన్.

ప్రాణములపై నాస కలదేని నీవును నావెంటరమ్ము. లేకున్న నిన్నీకరవాలమున కెరఁజేసెదను. (అని ఖడ్గముఁ జూపుచున్నాఁడు.)

**మారీ**—(స్వ) ఓహో! కార్యముమీఱి వచ్చినది. ఈ దురాత్ముఁడెట్లును దనపట్టు విడువఁడు. ఈదుష్టునిచేఁ జచ్చుటకన్న మహాత్ముఁడగు నారామునిచే మడసిన సద్గతికలదు. (ప్ర) దైత్యేశ్వరా! శాంతింపుము. తొలుత ధైర్యము చాలమి నట్లంటిఁగాని గట్టిగఁ బట్టువట్టిన నాకీపని యెంత? దానవచక్రవర్తివగు నీవు వచ్చి యడుగుటయు నేను నిరాకరించుటయు నా? లెమ్ము బయలుదేఱుదము. నేనిప్పుడె నీవెంటవచ్చెదను.

రావ—**మారీచా!** నీభక్తికే నెంతయు సంతసించితిని. రమ్ము పోవుదము. (ఇరువురు నిష్క్రమింతురు.)

---

(4. రంగము: పర్ణశాల) 7/3

(రామలక్ష్మణులు, సీత ప్రవేశించుచున్నారు.)

సీత—నాథా! నేఁడు నామనమున వనవిహారేచ్ఛ జనించినది. అటుపోయి యొక్కింత విహరించి వత్తము రండు.

రాము—మంచిది. ప్రేయసీ! రమ్ము. (ఇరువురు కొంచెము నడతురు.)

సీత—నాథా! యీమాలతీలత యెంతపెల్లుగఁ బుష్పించినదో చూడుఁడు.

రాము—ఔను. సఖి! యీవిచిత్రమును వీక్షింపుము. ఈవనమునందు,

తే॥ గీ॥ అరయ సర్పమయూరముల్ ♦ హరులుఁ గరులుఁ
బులులు హరిణార్భకంబులు ♦ పొందుపొసఁగి
సహజవైరములనుమాని ♦ సంచరించు
నహహా! ఋషిపుంగవుల తపో ♦ మహిమచేత॥

సీత—ఈ మునిసత్తముల ప్రభావ మతిప్రశంసనీయము.

రాము—కల్యాణి! ఫలదళకుసుమకుట్మలవిరాజిత నానావిధభూరుహంబులతోడను స్వచ్ఛజలపూరితంబులగు కమలాకరములతోడను నీ పంచవటం బెంతయుందమగనున్నదో చూడుము!

సీ॥ మందారసుమ మక ♦ రందమత్తభ్రమ
దిందిందిరవ్రాత ♦ సుందరంబు
కాననాంతరచల ♦ త్కలకంఠ కులకంఠ
కలనాదమాధురీ ♦ విలసితంబు
శారికామృదునాద ♦ పారావతారావ
రాజకీరాలాప ♦ రంజితంబు
పద్మినీ కుముదినీ ♦ ప్రముఖవల్లీకాంత
కాసారసముదాయ ♦ భాసురంబు

తే॥ గీ॥ అవని దేవోక్త మంత్రస ♦ మర్పితేంధ
నాజ్యధారాప్రవృద్ధ హో ♦ మాగ్ని ధూమ
పటలసంఛాదితాశ్రమ ♦ పాదపంబు
ఈవనంబు జగత్త్రయ ♦ పావనంబు॥

సీత—మఱికొంతదూర మరుగుదమురండు. (కొంచెమునడచి) నాథా! యీప్రదేశ మెంత హృదయాభిరామముగ నున్నదో కనుఁడు.

తే॥ గీ॥ లీలఁబ్రవహించు పూఁదేనె ♦ కాలువలను
తెమ్మెరల నల్ల నూఁగుపూ ♦ దీఁగగములు
వడివడిగ నింగికెగయు పు ♦ ష్పొడిదుమార
మోలిఁ గనుపండు వొసరించు ♦ చున్నవిచట॥

రాము—ఔనౌను.

శా॥ ఇంతీ! నందనసీమవోలె దగనెం ♦ తే నివ్వనాంతంబుఁగ
గాంతానంతలతాంతసౌరభసమా ♦ క్రాంతాఖిలాశాంతమై,
సంతోషప్రదమై, నవాగుణవిరా ♦ జత్పల్లవాకీర్ణమై
యెంతో వేడుకనింపుచున్నయది కా♦దే వృక్షజాలం బహో! ॥

మఱియును,

మ॥ లలినేఁడీవనమందు చిత్తమునకా ♦ హ్లాదంబు సంధించెడిఁ
దళదిందీవర పద్మకైరవమరం ♦ దాస్వాదనోన్మత్త చం
చల రోలంబకదంబ మంగళమనో ♦ జ్ఞానూన సంగీతముల్
లలితామ్రస్థ పికాంగనా ముఖవిని ♦ ర్యన్మాధురీ గానముల్॥

సీత—జీవితేశ్వరా! మనకనతిదూరంబున నదె సరోవరంబొండు దృగ్గోచరమగుచున్నయది. దానియందు మరసివత్తమురండు. (ఇరువురు మఱి కొంతదూరము నడతురు.)

రాము—సఖి! నీవన్న కొలఁకును సమీపించితిమి. ఆహా! ఇది యెంతసంతసముఁ గొలుపుచున్నదో కనుము.

చ॥ వరవిమలాంబుపూర్ణమయి ♦ భాసిలుదాని మరంద మత్తబం
భరలసితాసితోత్పలస ♦ మంచితమై విలసిల్లు దాని వి
స్ఫురదరవిందషండములఁ ♦ బొల్పగుదానిఁ బ్రఫుల్లకైరవో
త్కరములుగల్గి చెన్నలరు ♦ దాని సరఃప్రవరంబుఁ జూడుమా! ॥

సీత—ఆహా! నాథా! ఆ రాజహంససంయోగంబుఁ దిలకింపుఁడు.

తే॥గీ॥ నీరజమ్మృణాళఖండము ♦ లారగించి
డెందమునఁ దృప్తిజెంది యా ♦ నందలీల
నొగి లతాడోల నుయ్యెల ♦ లూఁగునల్ల
కొదమయంచ యొయ్యారంబు ♦ కోటిసేయు॥

రాము—మనోహారీ! ఆతీరమునందు——

క॥ మలయసమీరాందోళిత
సలలిత వికచప్రసూన ♦ సంచయగళితో
జ్జ్వలవర పరాగకలిత
స్థలముల విహరించుచక్ర ♦ జాలముగంటే॥

సీత—ఆహా! ఆ రథాంగదంపతుల గాఢానురాగమెంత యొప్పుచున్నది!

రాము—(స్పర్శనభినయించి) తరుణీ! ఇచ్చట నీ మలయసమీరమెంతయు సుఖప్రద
ముగనున్నదికదా!

ఉ॥ ఇమ్ముగఁ జందనాలయ మ ♦ హీరుహవాసనజెంది పూదుమా
రమ్ములఁ గేళిసల్పి, సలి ♦ లాశయసీమలఁజొచ్చి శీతల
త్వమ్మువహించి, మందగతి ♦ భాసిలి మానులయజ్ఞవాటులన్
గమ్మని హోమధూమముల ♦ గైకొని నీఁచెడిఁబిల్లతెమ్మెరల్॥

(వినుటనభినయించి) అదిగోఁ గర్ణానందముగ వేదఘోషము వినవచ్చు
చున్నది, సఖీ!

తే॥ గీ॥ శ్రోత్రపుటయుగపేయమై ♦ సుస్వరము
లలితరీతిని మునికుమా ♦ రులుపఠించు
వరయజుస్సామఋగ్వేద ♦ సరసనాద
మదిగో వీతెంచె వింటివే ♦ యబ్జవదన॥




సీత—(భయభ్రాంతయై రామునిఁ గౌఁగిలించుకొని) హా! హా! నాథా! మనము
దవాగ్నిమధ్యమునకు వచ్చితిమిగదా!

రాము—(ఆత్రముతో) దవాగ్నియెక్కడ?

సీత—అదిగో! (వ్రేలితోఁజూపును.)

రాము—(చూచినవ్వి) సీతా! నీవెంతముగ్ధవు!

తే॥గీ॥ కుసుమితపలాశభూరుహ ♦ కోటిఁజూచి
యురుదవానలమని భీతి ♦ నొందెదహహా!
మగువలకుగల భీరుతా ♦ మాంబునేఁడు
అతివ! నీయందె సార్థక ♦ మయ్యెఁగాదె॥

సీత—హృదయేశ్వరా! అదియెట్లుగ దవాగ్నివలెనే కనుపించుచున్నది. (విభ్రమము
నటించి) ఎచ్చటిదీమెఱుపు! (దిక్కులుపరికించి) ఆహా! యీ కురంగమెంత

వింతగానున్నది! దీని దేహమంతయు రత్నమయమై కన్పట్టెడిని. మనోనాథా! అటువీక్షింపుఁడు.

తే॥గీ॥ కాంచనముపైని రత్నము ♦ లంచితముగఁ
జెక్కనవిధాననిగనిగల్ ♦ పిక్కటిల్ల
మెఱుపుఁదీగయొ యననదే ♦ మెఱయుచున్న
దొకమనోహరమైన మృ ♦ గోత్తమంబు॥

రాము—ఏదీ యాకురంగ మెటువోయినది?

సీత—అదిగో! నాకురువకతరుమూలమున నిలిచి బెదరి బెదరి చూచుచున్నది. ఆహా! దాని వీక్షణము లెంతమనోహరముగనున్నవో చూడుఁడు!

రాము—(చూచి)అరరే! ఏమిదీని యందము! ఏమిదీని గమనవిలాసము! ఏమిదీని వీక్షణశృంగారము! ఇట్టి వినూతనవిచిత్రసారంగము నెన్నండును గనియుండలేదు.

సీత—ప్రాణేశ్వరా! దీనితో ముచ్చటతీఱ నాడుకొనవలయునని నాకుఁ గుతూహలము గనున్నది. దయయుంచి యీ కురంగముచు బట్టియిండు.

రాము—సఖి! ఇప్పుడే పట్టియిచ్చెదను.

సీత—అదిచిక్కకున్న వధియించి తుదకు దానిచర్మమైనఁ గొనితెండు.

రాము—అట్లెచేసెదను. లక్ష్మణా!

లక్ష్మ—(సమీపించి) ఏమాజ్ఞ?

రాము—సోదరా! ఆ విహరించు కనకసారంగమును జూడు మెంతమనోహరముగ నున్నదో! మీవదినె దీనింబట్టియిమ్మని ముచ్చటపడి వేడినదికావున శీఘ్రమ ధనుర్బాణములఁదెమ్ము, కురంగమును గొనివత్తును.

లక్ష్మ—(లేఁడినిచూచి) అన్నయ్యా! యీ బంగరులేఁడింజూడ నామది కత్యాశ్చర్యమయ్యెడిని. ఏమనిన,

ఉ॥ చూచియెఱుంగ మెన్నఁడును ♦ సోదర! స్వర్ణకురంగమంబు మున్
జూచినవారులేరు భువిఁ ♦ జూడఁగ నియ్యది దైత్యమాయగాఁ
దోఁచెడి, రాక్షసాధములు ♦ దుష్టులు మాయకులౌట నిత్తఱిన్
యోచనసేయకిట్లు చను ♦ టొప్పదు తొందరఁజెంద కగ్రజా॥

రాము—సోదరా! ఏమట్లు వచించుచుంటివి? కురంగమునం దేమి దైత్యమాయకలదు?

లక్ష్మ—అగ్రజా! ఇది సామాన్య కురంగములవలెఁగాక కాంచనమయమై రత్న
స్థగితమై లోకవిరుద్ధముగనుండుట సంశయాస్పదము. కావున నట్లంటిని. రాక్ష
సమాయ లతిదుర్భేద్యములు. దురూహ్యములు—

రాము—ఇందునాకేమియు రాక్షసమాయయున్నట్లు తోఁచుటలేదు. ఒకవేళనున్నను
నేమిభయము?

ఉ॥ భూమిజకోర్కెఁదీర్తు నిది ♦ పోడిమిస్వర్ణకురంగమైన ను
ద్దామజవంబునం జని యు ♦ దంబునఁ బట్టుక తెత్తుఁ గాక మా
యామృగమైన మత్పటు శ ♦ రాహతిఁ ధారుణిఁగూల్తుఁ బంయమి
స్తోమములెల్ల సంతసిల ♦ దోర్బలమేర్పడ దక్షిణంబునన్॥

కావున మాకాడక ధనుర్బాణములఁ దెమ్ము. జాగైననది పాఱిపోవును.

లక్ష్మ—(స్వ) సర్వజ్ఞుండయ్యు నీ మహానుభావుఁడు భార్యమచ్చటదీర్ప నిట్లు త్వర
పడి యోచింపక మాయామృగభ్రాంతి దవిలియున్నవాఁడు ఇప్పుడీయనకెదు
రాడినఁ గోపమువచ్చును. కానున్నది కాక మానదు (ధనుర్బాణములఁ దెచ్చి
యిచ్చును)

రాము—(పుచ్చుకొని) తమ్ముఁడా! నీవును జానకియు బర్ణశాలయందుండుఁడు. నేని
ప్పుడేవచ్చెదను. (లేఁడిని తరుముచు నిష్క్రమించును.)

సీత—ఔరా! యీ లేఁడి నాథునకుఁ జిక్కక యెంతచిక్కులుపెట్టుచున్నది!

లక్ష్మ—అమ్మా! నీవుగట్టిగఁ బట్టియీయవలసినదిగఁ గోరినందున నన్నగారనాలో
చితముగ నిట్లు చనుచున్నారుగాని యిదితప్పక దైత్యమాయాజనితకురంగము.
తదన్యముకాదు. అటుచూడుము.

తే॥గీ॥ ఆ గమనవైఖరియు నా మ ♦ హాజవంబు
నా తనుద్యుతి యా నింగి ♦ కరుగుటయును
నాయుడంగుటగన్న మా ♦ యాకురంగ
మనుట కొక్కింతయును సంశ ♦ యంబుగలదె?

అమ్మా! మనము పర్ణశాలలోనికరుగుదము రమ్మా. (ఇరువురు పర్ణశాల
లోనికిఁ బోవుచున్నారు.)

సీత—నాథుఁడిప్పుడు కనుపించుటయే లేదు. ఆ లేఁడియెంతదవ్వునకు బాఱెనో! (దైన్య
ముతో) మఱఁదీ! నీవువచించినట్లిది మాయామృగమే యైయుండునే మోసకదా!
అక్కటా! ప్రాణేశ్వరు నీపాడుకురంగముం దెచ్చుట కేలపంపితిని?

చ॥ హరిణముబట్టనేఁగి తడ ♦ వయ్యెను నాథుఁడురాఁడు దప్పిచే
నొరఁగెనొ యెండకున్ బడ నె ♦ నో కట! నాకిదె దక్షిణాంబక
స్ఫురణముదోఁచె నేచెడుగు ♦ మూడునొ కంపము చిత్తమందునున్
గరముజనించె నీ వెదురు ♦ గానయినన్ జనుమయ్య లక్ష్మణా॥

లక్ష్మ—(స్వ) ఇప్పుడీమె భయాక్రాంతయై యిట్లనుచున్నది. ఈ సమయమున నీమెకు ధైర్యముఁ జెప్పవలయును. (ప్ర) అమ్మా! మాయాకురంగమని నీవు చింతింపవలదు. అన్నగారుతప్పక దానిని వధించిరాగలరు.

(తెరలో) హా! లక్ష్మణా! (అనిధ్వని)

సీత—(భయముతో) హా! హా! మఱఁదీ! మోసమయ్యెనుగదా! ఇంకేమున్నది? మీయన్నగారేదైత్యునిచేతనోచిక్కి విలపించుచున్నారు. అక్కటా! ఇప్పుడేమిచేయుదును? లక్ష్మణా! నీవు సత్వరమ్మున నాథునిచెంతకరుగుము. లెమ్మా, తడయకుము.

లక్ష్మ—అమ్మా! నీవిట్లు తత్తఱపాటుజెందవలదు? మాయన్న కేయశుభమును గలుగదు. ఎవఁడో రాక్షసాధముఁడు మనలను భయపెట్టి మోసపుచ్చుటకిట్లఱచి యున్నాఁడు కాని తదన్యముకాదు.

సీత—హా! మఱఁదీ! నీ వేదో సమాధానముఁజెప్పి కాలయాపనముఁ జేయుచున్నాఁడవు కదా! దైవమా! నేనిప్పుడేమిచేయుదును? నా నాథునకెవరుదిక్కు? (దుఃఖించును.)

లక్ష్మ—అమ్మా జానకీ!

ఉ॥ కన్నుల నశ్రుబిందువులు ♦ గ్రమ్మఁగఁ జింతమునుంగకమ్మ మా
యన్న భయంబుజెందఁడు సు ♦ రాసుర యక్షులకైన, నాతఁడ
త్యున్నత శౌర్యశాలి సమ ♦ రోగ్రుఁడు దుర్జయుఁ డమ్మహాత్ముఁడే
సన్నిటు చీరినన్ క్షణము ♦ నన్ నదులింకి గిరుల్ వడంక వే॥

సీత—హా! సౌమిత్రీ! నీ వెంతకఠినాత్ముఁడవు!

చ॥ వనమున నాపదందవిలి ♦ వావిరి నగ్రజుఁడల్లు 'లక్ష్మణా'
యని కడునార్తిఁజీరె జను ♦ మన్నఁ గటా! వినవేల? నాపయిన్
గనికరమూనవేల? యిటు ♦ గాసిలఁ జేసెదవేల? చాలు ని
న్ననఁబనియేమి యేయనుజుఁ ♦ డగ్రజు మేలునుగోరుఁజెప్పుమా॥

సవతికొడుకులు పగవారన్నమాట నేఁడు సత్యమయ్యెనగదా!

లక్ష్మ—తల్లీ! తెలిసి తెలిసి యెట్టిమాటలాడితివమ్మా! నేను నీయెడఁజూపు భక్తికి, విశ్వాసమునకు, విధేయతకు, సౌజన్యమునకు, నాజ్ఞాపరిపాలనమునకు నిదియా ఫలము? నీనాథుఁడు తాను వచ్చువఱకు నన్ను నీచెంతనుండుమని యాజ్ఞాపించుటచే నిన్ను విడిచిపోవుటకు సంశయించితిఁగాని నీయం దేభక్తిలోపము జరిపియుండలేదే. ఏవిధమగు నాజ్ఞోల్లంఘనముఁ జేసియుండలేదే! నన్నిట్లు దూరుట నీకు న్యాయమా?

సీత—ఛీ! ఛీ! పాపాత్మా! నీ దురభిప్రాయమంతయు నిప్పుడు తెలిసినది. ఆతమ్ముఁడట్లు రాజ్యముహరించి కానలపాలుచేసె, నీవు ప్రాణములు హరించి నన్నుఁ గైకొనఁ జూచుచున్నాఁడవు. ప్రాణత్యాగమైన నొనరింతునుగాని నే నీకుఁ జిక్కుదునా! ఓరీ! మాతృద్రోహీ! నీముఖముఁ జూడరాదు.

లక్ష్మ—(చెవులుమూసికొని) శివశివా! ఎంత పాపవాక్యము లాడితివమ్మా!

తే॥ గీ॥ గాలములకన్న నగ్నికీ ♦ లాళికన్న
శూలములకన్నఁ గఱకు బా ♦ ణాలకన్నఁ
జాలచుఱుకైన మాటలీ ♦ లీలనాడ
నౌనె! సర్వజ్ఞురాలవై ♦ నట్టి నీకు॥

జననీ! నిన్ను సదాపరదేవతవనియు, నిజమాతవనియు, గురుపత్నివనియుఁ దలంచు నన్నిట్లు కఠినవాగ్బాణములచే నొప్పించుట యుక్తాయుక్తవివేకధురీణవగు నీకుం దగునా? నాస్వభావమెట్టిదో నే నెట్టివాఁడనో నీవెఱుఁగవా? తల్లీ! సత్యము వచించుచున్నాఁడను వినుము. అసత్యము నోటవెడలిన గురుతల్పశయనగతికిఁ బాలగుటయేగాక నీ పాదములకుం దప్పినవాఁడనగుదును. ఏమనిన,

తే॥ గీ॥ శరభ శార్దూలసింహ భీ ♦ కరలులాయ
శల్యభల్లూక గండక ♦ సైరిభాది
చటులజంతుశరణ్యమౌ ♦ నటవిలోన
నొంటినినువిడిచనఁ గుందు ♦ చుంటినమ్మ॥

మఃమ్మాటికి నామనమున నింతకన్న వేఱొక దుశ్చింతలేదు. అంతయు నెఱింగిన నీవిట్టి నాయింగితమెఱుంగక త్వరపడి నన్ననరాని మాటలంటివి. ఐనను నా కలుకలేదు. నే నిదె పోవుచున్నాఁడ. నీకింక సర్వభూతములును సర్వదేవతులును దిక్కగుదురుగాక! (కొంచెము నడచినిలిచి) హా! ఎట్లు పోవు

దును? క్రూరనిశాటాకరంబగు నీయరణ్యమున నీమెను విడచిచనం గాళ్లు కున్నవి. ఏదైత్యులేమిమాయంజేయుదురో! ఏ క్రూరజంతువు లేమిహాని జేకూర్చునో! దైవమా! ఎంతచిక్కులు తెచ్చిపెట్టితివి? నేనిప్పుడేమిచేయ దును? ఎట్లును బోవకతప్పదు. సర్వవ్యాపకుండగు నాపరమేశ్వరుండే యీమె ను గాపాడుంగాక!

సీ॥ పావనమైన భూ ♦ దేవీతనూజాతం
గావరే కిన్నరీ ♦ గణములార!
శ్రీరాము ప్రియపత్ని ♦ నీరామం గృపమీఱం
గనరె వైమానిక ♦ కాంతలార!
సీత నీసతిని ర♦క్షింపరే లోకముల్
పాలించు సప్తది ♦ క్పాలులార!
జనకధాత్రీతలే ♦ శునిపుత్త్రి నీమెం గా
పాడరే గంధర్వ ♦ వనితలార!
తే॥ గీ॥ అతుల భవ్యచరిత్ర సం ♦ చితపవిత్ర
నీ విమలగాత్రిం గరుణతో ♦ బ్రోవరయ్య
భూతకోటుల కాధార ♦ భూతులగుచు
జగములేలెడు భాస్కర ♦ చంద్రులార!

సీ॥ పుట్టింపం బోషింప ♦ గిట్టింపం గర్తలా
ఘనులార జానకిం ♦ గావరయ్య!
ఏయాపదలను రా ♦ నీక నాతల్లిని
గాపాడవమ్మ యో ♦ గగనవాణి!
ఒంటియైసీత యిం ♦ దున్నదో గహనమా!
రక్షింపనీదె ♦ భారమ్ము సుమ్ము!
వన్యజంతువులార ♦ బ్రతిమాలుకొందు మి
మ్ములసీతం జేరక ♦ తొలంగిపొండు॥
తే॥ గీ॥ భూరికరుణార్ద్రచిత్త! యో ♦ భూమిదేవి!
అతిసమర్థవు నీ వెటు ♦ లైననీదు
పుత్త్రికారత్నమును కృపం ♦ బ్రోవుమమ్మ
మఱువకమ్మ సీత నిదే న ♦ మస్కరింతు॥

(భూమికినమస్కరించి సీతనుచూచుచు నిష్క్రమించును.)

సీత—(స్వ) అక్కటా! దక్షిణనేత్ర మదరుచున్నది. నాకన్నియు నపశకునములే

చూపట్టెడిని. ఈ యరణ్యమున నాచిత్త మతిభయకంపిత మగుచున్నది. అయ్యయో! నా కాపాడుహరిణమేల కనిపించె! సౌమిత్రిమాటలువినక దానిందెమ్మని నాధునేం పంపితిని? ఇంతకునేకీడు మూడనున్నదో తెలియదు. (వగచుచుండును.)

(అప్పుడు సన్యాసి వేషమున రావణుఁడు ప్రవేశించును.)

రావ—(స్వ) ఇది యేపర్ణశాల. ఆహా! ఈజగన్మోహనియే సీతకాఁబోలును!

తే॥ గీ॥ లలిత రాకాసుధాంశుమం ♦ డలముఁబోలె
వితతజలదచల త్తటి ♦ ల్లతవిధాన
భాసుర విరాజదురుమణి ♦ ప్రభయుఁబోలెఁ
గనులపండువు సేయు నీ ♦ కాంత భళిరె॥

నాకన్ను లిప్పటికి పావనములైనవి.

సీ॥ స్వర్గవాసుల సుధా ♦ శనులఁ జేయఁగఁ జతు
ర్భుజుఁడు తాల్చినసతీ ♦ రూపమనఁగ
హరియురమ్మును వీఁడి ♦ ధరణిపై విహరింప
వచ్చిన భార్గవీ ♦ వనితయనఁగ
భవుని యర్ధాంగమ్ము ♦ వదలి యేతెంచిన
పర్వతేశుని ముద్దు ♦ పట్టియనఁగ
అజునాల్కనున్కి రో ♦ సి జగంబుఁ దిలకింపఁ
జనుదెంచినట్టి వా ♦ క్సతి యనంగఁ
తే॥ గీ॥ బరఁగునీయింతిఁ దామర ♦ విరులబంతి
నంగములఁదొంతిఁ బూవిల్తు ♦ నరిదిదంతిఁ
గనులఁగనుఁగొనినంత మం ♦ దునకునైనఁ
గాని పుంస్త్వంబు రయమునఁ ♦ గలుగకున్నె?



సీ॥ నిండు పున్నమచేయి ♦ నెల యందమును మీఱు
నీనెమ్మొగంబున ♦ కెద్దిసాటి?
లలిమీలఁబోలి చే ♦ లలగొల్వఁ దగియున్న
యీవాల్గనుంగవ ♦ కెద్దిసాటి?
మేలిపదార్వన్నె ♦ జాళువాజిగిగేరు
యీమేనిసొబగున ♦ కెద్దిసాటి?

డంబు మీఱెడు పగ ♦ డంబును మెచ్చని
యీయధరమ్మున ♦ కెద్దిసాటి?
తే॥ గీ॥ చక్రములమీఱి కుసుమగు ♦ చ్ఛముల దూఱి
యబ్జములఁబోలి మేరున్న ♦ లనఁగఁజాలి
జిలుగు పయ్యెద తెరఁ ద్రోసి ♦ వెలికినిక్క
యీ కులుకు గబ్బిగుబ్బల ♦ కెద్దిసాటి॥

లతాసదృశమగు తననెమ్మేన వల్కలాంబరము నలంకరించి మోమున నొక్కింత విషాదముతోఁప మొగులావరించిన చందమామవలెఁ దనయందము మాటుపఱచియు నీచానదివ్యమంగళాకార మెంతమనోహరముగ నున్నది!

సమీపించి యీమెతోఁ గొంతసంభాషించి ధన్యతఁజెందెదఁగాక!

(సీతను సమీపించి) నారాయణ! నారాయణ! (అని జపమాలఁ ద్రిప్పుచుండును.)

సీత—(స్వ) ఎవరో మహాత్ములు వచ్చుచున్నారు. (ప్ర) యతీంద్రా! వందనములు. (నమస్కరించును.)

రావ—కల్యాణమస్తు.

సీత—ఆర్యా! ఇం దధిష్ఠింపుఁడు.

రావ—కాంతా! భయంకరమగు నీయరణ్యమధ్యమున నిర్భీతి నొంటిమై నివసించుచున్నదానవు! నీవెవరవు? నీపూర్వనివాసస్థాన మెయ్యది? నిన్నుఁజూడ రాజపుత్త్రివలె నున్నావు. నీ యుదంత మేమి?

సీత—మహాత్మా! నేను జనకనరేంద్రుని కుమార్తెను. నానాథుఁడు పితృవాక్పరిపాలనార్థము పదునాలుగేం డ్లరణ్యవాసము సేయ ననుజనితోడను నాతోడను గాలవశంబున నిట్లు రావలసివచ్చె.

రావ—అట్లైన నీనాథుండును మఱఁదియు నెటకరిగిరి?

సీత—దేవా! నేఁడొకహరిణము నాకంటఁబడ దానిందెమ్మని నేను ప్రార్థింప నాథుండా కురంగముంబట్ట నరిగె. పిమ్మట నాథుఁడు తమ్మునింజీర నతఁడిప్పుడే యగ్రజునకు సహాయముగఁ బోయెను.

రావ—అక్కటా! వీరెంత తెలివిమాలినవారు! దానవనివాసంబగు నిట్టిమహారణ్యమునఁ దరుణవయస్కవగు నిన్నొంటిగా విడిచి పోవచ్చునా? ఏక్రూరమృగము

లైనఁ బైకివచ్చిన నబలవగు నీవేమిచేయుదువు? ఈప్రాంతమున మాయావు లగు రాక్షసులెందఱో చరించుచుందురు. వారెవరైన హానిసేయఁగడంగిన నీకెవరుదిక్కు?

చ॥ అనవరతంబు శూరతఁ బ ♦ రాంగనలన్ హరియించు కార్యమం
దనుపమదక్షులై చెలఁగు ♦ నట్టి నిశాచరులెట్లొ నిన్నిటన్
గనుఁగొని రేని మన్మథవి ♦ కారముఁజెంది బిరాన బల్మిమై
నినుఁగొని యేఁగకుందురె యి ♦ కన్ హరుఁడడ్డమువచ్చి నిల్చినన్॥

సీత—మహాత్మా! మీరు వచించినట్లు దుష్ప్రవర్తనులగు రాక్షసు లెట్టిఘోరకృత్యములకైనను సాహసింతురు. ఐనను,

తే॥ గీ॥ గ్రాహమునుఁ ద్రుంచి కరిఁగాచు ♦ ఘనుఁడెవండొ?
భక్తకోటుల రక్షించు ♦ ప్రభుఁడెవండొ?
ఆసమస్త జగన్నాథుఁ ♦ డబలనైన
పడఁతి నొక్కతె నన్నుఁ గా ♦ పాడలేఁడె?

రావ—మానినీ! గాలిలో దీపముఁబెట్టి భగవంతునిపై భారమువేయుట తెలివి మాలినపని. సాధ్యమగునంతవఱకు మనము ప్రయత్నించుట ముఖ్యము. అబలవగు నీవిట్లరణ్యమున నొంటివై నివసించుట యెంతయు నపాయకరము. మా యాశ్రమమిచ్చటి కనతిదూరంబుననె కలదు. నిన్నిప్పు డచ్చటికి తీసికొనిపోదును. నీనాథుఁడు వచ్చినవెనుక మరల నిన్ను మాశిష్యులిచటికిఁ దీసికొని రాఁగలరు. కావున శంకింపక నావెనువెంట రమ్ము. నేఁబెఱవాఁడఁగాను.

సీత—అయ్యా! మిమ్ము నేఁబెఱవారిగాఁ దలంపను. మదీయజనకుండగు జనకుఁడెట్లో మిమ్మట్లు భావించుచున్నదానను. కాని నాథుఁడు వచ్చువఱకు నేనిచ్చటి నుఁడి బయులుదేరఁజాలను. క్షమింపవేఁడెద. మీరన్యథా తలఁపవలదు.

రావ—పోనిమ్ము. నీకిష్టములేనప్పుడు నేనేల బలవంతపఱుపవలయును? (ఆకాశము వంకఁజూచి) ఓహో! నేనువచ్చి చాలసేపైనది. ప్రసంగవశమునఁ బర్ణశాల మఱచినాఁడను. మానినీ!

తే॥ గీ॥ ఎంతొతడవయ్యె నేనిట ♦ కేఁగుదెంచి
యుటజమున శిష్యులేరీతి ♦ నున్నవారొ
జాగుసేయక రయమున ♦ నేఁగవలయు
పడఁతి! భిక్షనొసంగి నన్ ♦ బంపుమింక॥

సీత—(స్వ) ఇప్పు డీయన కేమిభిక్షనొసంగుదును? రాజ్యభ్రష్టులమైయున్న మాకడ వన్యపదార్థములు తప్ప మఱేమియు నుండవని యీయన మాత్రమెఱుంగడా? (కందమూలాదులఁ బుచ్చుకొని, ప్రకాశముగ) మహాత్మా! యీకందమూలములఁగైకొని మమ్ముఁ గృతార్థులఁగావింపుఁడు. (ఈయఁబోవును.)

రావ—వనితా! నేనిభిక్షుకై వచ్చినవాఁడను గానుసుమా!

సీత—అయ్యా! మాకడ నింతకన్న నధికపదార్థము లేవి కలవు?

రావ—ఉన్నపదార్థములం దొకదానిని వాంఛింతును. లేదనవుగదా?

సీత—(స్వ) ఈయన యేమికోరునో!

రావ—సందేహించెద వేమి?

సీత—మునీంద్రా! సందేహించుటలేదు. మీయభీష్టమెఱిఁగింపుఁడు.

రావ—(స్వ) అబ్బా! ఇంకెంత తాళుదును? (ప్ర) మానినీ! దాఁపనేల? తెలిపెద వినుము. నేను కోరినది నీయధరామృతభిక్ష!

సీత—(చెవులుమూసికొని) శివశివా! మునీంద్రులగు మీ రిట్లనఁజెల్లునా? నేను మీపుత్రికవంటి దాననుగదా!

రావ—(నవ్వుచు) చెలీ! నేను మునినిగాను సుమీ! నాచెలియలగు శూర్పనఖ నీయనూనసౌందర్యాతిశయమును వర్ణింప విని మోహితుండనై, మాయాకురంగమును సృజించి నీమగనిని మోసగించి కృత్రిమయతివేషముఁదాల్చి వచ్చిన లంకానాథుఁడను. నాపేరు రావణుఁడు. నిజభుజబలాటోపనిర్జిత సురేంద్రుండనగు మదీయపరాక్రమ మొక్కింత వివరించెద నాకర్ణింపుము.

మ॥ గురుశైలంబులనెత్త, భీకరమహా ♦ ఘోరాజి నాధూర్జటిన్
దరుమన్, దిక్తటకుంభి కుంభముల బ్రి ♦ ద్దల్ సేయుఁ, దారావళుల్
ధరణిన్ రాల్పఁగ, సూర్యచంద్రులవడిన్ ♦ దాళాలుగావింప, సా
గరముల్ రొంపిగఁజేయఁ జాలుదును రా ♦ కా పూర్ణచంద్రాననా!

సీత—ఓరీ! కుత్సితాత్మా! ఎంతమోసముఁజేసితివిరా! నీ వొకమునీంద్రుఁడవని భక్తితో సంభాషించి పాపముఁగట్టుకొంటిని. ఇంకవచ్చినతొత్రపంబొమ్ము. పరాంగనాభిలాషులగు దుష్టుల దండధరకింకరులు ప్రచండోద్దండ పాశంబులఁ గట్టికొట్టుచు బాధింతురు. నీ దుర్మోహము మానుము.

రావ—మానినీ! నా కాయమభటులవలని భయమావంతయు లేదు.

ఉ॥ కాలునిదూత లంతమునఁ ♦ గట్టుట కొట్టుటయేమొకాని నేఁ
డోలలితాంగి! పంచశరుఁ ♦ డుగ్రతసేయు మహాశరంబులన్
దూలితి, పాపమన్భయము ♦ దోలితి, నీయధరమ్మొసంగి న
న్నేలెదొ మన్మథాగ్నిఁబడ ♦ నేసెదొ నీయదె భార మంగనా॥

సీత—ఛీ! ఛీ! దుర్మోహాంధుఁడా! నీ దుష్ప్రసంగము లికఁ గట్టిపెట్టుము. నాథుండిది యెఱిఁగిన నీ యుసురుఁ దీయక మానఁడు.

రావ—అబలా! నరమాత్రుఁడగు నీ నాథునకుఁ ద్రిలోకభయంకరుండగు నీ రాక్షసనాథుఁడు వెఱచుననియా నీ యుద్దేశము! అల్లెన్నఁడుఁ దలంపకుము. ఇఁక జాగుసేయక నాతోడ లంకానగరంబునకు రమ్ము. నీ యిచ్ఛవచ్చినట్లు సకల సౌఖ్యము లనుభవింపఁగలవు. పండువెన్నెలకు వాడిపోవు నీ మృదుతనువు నిట్లరణ్యావాసకష్టముల పాలొనరించిన యీ నరాధముని చెంతనున్న నీ వేమిసుఖము ననుభవించెదవు?

సీత—ఓరీ! పాపాత్మా! నీకుఁ గన్నులు నెత్తికెక్కినవా యేమి, ఎంతచెప్పినను వినకున్నాఁడవు. బ్రతుకనిచ్ఛకలదేని మాటాడక తొలఁగిచనుము.

రావ—చంద్రవదనా! నీ వీమహాటవియందుండి పొందుచున్న సుఖ వేమి? నీ మేలుఁగోరి వచించు నా వాక్యము లేల పాటింపవు? సకలలోకశాసనుఁడనగు నేను స్వయముగవచ్చి కోరుచుండ సిరిరా మోకాలొడ్డినట్లు నిరాకరించుచున్నదానవు కదా! నీవు బొత్తుగ నజ్ఞురాలవుసుమా!

సీ॥ సలలితహాటక ♦ కలితసీమలు బాగో
శితకంటకావృత ♦ సీమ బాగో
మంజులారామ సీ ♦ మల విహారము మేలో
ఘోరాటవిని వగ ♦ గొనుట మేలో
హర్మ్యాంతరంబుల ♦ నలరుచుండుట లెస్సో
పర్ణశాలల దుఃఖ ♦ పడుట లెస్సో
మృదులతల్పముల ని ♦ ద్రించుటద్ది సుఖంబో
కటికినేలను బరుం ♦ డుట సుఖంబో॥
తే॥ గీ॥ దళితశాత్రవుఁ బంక్తికం ♦ ధరునిఁ గూడి
యమితభోగాంబునిధి నోల ♦ లాడుటింపో
హీనమానవుఁగూడి వ ♦ ర్తించుటింపో
చెలియ! నీమది నీవె యో ♦ చించుకొనుము॥

సీత—దైత్యాధమా! నీకు వినాశకాలము సమీపించినట్లున్నది. కావుననే యిట్టి దుర్భాషలాడుచున్నాఁడవు.

రావ—కాంతా! నాముందింక నీ యాగడములుపనికిరావు. నన్నుఁ జేపట్టి లంకానగరమున నాతో సకలసౌఖ్యములనుభవింప నిచ్ఛకలదేని మారాడక నావెంట రమ్ము. మారుమసలితివేని రాక్షసధర్మానుసారముగ నిన్నిప్పుడే బలాత్కారముగఁ గొనిపోదును. ఏదో ప్రత్యుత్తరమిమ్ము.

సీత—(భయదుఃఖములతో) ఓరీ! పాపాత్మా! సాహసింపకుము. అక్కటా! బుద్ధిమంతుఁడగు లక్ష్మణుని మాటలువినక నేనెంత మహాపదకుఁబాలైతిని. అయ్యయో! నేనిప్పుడేమిచేయుదును? నాకిత్తరి దిక్కెవరు? ఓ యార్తావనదీక్షాపరతంత్రా! దుష్టరాక్షసవధావిధానపాండిత్యధురంధరా! భక్తజనసంకటాపహరణా!

ఉ॥ ఓనళినాక్ష! యోవరద! ♦ యోజగదీశ్వర! యోరమేశ! యో
దానవవైరి! యోఖలవి ♦ దారి! నిశాటుఁడొకండు బల్మిమైఁ
దా నను ముట్టిచ్చిలించి పటు ♦ దర్పమునన్ జననున్నవాఁడయో
దీనశరణ్య! యీఖలుని ♦ దీటడఁగింపవె నన్నుఁ గావవే॥

ఓరీ! రాత్రించరాధమా! సాధ్వినగు నన్ను హరింపనెంచుట నీ నాశనమును నీవు కోరుకొనుటగాఁ దలంపుము. భయంకరసంగ్రామరంగ నిర్దళితఖరదూషణుండగు నాపతి శరజాలములు నీ యురంబును బ్రద్దలుచేయుఁగలవు. నీ యీ దుష్ప్రవర్తన మఖిలాంతర్యామియగు నీశ్వరుఁడు చూచుచుండుట లేదా? ఏతత్ఫలంబు నచ్చుట నీ వనుభవింపకతప్పదు.

తే॥ గీ॥ ఓరి! కఠినాత్మ! నీప్రియ ♦ దార నొక్కఁ
డొరుఁడు కోరిన నీకెట్టు ♦ లుండుఁజెప్పు
మట్ల కాదొకో యన్యుల ♦ యంగనలును
జడుఁడ! దుర్మోహమేటికి ♦ విడుము విడుము॥

రావ—(కోపముతో) ఓసీ! ఆడుదానవని నేనెంత నిదానించుచున్నను నీవాచాలత్వమధికమగుచున్నది కాని తగ్గుటలేదు. ప్రళయకాలప్రకంపనమహావేగసముద్ధూతభూరేణుపటలంబులపగిది శత్రుసైన్యమస్తకంబుల నెగఁజిమ్మి సకలదేవతానీకముల వెట్టిగొన్న మదీయ బలపరాక్రమములు నీకుఁ గొఱగాకున్నవిగా! ఇదిగోఁ జూడుము. గరుడ గంధర్వ కిన్నర కింపురుష యక్షసిద్ధసాధ్యప్రముఖ మహాభయప్రదంబగు నస్మదీయనిజాకారంబుదాల్చి దుర్జయుండనై నిన్నవలీలం గొనిపోయెదను. నీ కిప్పుడెవఁడడ్డమువచ్చునో చూచెదఁగాక. (నిజస్వరూపముఁ జూపును)

సీత—(మూర్ఛిల్లుచున్నది.)

రావ—(సీతను గొనిపోవుచున్నాఁడు.)

(అనంతరము రామలక్ష్మణులు ప్రవేశింతురు)

రాము—తమ్ముఁడా! ఏమిది! పర్ణశాల కాంతిదక్కి పాడువారి నట్లున్నది!

చ॥ నళినవిహీనమౌ కొలను ♦ నాఁగ, సుధాంశుఁడులేని యామినిం
బలె, శుకశారికారహిత ♦ మై కళవీడిన పంజరంబటుల్
ఫలసుమశూన్యపాదపము ♦ భాతిని, బర్ణకుటీరమెంతయున్
వెలవెలఁ బాఱుచున్నయది ♦ భీతిజనించెడి నాకుఁ దమ్ముఁడా॥

లోపలికిఁబోయి చూచెదఁగాక. (పర్ణశాలలోనికరిగి వెదకివచ్చి) చిత్రముగనున్నదే! ఎన్నండును బర్ణశాల విడచియెఱుంగనితన్వి యీనాఁ డెందరిగి యుండును? నీ వటుపోయి చూడుము. నే నీప్రక్కన వెదకెదను.

లక్ష్మ—చిత్తమట్లెచేసెదను. (ఇరువురు చెఱియొకప్రక్కకు నిష్క్రమింతురు.)

---

(5 రంగము - అరణ్యము)

(సీతను వెదకుచు లక్ష్మణుఁడు ప్రవేశించును.)

లక్ష్మ— తే॥ గీ॥ కూర్మి జానకి పుష్పముల్ ♦ కోయుచోట్ల
లలన నీరంబు గొనివచ్చు ♦ కొలఁకులందుఁ
గలయ వెదకియు నేఁడును ♦ గానసైతి
నక్కటా! యేమివింతయో ♦ యరయరాదు॥

ఒక్కసారి యెలుఁగెత్తి పిలిచి చూచెదను.

తే॥ గీ॥ ఓ జనకపుత్రి! యోసీత! ♦ యోమహీజ!
పార్థివోత్తముఁడటు లేఁడిఁ ♦ బట్టనేగి
వచ్చియున్నాఁడు క్రమ్మఱ ♦ వనమునందు
వెదకుచున్నాఁడు నిన్నువే ♦ వేగరమ్మ॥

అయ్యో! ఏమిచేయుదును? సీతాదేవి నెట్లు పొడఁగాంతును? అగ్రజున కెట్లూఱటఁ గల్పింతును? ఈమె యేమైనదియుఁ దెలియదయ్యో. (సీతనుద్దేశించి)

అమ్మా! భూసతీసుతా! నే నెంతచెప్పినను నామాటలఁ బాటింపనైతివి? నీవిప్పుడెచ్చట నెట్టి యాపదకుం బాలైతివో తెలియదు. అక్కటా! ఇప్పుడు కర్తవ్యమేమి? ఇంకను వెదకిచూచెదను. (వెదకుచు నిష్క్రమించును.)

(అంత రాముఁడు సీతను వెదకుచు దుఃఖముతోఁ ప్రవేశించుచున్నాఁడు.)

రాముఁడు—హా! ప్రాణేశ్వరీ! హా! సీతా! క్షణమాత్రమైన మద్వియోగము సహింపఁజాలని నీవు నన్ను విడనాడి యెందరిగితివి? నాచిత్తముఁ బరీక్షింప నీ ప్రాంతమున నెందైనడాఁగితివా? జాగుచేయక నీవదనేందు దర్శనమిచ్చి నా సంతాపమార్పుము. అయ్యయో! ఎంత విలపించినను నీకు నాపైఁ గనికరముజనింపకున్నదిగదా! జీవితేశ్వరీ! నీవిట్టి పాషాణహృదయవని నే నెన్నండును నెఱుంగను. అయ్యో! నేనెంత తెలివిమాలినవాఁడను. నాహృదయేశ్వరి, నామనోధనము, నాముద్దులగుమ్మ, నాసీత, నాయెడ నింత కఠినమూనునా? కల్ల! హా! జానకీ! నీవేదుష్టమృగములపాలైతివో. ఏమాయదానవులు నిన్ను హరించిరో! (వినుటనభినయించి) (సంతోషముతో) ఆహా! ఆమృదుధ్వని సీతకంఠస్వరమే! (కొంచెమునడచి చూచి) ఛీ! దుష్టపికమా! నీవు నన్నెంత మోసపుచ్చితివి? పలుగాకుల సహవాసమునఁ బెరిగినదానవగుటచే నీవును పలుగాకివైతివి. నీముఖముఁ జూడరాదు. (మరియొకవైపున కరిగి) అల్లదే! యాపొదమాటునడాఁగి నాప్రేయసి మెఱుఁగుఁబోను తన చూపుఁదూపులు నాపైఁ బఱపుచున్నది. (కొంచెమునడచి నిలచి) ఓహరిణాధమా! నీకన్నులుఁ గాలిపోను! నన్నెంత భ్రమింపఁజేసితివి! నన్ను మోసపుచ్చి నాకాంత నెడఁబాయఁజేసిన కురంగజాతిలోఁ జేరినదానవగుటచే నీవతిపాపివి. నీవదనము వీక్షింపరాదు! (మఱియొక వంకఁజూచి) ఆహా! ఆనీలకుంతల తప్పక నాసీతయే! (కొంచెమునడచి నిలచి) క్రూరమయూరమా! నిరంతరవిషసర్పభోజివగు నిన్ను నమ్మరాదు. (మఱియొక వంకఁజూచి సంతోషముతో) నేనిప్పటికి ధన్యుఁడనైతిని. అదిగో నాహృదయేశ్వరి తనచేసన్ననన్ను రమ్మనుచున్నది. (కొంతనడచి నిలచి) ఓలతా! కాంతావియోగమునఁ బరితపించునేనా నీకు హాస్యమునకు దొరకితిని? అరుణమగు నీపల్లవంబు నటునిటు గదలించి నాకు భ్రాంతిగొలుపుదువా? చూడుము నిన్నిప్పుడేమిచేసెదనో! (తీగను త్రుంచివేయును.)

అక్కటా! భ్రమాకులితచేతస్కుండనై సర్వము సీతామయముగాఁ దోఁప వనమంతయు గ్రుమ్మరుచున్నవాఁడనుగాని యెందును జానకి కానరాదయ్యె. ఏమిచేయుదును? నాప్రియకాంతజాడ నెవ్వరి నడుగుదును?

సీ॥ మృదు తృణాంకురములు ♦ మేయు నేణములార!
డంబుమీఱెడు మదే ♦ భంబులార!

మదిఁబొంగి రొదసేయు ♦ కొదమ తుమ్మెదలార!
చిలిఁజెలంగెడు ముద్దు ♦ చిలుకలార!
పంచాస్త్రగీతముల్ ♦ పాడుకోయిలలార!
ఇమ్మైన్మ తనర్చు నె ♦ త్తమ్ములార!
మహనీయ సురభిళ ♦ మల్లికాలతలార!
మంజుల కదళీద్రు ♦ మంబులార!
తే॥ గీ॥ హరిణలోచన, నిభయాన, ♦ నళిశిరోజ,
గీరవాణిఁ, బికాలాప, ♦ వారిజాస్యఁ
సుందరదన, రంభోరువఁ, ♦ సూర్మిమీరుఁ
గానరే! చూపరే! సీతఁ ♦ గానలోన॥

అక్కటా! సఖి! రాకాశశాంకమండలముఁబోలు నీవదనమండలమును నేనెట్లు చూడఁగలను? (దుఃఖముతో) హా! పరాజితగంధగజేంద్రగమనా! హా! విభీతచంచలకురంగలోచనా! హా! త్రిలోకసుందరీ! హా! జానకీ! హా! సీతా! (అని మూర్ఛిల్లుచున్నాఁడు.)

లక్ష్మ—(విచారముతోఁ బ్రవేశించి, స్వ) వెదకివెదకి వేసారితిఁగాని యెందును సీతజాడ కనుపించదయ్యె. (రామునిజూచి) అక్కటా! మాయన్న భార్యావియోగజనితదుఃఖాతిరేకమున మూర్ఛ మునింగియున్నవాఁడు. దైవమా! మాకెన్నియిక్కట్టులఁ గూర్చుచున్నవాఁడవు! ఈయననుపిలిచి చూచెదను. (ప్ర) అన్నయ్యా!

రాము—(కన్నులు విచ్చిచూచి) నీవెవ్వఁడవు?

లక్ష్మ—(స్వ) ఆహా! ఈపార్థివోత్తముఁడు శోకవశంబున మైమఱచియున్నాఁడు. (ప్ర) అన్నయ్యా! ఎఱుఁగనట్లడిగెదవేమి? నేను నీతమ్ముఁడఁగదా!

రాము—నీవు నాతమ్ముఁడవా! మఱచితిని. ఐన నీనామమేమి?

లక్ష్మ—నాపేరు లక్ష్మణుఁడుకాదా?

రాము—నీవు లక్ష్మణుఁడవా! అటులైన నీయన్న రాముఁడేడి?

లక్ష్మ—అగ్రజా! దుఃఖాతిరేకమున నిన్ను నీవెఱుఁగకున్నాఁడవు. రాముఁడన నీవేకదా!

రాము—నేను రాముఁడనైన సీతయేమయ్యె?

లక్ష్మ—వెదకి వచ్చితిఁగాని కనుపింపలేను.

రాము—హా! సీతా! (మరల మూర్ఛిల్లును.)

లక్ష్మ—(స్వ) ఇప్పుడీయనకు శైత్యోపచారములు చేసెదను. (అట్లు చేయుచున్నాఁడు.)

రాము—(లేచి) హా! జీవితేశ్వరీ! నిన్నెంతకాలమునకుఁ జూడఁగలిగితిని! (అనిలక్ష్మణునిఁ గౌఁగిలించుకొనును.)

లక్ష్మ—అన్నయ్యా! నేను నీ తమ్ముఁడను.

రాము—(తెల్లపోయి లక్ష్మణునివిడచి) హా! మదమరాళగమనా! హా! మత్ప్రియసతీ! నీవులేకున్న నేనీప్రాణములెట్లు భరింపఁగలను?

లక్ష్మ—(స్వ) ఈయన కీసమయమునఁ గొంచెము ధైర్యముఁ జెప్పవలయును. (ప్ర) అగ్రజా! సర్వజ్ఞుండవగు నీవిట్లు శోకింపఁజనదు.

ఉ॥ కాలవశంబునన్ గలుగు ♦ కష్టపరంపర కాత్మధైర్యమున్
దూలి వివేకహీనుఁ డతి ♦ దుఃఖవశుండయి వ్యర్థుఁడౌ, విప
త్కాలమునందు శైలము వి ♦ ధ బున సుస్థిరచిత్తుఁడై తుదిన్
మేలునుజెందు నెంతయును ♦ మేదినిఁ బ్రాజ్ఞుఁడు లోకమాన్యుఁడై॥

రాము—తమ్ముఁడా! నాకిప్పుడు జగమంతయు నంధకారమయముగ నున్నది. కర్తవ్య ముపదేశింపుము.

లక్ష్మ—ధైర్యమువహించి సీతాసతిని వెదకుటయె కర్తవ్యము.

రాము—అట్లైన నడుపుము. (ఇరువురు వెదకుచు నిష్క్రమింతురు.)

---

(6 రంగము: అరణ్యము)

(జటాయువు రెక్కలు తెగి ప్రవేశించును.)

టా—(దుఃఖముతో) అక్కటా! పుణ్యమునకుఁబోవఁ బాపమువచ్చిన ట్లయ్యెనుగదా!

చ॥ దనుజునిచేతఁ జిక్కి యతి ♦ దైన్యమునన్ గడు సుక్కి యేడ్చు నా
జనకతనూజపాటు గనఁ ♦ జాలక యేగతినైన నా సుసా
ధ్వని పటుశక్తిఁబోరి విడి ♦ పింపగఁ గోరి రణంబుసేయ నన్
గనికరమింతలేకిటుల ♦ గాజేయ వెట్టెదె పాపిదైవమా॥

రాము—(తెరలో కోపముతో) రే! దైత్యాధమా!

తే॥ గీ॥ కలుషమతివయి మత్ప్రియాం ♦ గనహరించి
మమ్ముఁగని యిట్టు లోకవిహా ♦ గమ్మవగుచు
నోడుగుచున్నాఁడ విదెమదీ ♦ యోగ్రబాణ
శిఖల నినుఁగాల్చి భస్మముఁ ♦ జేయువాఁడ॥

జటా—ఓ మహాత్మా! శాంతిఁపుము. నేను మీకు వైరినిగాను, మిత్త్రుఁడను, మీభక్తుఁడను; రావణాసురాపహృతయై దెసలునిండ వాపోవుచు దక్షిణాభిముఖియై చనుచున్న సీతామహాదేవిని విడిపింపఁదలఁచి దురాత్ముఁడగు నా దశకంఠునితోఁబోరి తుదకిట్లు రెక్కలుతెగి ప్రాణావశిష్టుఁడనైతిని. నాపేరు జటాయువు.

(రామలక్ష్మణులు ప్రవేశింతురు.)

రాము—హా విహంగశేఖరా! పరోపకార చింతాతత్పరుండవగు నీ వెంత దుర్దశకుఁ బాలైతివి. తమ్ముఁడా! దయాంతరంగుఁడై సీతనువిడిపింపఁదలంపూని పోరు సల్పిన యీ ఖగశేఖరున కెంతయవస్థకలిగినదో చూచితివా? అక్కటా! ఏమికాల వైపరీత్యము!

తే॥ గీ॥ పుడమి దుష్కార్యమొనరింపఁ ♦ బూనువాని
కెట్టి యాపదలును గల్గ ♦ వీజగానఁ
గడఁగి సత్కార్యమొనరింపఁ ♦ దొడఁగువాని
కన్నియును నాపదలెవచ్చు ♦ నవనిలోన॥

జటాయు—(కొనయూపిరితో) మహాత్ములారా! నాప్రాణములు కదలుచున్నవి. నా కన్నులు మూతలువడుచున్నవి. నాకు మూర్ఛవచ్చుచున్నది. (ప్రాణములు విడుచును.)

లక్ష్మ—అగ్రజా! తిర్యగ్జాతులందును ధర్మాత్ములును బరాక్రమవంతులును గలరు సుమా!

రాము—ఔను తమ్ముఁడా! మననిమిత్తమున నీతఁడు విగతజీవుండగుటచే నీతని కగ్నిసంస్కారము జరుపవలయును. కావునఁ దగుపరికరంబుల సమకూర్పుము. ఈతఁడు నాచే సత్కృతుండై యశ్వమేధాది మహాయజ్ఞములొనరించినవారును హాటకాది మహాదానములు సల్పినవారును నాహితాగ్నులును నెట్టి పుణ్యలోకములందుదురో యట్టిలోకమును జెందుఁగాక!

లక్ష్మ—చిత్తము. (జటాయువున కగ్నిసంస్కారముచేయుచున్నారు.)

(యవనికజారును.)



శ్రీ

# సంపూర్ణ రామాయణము.

## చతుర్థాంకము.



(1 రంగము: ఋశ్యమూకము)

(రామలక్ష్మణులు, సుగ్రీవుఁడు, ఆంజనేయుఁడు ప్రవేశింతురు.)

రాము—ప్లవంగశేఖరా! సుగ్రీవా! పరమసద్గుణగరిష్ఠుండవును, నుత్తమోత్తముండవును నగు నీచెలిమి దుస్సహభార్యావియోగజనితదుఃఖానలసంతప్తహృదయుండనగు నాకొక్కింత యూఱటకుం గారణమయ్యె.

లక్ష్మ—అన్నయ్యా! ఈతఁడెంతయు స్నేహపాత్రుఁడు. ఇట్టివారితోఁగదా సఖ్యముఁ జేయవలయును.

సుగ్రీ—మహాత్ములారా! రామలక్ష్మణులారా!

తే॥ గీ॥ ఆరయ మదీయ పూర్వపు ♦ ణ్యంబుకతన
నఖిలజగదేక విక్రము ♦ లైన మిమ్ముఁ
బుణ్యపురుషులఁ బూజ్యుల ♦ భూరిబలులఁ
గాంచి ధన్యుఁడనైతి నా ♦ కలఁతదీఱె॥

రాము—సుగ్రీవా! మనకుఁ బరస్పరసఖ్యము ఘటించినమేటియగు నీపవనతనూజుని బుద్ధికుశలతయుఁ బ్రజ్ఞయు నత్యంతశ్లాఘాపాత్రములు.

ఆంజ—మహాత్మా! దాసుఁడు స్తోత్రమున కనర్హుఁడు.

సుగ్రీ—ఈ ఆంజనేయుఁ డన్నిటను గడుసమర్థుఁడు. మహాత్ములారా! మీతో నింకొకటి మనవిచేయుచున్నాఁడ. ఏమనిన నాయుదంతమంతయు నీవఱకే విన్నవించితిని. మాయన్నయగు వాలి దేవేంద్రాదులకైన దుర్జయుఁడు. మీరాతని నిర్జించి నన్నెట్లు రక్షింతురో! నాకిఁక మీరే శరణ్యులు.

రాము—ఓయీ! కపిపుంగవా! నీకింకను సంశయనివృత్తికాలేదా! ఇటువినుము.

ఉ॥ సింధురముఁ హరీంద్రుఁడు ♦ శీఘ్రగతిన్ విదళించునట్లు గ
ర్వాంధునివాలి నుగ్రరణ ♦ రంగమునన్ జగముల్ వడంకఁగా
బంధురశక్తి మచ్చటుల ♦ బాణశిఖావళి నేలఁగూల్చి కి
ష్కింధకు నిన్ను నాథునిగఁ ♦ జేసెద నమ్ముము సూర్యనందనా!॥

(చేతిలోఁ జేయివేయును.)

సుగ్రీ—(సంతోషముతో) ఇప్పటికిఁ గృతార్థుఁడనైతిని.

ఉ॥ వాలిశవృత్తి నగ్రజుఁడు ♦ పాతకియై పడఁతిన్ హరింప ని
ట్లాలిని గోలుపోయి విపి ♦ నాంతర సీమలఁగుందుచుండ నా
పాలిటి కల్పవృక్షముల ♦ భంగిని మీరరుదెంచినా రికన్
దాలిమికల్గె నెమ్మదికిఁ ♦ దద్దయు సంతసమయ్యె భూవరా॥

రాము—సుగ్రీవా! నీవు కిష్కింధానగరద్వారముననిలిచి నీయన్నయగు వాలిని సమరంబునకుఁ బిలువుము. నేను నీతోడనేయుండి సమయముఁ గనిపెట్టి యదుద్దురాత్మునిఁ బొలియించెదను.

సుగ్రీ—చిత్త మట్లేచేసెదను. (అందరు నిష్క్రమింతురు.)

---

[2 రంగము - యుద్ధభూమి)

(వాలి సుగ్రీవులు కలహించుచుఁ బ్రవేశింతురు.)

వాలి—ఓరోరి తుచ్ఛుఁడా!

చ॥ అరయఁ ద్రిలోకసంవిదిత ♦ మైన మదీయపరాక్రమంబు ము
న్నెఱిఁగియు నిట్లు కయ్యమున ♦ కిప్పుడువచ్చితి మేనుక్రొవ్వి, మ
త్ఖరతరవజ్రతుల్య సము ♦ దంచితతీక్ష్ణ శరప్రభూతని
ష్ఠుర భయదాగ్నికీలఁజవి ♦ చూడఁగనెమ్మదిఁ గోర్కెగల్గెనే॥

సుగ్రీ—ఓరోరి సోదరభార్యాపహరణా! నీదుండగము లింకెంతకాలము సాఁగుననుకొంటివి?

ఉ॥ మించి మదాతిరేకమున ♦ మిన్నును మన్నునుగానకట్లు ద్రో
హాంచిత బుద్ధిసోదరుఁడ ♦ నౌ ననునప్పు డకారణంబుగా
వంచనఁజేసి నాయనుఁగు ♦ భార్యహరించితి పాపకార్యమం
చెంచక, తత్ఫలం బనుభ ♦ వింపక తప్పునె నీకు దుష్టుఁడా?॥

నీ కీనాఁటితో నాయువునిండినదిగా నెంచుకొనుము.

వాలి—ఛీ! ఛీ! నీచుఁడా! ఆలిని నాకప్పగించి యడవులపాలైపోయిననాఁడు నీ యీ ప్రతాపమంతయు నేమయ్యె? సిగ్గులేక యింకను శూరునివలె యుద్ధమునకు వచ్చితివా?

సుగ్రీ—ఓరీ! మాటలతో నేమిప్రయోజనము? ఇంకొక క్షణమునకు నీగతి యేమగునో చూచెదవుగాక!

వాలి—ఓరీ! వాచాటా! నిన్నిఁక సైరింపరాదు. (అని యిరువురు గదిసి యుద్ధము జేయుచున్నారు.)

రాము—(మ్రానుచాటున నిలిచి,) (స్వ) ఇప్పు డీదురాత్ముని మదీయకఠోరమార్గణమ్మున కెరగావించెదను! (వాలిపై బాణము ప్రయోగించుచున్నాఁడు.)

వాలి—హా! (అని పడిపోవును) (తెరవ్రాలును)

---

(3 రంగము: సముద్రతీరము)

(ఆంజనేయుఁడు, అంగదుఁడు, జాంబవంతుఁడు, గజుఁడు, గవాక్షుఁడు, శరభుఁడు, ఋషభుఁడు, గంధమాదనుఁడు, మైందుఁడు, ద్వివిదుఁడు, దారుఁడు, ప్రవేశించుచున్నారు.)

అంగ—తాతా! జాంబవంతా!

ఉ॥ ఆతతశైలసానువుల, ♦ నంబుధులన్, విపినోగ్రసీమలన్
ఖ్యాతిగ భూసుతన్ వెదకి ♦ కానక చావఁదలంచి యంత సం
పాతి ముఖంబునన్ బుడమి ♦ పట్టి దశాస్యునిలంకనుంట సం
ప్రీతి నెఱింగినారమిఁక ♦ వేగమె తత్పురి కేఁగఁగావలెన్ ॥

కావున వయోవృద్ధుండవగు నీవే కర్తవ్య మూహింపుము.

జాంబ—యువరాజా! అంగదా! లంకాపురమునను్న సీతామహాదేవిని జూచివచ్చుటకై మనలో నీమహాంబుధిదాఁట సమర్థుండగు నొక్కకపివరుని నియోగింపవలెను.

అంగ—ఔను. మనయం దట్టిప్రవీణత యేరికిఁగలదో యరయవలసి యున్నది. ఓగజ, గవాక్ష, గంధమాదన, మైంద, ద్వివిదాది వానరయోధులారా! మీయందు శతయోజన విస్తీర్ణమగు నీసముద్రమును లంఘింప దక్షులెవరో యిటురండు. మనమందఱ మిప్పట్టున రామకార్యమును నెఱవేర్చి మనస్వామి యగు సుగ్రీవునకు యశంబుఁ గూర్పవలయును. మీమీబలముల వచింపుఁడు.




గజుఁడు—యువరాజా! నేను పదియోజనములు దాటఁగలను.

గవాక్షుఁడు—నేనిరువది యోజనములు దాటఁగలను.

శరభుఁడు—నేను ముప్పదియోజనములు దాటఁగలను.

ఋషభుఁడు— నేను నలుబది యోజనములు దాటఁగలను.

గంధమా—నే నేఁబది యోజనములు దాటఁగలను.

మైందుఁడు— నే నరువది యోజనములు దాటఁగలను.

ద్వివిదు—నేను డెబ్బదియోజనములు దాటఁగలను.

దారుఁడు—నే నెనుబది యోజనములు దాటఁగలను.

జాంబ—నాయనా! నేను బహుకాలమునాఁటి వృద్ధుఁడనగుటచే దేహపటుత్వము చెడియున్నాఁడను. నాపిన్ననాఁటి పరాక్రమ మిప్పుడు నుడివిన మీరు నవ్వుదురు. నేను తరుణప్రాయమున నుదయాద్రినుండి యస్తాద్రి కతిరయంబునఁ బోయి యటనుండి రజతగిరికిఁజని తరువాత కనకాచలంబున కరుగుచుండెడివాఁడను. తొల్లి కైలాససమీపమున జరుగు యజ్ఞమునకుఁబోయి నేనచ్చట మునులతో నిష్టాలాపము లాడుచుండ బలిపుత్త్రిఁ డొకశైలమును విసరెను. నేనద్దానిని మదీయజానువున వ్రక్కలించుటచే నప్పటినుంచియు నచ్చట బాధగానుండును. నేనిప్పుడేతయు శిథిలపరాక్రముఁడనై యున్నాఁడను. కావున బహుదూర మరుగఁజాల. యెట్లయిన నోపికచేసికొని తొంబది యోజనములు నిర్గమింపఁగలను. ఏమిఫలము?

అంగ—తాతా! నీపరాక్రమ మతివర్ణనీయము. నేను నూరుయోజనములు దాటగలనుగాని మగిడిరాఁగలనో లేనో యని శంకపొడముచున్నది.

జాంబ—నాయనా! నీవెంతకైన సమర్థుఁడవు.

ఉ॥ ఓలి సహస్రయోజనము ♦ లొక్కటదాటఁగ నోపునట్టి యా
వ్వాలి సుతుండవీవు తగ ♦ వార్నిధి నుద్ధురలీలదాటఁ గాఁ
జాలెదవైన నీభటుల ♦ సంఖ్య కపీంద్రులు చెంతనుండ మా
యేలికవైన నీవు చను ♦ టెంతయు యుక్తముగాదు చూడఁగన్॥

నీదాసులమగు మాచే వలయుపనులఁ జేయింపుము. మేమందఱము నీయాజ్ఞకు బద్ధులము. రాజునగు నీవుపోయిన మాకిక దిక్కెవరు? నిన్నుఁ బురస్కరించుకొనికదా మేమి తిపఁటుఁ బ్రయత్నించుచున్నాము.

అంగ—భల్లూకేశ్వరా! నేనైనఁ బోయివత్తుననుకొన్న నీవు నా ప్రయాణమున

కిట్టంతరాయమును గల్పించుచున్నాఁడవు. మనయం దిప్పుడు సముద్రమును దాఁటు యోధులెవ్వరును లేరైరి. మరి మన మీసమయమునఁ జేయవలసిన దేమి?

జాం॥—లేకేమి, ఉన్నాఁడు. శతయోజనవిస్తీర్ణంబును, నన్యదుర్నిరీక్ష్యంబును, నగాధంబును నగు పారావారము నవలీల లంఘించి సీతను జూచిరాఁగల మహాశూరాగ్రేసరుఁడు మనయందొక్కఁడుమాత్రమున్నాఁడు. ఆ యనంత తేజోనిధి నిప్పుడే మీకుఁ దెలిపెదనుండుఁడు. (ఆంజనేయునితో) నాయనా! వాయుపుత్రా! సకలకార్యదక్షుండవగు నీ విప్పట్టున నిశ్చేష్టితుఁడవు నెఱుఁగని వ్యర్థునివలె నూరకున్న రామకార్యమెట్లు నెఱవేఱవలయును? మాగతియేమి కావలయును? మేమింకఁ బ్రాయోపవేశముఁ జేయవలసినదే?

ఆంజ—(వాలముఁ బెంచి భుజములెగరవేయుచు) మీరు ప్రాయోపవేశము చేయవలసినపనిలేదు. శ్రీరామకటాక్షమునను మీయాశీర్వాదమాహాత్మ్యమునను నే నీకార్యముఁ సాధింపఁగలను ఇటు వినుఁడు.

మ॥ చలదుత్తుంగ తరంగఘట్టనక్రియా ♦ సభూతఘోరార్భటీ
కలితంబై, తిమికచ్ఛపప్రకరన ♦ క్రగ్రాహవారీన సం
కులమై, దుర్గమమై, గభీరమగు నీ ♦ ఘోరాబ్ధినొక్కుమ్మడిఁ
లలిలంఘింతు మదీయ భూరితర శౌ ♦ ర్యంబెల్ల దీపింపఁగన్॥
అటుపిమ్మట,

మ॥ ఘనబాహాబలదర్పమొప్పఁ దగ లం ♦ కంజొచ్చి శోధించి భూ
తనయంగాంచెద, దైత్యులడ్డపడ ను ♦ ద్యన్మత్పటుక్రోధ సం
జనితాత్యంతమహాప్రచండహుతభు ♦ గ్జ్వాలచ్ఛటా దీప్తి నిం
ధనజాలంబుగఁ గాల్చిభీకరగతిన్ ♦ భస్మంబుగావించెదన్॥
మఱియు సీతాసతి కానరాకున్నచో,

తే॥ గీ॥ లంకఁబెకలించి నిశ్శంకఁ ♦ బొంకమడఁతు
లీలఁ గులశైలజాలము ♦ గూలఁద్రోతు
నింపుగ నహాంపతిని బెను ♦ రొంపిఁజేతుఁ
బుడమి గడగడవడఁకింతు ♦ భుజబలమున॥

జాంబ—సెబాస్! మారుతీ! నీయసమాన పరాక్రమసాహసాదు లెంతకైనఁజాలును.

ఆంజ—తాతా! భల్లూకేశ్వరా! ఇంక తడవేల? నన్ను దీవించి పంపుఁడు. పయనమయ్యెదను.

జాంబ—నాయనా! శ్రీరామకటాక్షమున నీవనపాయముగ జలనిధిదాఁటి సీతామహాదేవినిగాంచి విజయోపేతుఁడవై శీఘ్రకాలమున మమ్ముఁ గలిసికొనఁగలవు. నీకు శుభమగుఁగాక. పోయిరమ్ము. వానరశ్రేష్ఠులారా! రామకార్యధురంధరుండగు నీ వాయుకుమారుని కుసుమమాలికాదులచే నలంకృతుం జేయుఁడు.

(అప్పుడు వానరులందరు నాంజనేయుని పుష్పహారములతో నలంకరించుచున్నారు.)

ఆంజ—ప్లవంగపుంగవులారా! సముద్రలంఘనోత్సాహసంరంభసమన్వితుండనై నేను నభోవీధి కెగయ మదీయపటుతరపదఘట్టనంబున భూమి కృంగుఁ గావున నిమ్మహేంద్రనగంబుపై నెక్కి జలరాశి దాఁటెదను.

జాంబ—అట్లేచేయుము. మేమును నీతోఁ బర్వతారోహణముఁ జేసి నీసముద్రలంఘన విచిత్రమును జూచుచుండెదము. (అప్పుడందఱు మహేంద్రాచలముపై నెక్కుచున్నారు.)

ఆంజ—నేనింకఁ బ్రయాణోన్ముఖుండనయ్యెదను. (అని చేతులెత్తి ఓయష్టదిక్పతులారా! సూర్యాచంద్రమసులారా! సప్తసముద్రములారా! కులాచలములారా! పంచభూతములారా! శ్రీరామకార్యధురంధరుఁడనగు నాకు మీరందఱు సహాయభూతులై యుండుఁడు. ఓరామా! మహాబలోద్దామా! వందితసురస్తోమా!

సీ॥ ఘోరసంసార పా ♦ థోరాసి కెవ్వాని
శ్రీకరాంఘ్రిసరోజ ♦ సేవ, నావ,
కైవల్య సౌఖ్యసం ♦ ఘటనకు నెవ్వాని
పదపద్మ నిశ్చల ♦ భక్తి, యుక్తి,
కలుషదావానలో ♦ గ్రజ్వాల కెవ్వాని
పూజావిధానంబు ♦ భూరివారి,
అజ్ఞాన భీకరో ♦ ద్యద్ధ్వాన్త కెవ్వాని
సారకీర్తనము కు ♦ ఠారధార,
తే॥ గీ॥ కమలభవదత్త వరబల ♦ గర్వితోగ్ర
దనుజ కులమున కెవనిద ♦ ర్శనము ఘనము
అట్టి నీకృపగల్గ నీ ♦ యబ్ధియెంత
భక్తరక్షణశీల! కృ ♦ పాలవాల!

ఇదే నీపై భారమువేసి సాహసించుచున్నాఁడ. (అని రామస్మరణఁ జేయుచు సముద్రమును దాఁటుచున్నాఁడు.) (అందఱు నిష్క్రమింతురు.)

(4 రంగము - లంకాపట్టణము.)

ఆంజ—(చింతతోఁ బ్రవేశించి) అక్కటా! నాకష్టమంతయు వ్యర్థమయ్యెనుగదా నేను సూక్ష్మరూపుండనై రాత్రి లంకానగరమంతయు శోధించి నిష్ఫలమనో రథుండనైతిని.

ఉ॥ లాలిత ధర్మ్యహర్మ్యములఁ, ♦ రచ్చల, నాపణవీథులన్, జతు
శ్శాలల, నంగణంబుల, ని ♦ శాంతములన్, వరశాలి, నోలిదే
వాలయ పంక్తులన్, దురగ ♦ వారణధామములన్ మణిస్ఫుర
త్కేళిగృహంబులందుఁ బరి ♦ కించితి భూసుతఁగాన నెచ్చటన్.

తే॥ గీ॥ పుడమిలోన గృతఘ్నుని ♦ యెడలఁజేసి
నట్టి యుపకృతివలె, బూది ♦ యందుఁబోయు
మంచిపన్నీరుగతి నా శ్ర ♦ మంబుసర్వ
మకట! వృథయయ్యె వ్యర్థుఁడ ♦ నైతిఁ దుదకు॥

(సీతనుద్దేశించి) హా! సాధ్వీమతల్లీ! జానకీ! నిన్నింక నేనెందు పొడగందును? భయంకరమగు పారావారమునుజూచి భయాక్రాంతవై సమసితివో! కాకని జాభిమతంబు నెఱవేర్పక మార్మసలుటంజేసి క్రూరుఁడగు రావణుఁడు నిను మ్రింగెనో. ఏవెట్టి దుర్దశకుఁ బాలైతివో తెలియదయ్యెనుగదా! యిప్పు డేమిచేయుదును? త్రిలోకపూజ్యుఁడగు రాముఁడు "మారుతీ! సీతనుజూడ నీవె సమర్థుండ"వని నన్నెంతయు నగ్గించి ముద్రికనొసఁగియుండ నిన్నుఁగానక మరిడి యమ్మహాత్ముని చెంతకుఁబోయి కర్ణకఠోరమగు నీవార్త నాపై గంపెడాసఁబెట్టుకొని నారాకకెదురెదురు చూచుచున్న యామానతో నెట్లు వాక్రువ్వగలను? ఇది విన్నంతనె యానరపాలుఁడు జీవములు విడువఁగలఁడు. తోడనె లక్ష్మణుండును మృతుండగును. అంత సుగ్రీవుండును గపిసేనలును నాశముకాఁగలవు. ఇందరి హత్యకును నేను మూలమగుదునుగదా! ఇంతయేల, నేనేయిప్పుడు ప్రాణత్యాగమొనరించిన నేచిక్కును గలుగదుకదా! (యోచించి) కాదుకాదు. ఇది యెందైన శూరధర్మమా! నాయొడలియందు స్వచ్ఛమగు వీరరక్తమె ప్రవహించుచున్న నాకీకార్యమెట్లు సాధ్యముకాదో చూచెదఁగాక! సీతయే కానరాకున్నచో ప్రచండమదోద్దండశుండాలతుండ సదృశంబులగు మద్భుజాదండంబుల వివిధమణిమయహర్మ్యప్రాసాదగోపుర దుర్గమండలమండితంబగు లంకాద్వీపంబును కూకటివ్రేళ్ళతోఁ బెల్లగించి వైచి త్రికూటమలయ గంధమాదన నిషధ వింధ్య హిమాలయ మేరు ప్రముఖమహాపర్వతసహితముగ భూమండలమంతయు ధూళిపటల మొన

రించి సముద్రోదకంబున గాలించెదను. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరమూర్తిత్రయయుతముగ జతుర్దశభువనములశాసించెదను. సూర్యచంద్రాది సమస్తగ్రహసహితముగ నాకాశమును గూలదన్నెదను. లవణేక్షుసురాదిసప్తార్ణవముల నేక మొనరించెదను. ఇంతచేసియు సీతను గానకున్న నప్పటి కుచితరీతి నవలంబించెదఁగాక!

ఓహో! ఏమిది! నే నూరక త్వరపడుచున్నాఁడ. ఇంకను జూడవలసిన ప్రదేశములు కొన్నికలవు. (దృష్టిసారించి) ముందర నొకసుందరారామము నయనపర్వముసేయుచున్నది. అందు సీతాసతీమతల్లిని వెదకెదను. (అని నడచి వనమునఁ బ్రవేశించి) ఆహా! ఏమి యీవనసౌందర్యము!

సీ॥ నిజకుసుమాళి న ♦ స్నిభ్రాంతి నొదవించి
తనరు పలాశపా ♦ దపచయంబు
సరవి దీర్ఘములైన ♦ శాఖోపశాఖల
రహిమించు వటమహీ ♦ రుహగణంబు
ఫలభారమునఁ గొమ్మ ♦ లిలకు నల్లనవంగఁ
గొమరారు సహకార ♦ సముదయంబు
గాలినల్లాడుచుఁ ♦ గనుపండువొనరించు
సఫలసత్కదళికా ♦ సంచయంబు
తే॥ గీ॥ ఒకటొకటి సాంద్రతఁబెనంగి ♦ యొప్పుచున్న
లలిత వికసిత పుష్పితై ♦ లాలవంగ
మాధవీమాలతీనవ ♦ మల్లికలును
గలిగి తనరెడి నహహాయీ ♦ లలితవనము॥

అదిగో! భానుం డుదయశిఖరిశిఖరవిటంకభాగంబు నలంకరింపఁ బోవుచున్నాఁడు.

ఉ॥ వేగఁగులాయధామములు ♦ వెల్వడి పక్షికులంబు మేతకై
యేగఁదొడంగెఁ, జక్రము ల ♦ హీనముదంబునఁబొంగె, పద్మముల్
రాగముతోఁజెలంగె, శశి ♦ రాంశుఁడు కాంతిదొఱంగె, నయ్యదే
ప్రాగచలాగ్ర భాగమున ♦ భానుఁడుతోఁచి వెలింగెనల్లనన్॥

ఇక యీవనమునందు సాధ్వీరత్నమగు సీత నన్వేషించెదను.

(వెదకుచు నిష్క్రమించును.)

(౫ రంగము: అశోకవనము)

(దైత్యాంగనల నడుమ సీత దుఃఖితయై యుండును.)

సీత—(స్వ) అక్కటా! నే నీదురవస్థఁ బాయు టెన్నఁటికి? నానాధుని వదనేందుబింబమును జూచు టెన్నఁటికి? అయ్యో! ఈ దౌర్భాగ్యురాలి కంతటిభాగ్యము కూడనా? ఏనాఁడు బుద్ధిమంతుఁడగు సౌమిత్రినిఁ బరుషవాక్యములఁ దూలనాడితినో యా నాఁటితోడనె నాకును నాధునకును ఋణముతీఱినది. ఇంకేటి దురాశ!

రాక్షసి—ఓ సీతా! నీ వెంత నిర్భాగ్యురాలవే! ఎంత తెలివిమాలినదానవే! చతుర్దశలోకశాసనుఁడగు రావణుఁడు తనంతఁ దా వలచి వేడుచుండఁగా నెక్కడనో రాముఁడు రాముఁడని కలువరించెదవు.

సీత—హా! దైవమా! నే నీదైత్యాంగనలమాటలు వినఁజాలకున్నదానను గదా! అయ్యయో! నాధా! నీ ప్రియపత్ని యెట్టి నీచదశంజిక్కి పలవించుచున్నదో వీక్షింపుము. ఇంకనైనఁ గనికరమువహించి నన్ను రక్షింపుము. అక్కటా! హృదయేశ్వరా! ఇంతకఠినము నీకఁ దగునా? ఓ భ్రాతృవత్సలా! సౌమిత్రీ! నీకైన నీదీనురాలిపైఁ గరుణకలుగదా?

శా॥ అన్నాలక్ష్మణ! దైత్యమాయయని నీ ♦ వానాఁడు వాకృవ్వ ని
న్నెన్నో భంగులదూరి సద్గుణుని ని ♦ న్నెంతేని నొప్పించి యి
ట్లిన్నీచాత్మునిచేతఁజిక్కితిని నే ♦ నెన్నన్ మహాపాపినై
న, న్నీ వార్తజనావనుండవు ననున్ ♦ గావం దలంపూనుమా॥

అయ్యయో! శరణాగతరక్షణబిరుదాంకితులును దయాంతరంగులును నగు నన్నదమ్ములిరువురు నిట్లుపేక్షించిన నింక నా చెఱ బాపువారెవరు? హా! రామ సౌమిత్రులారా! సర్వలోకవంద్యంబైన మీ భాస్కరవంశంబున నార్తులయెడ నిట్లు కఠినభావమూనిన వారొక్కరైనఁగలరా?

ఉ॥ ఆపగిదిక్ జగద్విదిత ♦ మైతగు సూర్య కులంబునందు సం
దీపితులై జనించి యవి ♦ నిందితకీర్తినిగన్న మీర లి
ట్లాపదఁబొంది దీనయగు ♦ నంగననొక్కతెఁ బ్రోవలేరె? హా!
పాపమె యార్తరక్షణము? ♦ భావ్యమె మీకిటు లూరకుండుటల్?

ఓసురలారా! ఓయక్షులారా! ఓకిన్నరులారా! ఓమానులారా! మహావిపత్సాగరనిమగ్ననగునన్ను మీరైన నుద్ధరింపుఁడు.

ఉ॥ దిక్కఁదొలంగి బెబ్బులికి ♦ దీనతఁజిక్కిన లేఁడిపిల్లనాఁ
జిక్కితి నీనిశాచరుని ♦ చేత, దయామయులార! మీరలీ
రక్కసుఁ ద్రుంపరయ్య నను ♦ రాముని చెంగట డింపరయ్య నా
మ్రొక్కుల నందరయ్య కడుఁ ♦ బుణ్యమువచ్చుఁగదయ్య మీకిలన్॥

హా! మీకును మనసుకరుగకున్నదా? దైవమా! నాకింక నేది తెరవు? (దుఃఖించుచుండును.)

ఆంజ—(ప్రవేశించి సీతనుజూచి సంతోషముతో)

తే॥ గీ॥ భళిభళీ! కంటిఁగంటి ను ♦ జ్జ్వలదినేశ
చండమండలసదృశశ ♦ శ్వత్ప్రతాప
భాసితుండైన రాముని ♦ పడఁతి ననఘఁ
బూతచారిత్రఁ ద్రిభువన ♦ మాత సీత॥

ఆనందమయ్యె. రాముఁడు వచించిన లక్షణములన్నియు నీమెయందుఁ జూపట్టుచున్నవి. అదియుంగాక రావణాపహృతయైపోవుచు నాఁడు, పర్వత శృంగంబున నీమె చించివైచిన వస్త్రమును నిప్పుడీమహాసాధ్వి ధరించియున్న వస్త్రమును నొక్క తీరుగనున్నవి. నిస్సందేహముగ నీమెయే సీత. నేఁటికి నాకష్టములన్నియుఁ దీఱినవి. కాని దుస్తరపతివియోగానలసంతప్తహృదయయై నిరంతరానర్గళబాష్పధారాసిక్తముఖాబ్జయై బడగీవృత్తసమావృతమగు జల్లెడుకరణి భయంకరాకారక్రూరదైత్యాంగనాసమూహపరివేష్టితయై జంటబాసిన చక్రవాకివలెఁ బలవించుచు దుస్సహశోకభాజనంబైన యీపతివ్రతామతల్లి నీలోకజనని నీయసూర్యంపశ్య నీకాంతాతిలకముం జూచిన నాహృదయపుటము దుర్భరదురంత దుఃఖరసపూరితమై వెల్లి విరియుచున్నది గదా!

చ॥ ఉరుసతతోపవాసశ్రమ ♦ మొంది కృశించిన మేనితోడ, సం
స్కరణ విహీనమౌట జడ ♦ గట్టిన కేశభరంబుతోడ, సుం
దరకరకీలితంబయి త ♦ నర్చు కపోలతటంబుతోడ నీ
పరమపవిత్రసాధ్వి కను ♦ పట్టు ఘనావృతచంద్రరేఖనాన్॥

అంతటివాని కిల్లాలగు నీమె యొక కటికురక్కసుని చెఱకుం జిక్కవలసి వచ్చెనుగదా! ఆహా! దైవవిధి యలంఘ్యము. (దృష్టిసారించి) ఓహో! ఆ వచ్చుచున్నది రావణాసురుండే కాఁబోలును. ఇప్పుడీమెతో సంభాషించుటకు సమయముకాదు. ఈతరుశాఖపై నెక్కి వీఁడు పోయినపిమ్మట నీజగన్మా

తతో మదీయ వృత్తాంతమంతయు విన్నవించెదఁగాక. (వృక్షముపై నెక్కుచున్నాఁడు)

(రావణుఁడు ప్రవేశించును)

రావ—ఏమిత్రిజటా! సీత యేమనుచున్నది?

త్రిజట—ప్రభూత్తమా! మాశక్తికొలఁదిఁ బ్రయత్నించుచున్నాము ఇంకను నీమె కాపిచ్చి వదలలేదు.

రావ—అట్లయిన నస్మదీయ శృంగారసంభాషణముల నీచిలుకలకొలికి సలరించెద నండుఁడు. (సీతతో) లతాంగీ! నన్నుఁజూచి యట్లేల లజ్జావనతవై పరాఙ్ముఖి వయ్యెదవు? నేఁ బెఱవాఁడఁగాను. నీపదసేవకుఁడను. మదనబాణానలదందహ్యమానమానసుండనగు నాపై నీ నిర్మలాలోకనశీతలహిమాంబువులు చిలుకుము. అట్లేల మోమువంచెదవు?

సీ॥ అలశరదభ్రజని బొ ♦ ల్పారు రాకాచంద్రు
మించు నీనగుమోముఁ ♦ గాంచనీవె
పసిఁడికన్నను గాంతి ♦ నెసఁగునీమైఁదీవ
నింపుమీఱఁగఁ గౌఁగి ♦ లింపనీవె
నిద్దంపుటద్దాల ♦ కుద్దియౌచెక్కిళ్ళ
వేడుకమీఱ చుం ♦ బింపనీవె
చిక్కనిసుధలొ ల్కు ♦ చిగురాకు కెమ్మోవి
గ్రక్కున మునిపంట ♦ నొక్కనీవె
తే॥ గీ॥ చెలియ! నాపయిఁ దుహినశీ ♦ తలములైన
నీకటాక్ష పరంపరల్ ♦ నిగుడనీవె
యసమబాణుని ములుకుల ♦ పసయడంగ
బాల! నినుఁగూడి మరుకేళిఁ ♦ దేలనీవె॥

అంజ—(పండ్లుగీటుచు, స్వ) ఔరా! యీదుష్టుని ప్రల్లదము లెట్లుసహింతును? (కోప మణఁచుకొని) ఇది సమయముకాదు.

రావ—చెలియా! సహజసుకుమారమగు నీశరీరము నిట్లుపవాసములచే నేలకృశింపఁజేసెదవు? సమస్తభువననాయకుఁడనగు నన్నుఁజేపట్టి సుఖింపుము. నామాట విందువేని నిన్ను లంకారాజ్యపట్టమహిషి నొనరించెదను. నాభార్యలఁదఱచే నీకు వలయుసేవలఁ జేయించెదను. ఇంక నీ వారామునిపైఁగల దుర్భ్రాంతి వదలి,

మ॥ నవరంగంబులఁ బద్మరాగమణి కాం ♦ తస్వర్ణకుడ్యాంక స
ద్భవనశ్రేణి, ననూనబంధురమహా ♦ ద్యానావళిన్, మల్లికా
లవలీకల్పితకుంజపుంజముల, సాం ♦ ద్రాకీర్ణద్రాక్షాలతా
నివహాప్రాంచితకాయమానములఁ ద ♦ న్వీ! సౌఖ్యముంబొందుమా॥

సీత—(స్వ) అక్కటా! యీదుర్మార్గుఁడు వచియించు కర్ణకఠోరవాక్యముల నెట్లు సైరింతును? (తృణముఁ జేతఁబట్టుకొని, ప్ర) ఓరీ! పాపాత్మా! అందనిమ్రాని పండ్లకు జ్ఞులుసాఁచినట్లు మోహాంధుండవై నన్నేల తూలనాడెదవు? పరనారీసంగమేచ్ఛ మహాపాపప్రదము.

రావ—ఇందువదనా! రాక్షసులమగు మాకుఁ బరధనపరనారీహరణములే కడు శ్రేయస్కరములు. మాకవియే కులధర్మములు. ఇంకఁ గాలయాపన మేల చేసెదవు? అయ్యంగజుండేయు కుసుమశరములకుఁ దాళఁజాలకున్నాఁడను కరుణింపుము.

సీత—దైత్యాధమా! ఇప్పు డీకుసుమశరాహతి కోర్వలేనివాఁడవు దుస్సహములగు నరకబాధ లెట్లనుభవింపఁగలవు? అచ్చట యమభటులు,

సీ॥ అఱకాళ్ళ నెత్తుకల్ ♦ దొంఱఁగ అంపములపై
నడిపింతు రపుడెట్లు ♦ నడువఁగలవు?
కీలాభయంకరా ♦ గ్ని స్తంభముల మోప్రిల
నిలుపుదు రపుడెట్లు ♦ నిలువఁగలవు?
ఉరుగదాహతుల భీ ♦ కరభఁగిఁ గ్రుద్ధులై
దండింతు రపుడెట్లు ♦ తాళఁగలవు?
లోహంబు లుడికించి ♦ దేహరంధ్రములఁ బో
యుదు రప్పుడేరీతి ♦ నోర్వఁగలవు?
తే॥ గీ॥ కాలకింకర హస్త సం ♦ కలితచండ
తతమహాగ్నిచ్ఛటా పరి ♦ తప్త నిశిత
దారుణానూన ఖడ్గకు ♦ త ప్రభూత
వేదనల నెట్లుసహియింతు ♦ వో దురాత్మ?

అంగ—(స్వ) ఆహా! యీసాధ్వీమతల్లిపాతివ్రత్య మతిప్రశంసనీయము!

రావ—చెలీ! నీవెన్ని చెప్పినను నీపైఁగల పరాళిని విడువఁజాలకున్నవాఁడను. నా మాటలఁ బెడచెవింబెట్టకుము. ఎలప్రాయమువనున్న నీ వి ట్లువవాసాది మహాకష్టములపాలై కృశింపఁదగునా? రుచ్యములగు పదార్థములును, చక్కని

పూలపాన్పులును, మృదులాంబరములును, వివిధమణిమయభూషణంబులును, జందనాగురుకస్తూరికాది పరిమళ ద్రవ్యములును, వర్జించి సర్వసౌఖ్యములకు దూరమై పాదుపాతివ్రత్యమునకేల యాసఁజెందెదవు' అహల్యా తారలకన్న నీవధికురాలవా? ఎక్కడనో యాకలములఁదిని పొట్టఁబోసికొనుచున్న హీనమానవునికై యిట్లు పరితపించెద వేమి? ఆపేదనరుఁడు నన్నేమిటఁబోలును?

సీ॥ బలము లేమిని భయం ♦ పడి సర్వరాజ్యమ్ము
నేలమీఁదమ్మని కప్ప ♦ గించినాఁడు
పాపభీతిఁ ద్యజించి ♦ పడఁతిఁ దాటకఁబట్టి
కడతేర్చి యపకీర్తి ♦ గాంచినాఁడు
ధర్మహర్మ్యములందు ♦ వసియింపఁదగు నిన్ను
తెలవ కానలకీడ్చి ♦ తెచ్చినాఁడు
ఎల్లసౌఖ్యంబుల ♦ కెడఁబాయఁజేసి నీ
కులలేని కడగండ్లఁ ♦ ద్రోసినాఁడు
తే॥ గీ॥ వాని కీరీతిఁ గన్నులు ♦ వాయునట్టు
లేల యేడ్చెదు రేబవ ♦ ళ్ళేకరీతి
నిద్దురయు నన్నమునుమాని ♦ నిరత మకట
దీన సుంతైన ఫలమున్న ♦ దే పడఁతి॥

సీత—ఓరీ! నీచుఁడా! చతుర్దశభువనజేగీయమానమహాపరాక్రమాభిరాముండగు నానాధునిఁ దూలనాడుచున్నాఁడవా? ఆతునఘుని ప్రతాపాగ్నిజ్వాలల వేఁడిమికి నీబోఁటి వేయిమంది రావణులైనను భస్మీభూతులై పోఁగలరు.

రావ—(నవ్వుచు) ఏమి? నీనాధుఁ డంత శూరుఁడుగా? కావుననే భార్యను గోలుపోయెఁగాఁబోలును.

సీత—ఓరీ తుచ్ఛుఁడా!

చ॥ ఎవరునులేనివేళఁగని ♦ యింట జొరంబడు దొంగరీతి నా
ధవుఁడు మఱందిలేనియెడ ♦ దంభమునన్ మునివేషమూని నన్
జవమునఁ దస్కరించుటిది ♦ శౌర్యమె? నాధుఁడు చూచెనేని నిన్
దవిలి వధింపఁడే సమర ♦ ధాత్రిని బ్రాణమునిల్వనిచ్చునే॥

రావ—ఓహో! నీవు నాప్రతాపమెఱుఁగక మాటలాడుచున్నావు సుమీ! ఇటు వినుము.

సీ॥ ప్రళయరుద్రునినేత్ర ♦ పావకోగ్రజ్వాల
నార్పనైన సమర్థుఁ ♦ డైనవాఁడు

చండభానుసహస్ర ♦ మండలంబులనైన
లీలమైఁ గబళింపఁ ♦ జాలువాఁడు
అల మేరువైనను ♦ జ్వలనఖాంచలశక్తి
నుద్ధతినెగమీట ♦ నోపువాఁడు
పటుభుజాశక్తిను ♦ త్కటమైన రజతాద్రి
నవలీల నెత్తిన ♦ జవమువాఁడు

తే॥ గీ॥ ఘనదిగీశ్వర ఘోరసం ♦ గ్రామలబ్ధ
విజయగర్వితుఁ డీదైత్య ♦ వీరుఁడేఁడ?
ఒకనరాధముఁడేఁడ? వా ♦ నికిని నాకు
రమణిరో! హస్తిమశకాంత ♦ రంబు కలదు॥

కావున రామునిపై నాసవీడి నన్నుఁగూడి సుఖము లనుభవింపుము.

సీత—ఓరీ! పాపాత్మా! తొల్లి పరాంగనాసంగమంబున భంగపడిన దేవేంద్రాదుల పాటుదలఁచి నీచిత్తమును మరలించుకొనుము. కాకున్న నీవు మృత్యువు వాతం బడిపోదువు.

రావ—(స్వ) అబ్బబ్బా! నే నీవర కెందరెందఱినో కాంతల మదీయరూపశౌర్య విభవాదులచే వశ్యముగఁజేసికొంటినిగాని దీని హృదయమును కఱగింపఁ జాలకున్నాఁడను. ఈకలికి యావయవములన్నియుఁ గుసుమసదృశము లేకాని హృదయము మాత్రము దారువునకన్న పాషాణమునకన్న లోహమునకన్న వజ్రమునకన్నఁ గఠినమైయున్నది. ఇప్పుడిట్లు చెప్పిచూచెదను. (ప్ర) ఓపడఁతీ! సామమునఁ గార్యము సాధింపఁ దలఁచి నేనింతగ బ్రతిమాలు చున్నవాఁడను గాని నిన్నిప్పుడు బలిమిమైఁబట్టిన నీ మగఁడెవ్వఁ డడ్డమువచ్చును?

సీత—ఓరీ! దుర్మార్గుఁడా!

క॥ తనధవునియాజ్ఞలేక మె
కినుకఁ శపియింప సాధ్వి ♦ కిం దగదటుగా
వున నూరకుంటిఁ గాకుం
డిన నింతకుమున్నె తుత్రింప ♦ నే నిను జడుఁడా!॥

ని న్నారామచంద్రుఁడే సపుత్త్రమిత్త్రబాంధవంబుగ యమలోకగతునిం జేయుఁగాక! నీలంక కొలఁదికాలములో శ్మశానసదృశమై పోవుఁగాక!

రావ—ఛీ! దురాత్మురాలా! కడ తేరితివి. (నఱకఁబోవును)

త్రిజట—(అడ్డముఁవచ్చి) దైత్యేశ్వరా! మీవంటిశూరు లాఁడుదానిని జంపరాదు.

యీసీత మిమ్ముఁగాదని మెచ్చుటకెట్లు బోఁగలదు? ఎప్పటికైన నిది మీసొమ్మే యింకను గొంతవఱకు సామమున బోధించి చూచెదము.

రావ—అట్లైన మీకు రెండు మాసములుగడువిచ్చుచున్నాఁడ. ఈలోపల నిది నన్నొల్లకున్న నప్పు డీపాపురాలిని ఖండించి దీని మాంసమును భక్షింపుఁడు. (నిష్క్రమించును.)

రాక్షు—సీతా! సిరిరాఁగుక్క నుసికొల్పినట్లు చేయుచున్నావుకదా? నీ కామహారాజుతో సుఖించు భాగ్యములేదు కాఁబోలును. నీకర్మమునకు నేనేమిచేయుదును? నాకు నిద్దురవచ్చుచున్నది. పండుకొనియెదను. (దైత్యాంగనలు నిద్రింతురు.)

సీత—(స్వ) అక్కటా! నా కీచెఱకన్నఁ బ్రాణత్యాగము మేలని తోఁచుచున్నది.

ఆంజ—(స్వ) ఇప్పు డీదైత్యాంగనలందఱును నిద్రాపరవశలైరి. నేనింక వృక్షావతరణముచేసి యీమెతో సంభాషింపవచ్చును. అదిగో! నాముందు మఱలలేచుచున్నట్లున్నదే.

త్రిజ—(తుల్లిపడిలేచి) ఓసీతా! ఓతల్లీ! నన్నుమాత్రము రక్షింపుము. నీకాళ్ళకు మ్రొక్కెదను.

సీత—ఇదేమి యాగడము!

త్రిజ—అమ్మా! ఏమిచెప్పుదును. నేనిప్పు డొకకలఁగంటిని. అందు రావణకుంభకర్ణులు సబాంధవసపరివారముగ నీమగనిచేఁ జచ్చినట్లును నీవు నీనాథునితోఁగూడి విమానారూఢవై యాకాశగమనమునఁ బోవుచున్నట్లును లంక యంతయుఁ బీనుఁగుపెంటయైయున్నట్లును జూచితిని. ఇదియంతయు సత్యము కాఁగలదు. నేనొనర్చిన యపరాధములు మన్నించి నన్నుమాత్రమప్పుడు రక్షింపుము.

సీత—నాకట్టిదశ స్వప్నమందైనఁ గలుగునా?

త్రిజ—అమ్మా! నాకల తప్పునదికాదు. ఇందు సంశయములేదు. నమ్ముము.

సీత—అట్లైన నీమేలు మఱువను.

త్రిజ—నేను గునికెదను. నీవును కొంచెము శయనింపుము. (నిద్రించును)

సీత—(స్వ) అయ్యో! నాకు నిద్దురయెక్కడిది? ఈ దైత్యాంగన నన్నూఱడించుటకిట్లు మాయమాటలు పలికియున్నది కాని మఱియొకటికాదు. ఎందైనఁగల యథార్థమగునా? అందు దైత్యులను నమ్మరాదు. దైవమా! యీచెఱ

యెన్నాళ్ళనుభవింతును? నాకింక మరణమే తగినది. నాయీ కేశపాశమునం గంఠమున నురివోసికొనెదను.

ఆంజ—(చెట్టుపైనుండి)తల్లీ, వద్దు వద్దు! నీవీచెఱనుండి విముక్తురాలవై శీఘ్రకాలమున నీనాథుని చెంతకుం బోఁగలవు.

సీత—(తత్తఱపాటుతో) ఇది యెవరికంఠధ్వనియైయుండును? (తలయెత్తిచూచి) ఏమిది! నాకొక వానరము కనుపించుచున్నది. అక్కటా! స్వప్నమున, గోఁతిని చూడరాదందురుగదా! దైవమా! యీదుస్వప్నఫలము రామసౌమిత్రులకును నాకును జెందకుండఁ జేయుము.

ఆంజ—ఓజననీ! తత్తఱపాటుఁజెందకుము. ఇదిస్వప్నముకాదు. నీవు జాగ్రదవస్థయం దున్నదానవు. నేను నిజముగ వానరుఁడను. నీనాథుండగు రాముఁడు నిన్నుఁ గోల్పోయి యెందుఁ గుమ్మరుచు జటాయువువలన భవద్వృత్తాంతమెఱిఁగి సూర్యనందనుఁడగు సుగ్రీవునితోఁ జెలిమి సంపాదించి తదగ్రజుండగు వాలిని సంహరించి నిన్ను వెదుక సకలదిక్కులకు ననేక వానరవీరులనంప మత్పూర్వపుణ్యవశమున నేనిచ్చట నిన్ను దర్శింపఁగల్గితిని. (క్రిందికి దిగివచ్చి) తల్లీ! నమస్కరించుచున్నాఁడ. (నమస్కరించి యెదుట నిలుచును)

సీత—ఓరీ! నిశాచరాధమా! నాఁడు మాయాసన్యాసివై వచ్చి నన్ను మ్రుచ్చిలించితివి. ఇప్పుడు మరల నేమిమోసము చేయఁదలంచి యిట్లు వానరరూపుండవైతివి?

ఆంజ—అమ్మా! నేను దైత్యుఁడనుగాను. నీపాదములాన నిజముగ రామదూతను. వాయుపుత్త్రుండ, నాంజనేయుం డనువాఁడ.

సీత—(స్వ) ఈతఁడు సత్యముగ రామదూతయా! ఇంకను గొంతయడిగి చూచెదఁగాక (ప్ర) ఓ వానరోత్తమా! నీవు వచించినదంతయు నిజమేని రామసౌమిత్రుల రూపరేఖావిలాసాదు లెట్టివో వివరించి చెప్పుము.

ఆంజ—(స్వ) ఇప్పు డీమెకుఁ గొంత నమ్మ ము చిక్కినది. (ప్ర) జననీ! అవాఙ్మానసగోచరగుణగరిష్ఠుండగు నీవిభు నెవఁడు వర్ణింపఁగలఁడు! ఐనను నాయెఱింగినంత వట్టు విన్నవించెదను. సావధానవై యాలింపుము.

సీ॥ తమ్మిరేకులసోయ ♦ గమ్మును నిరసించి
　　　　వీనులముద్దాడు ♦ వెడఁదకనులు
ఇంద్రనీలవుమణు ♦ లేని సాటికిరాని
　　　　నీలవర్ణపుకాంతి ♦ గ్రాలుమేను

పున్నమరేయి నిం ♦ పొదవ మింట వెలుంగు
చంద్రునందము వీఱ ♦ జాలు మోము
లేఁగల్వతూండ్ల ని ♦ ర్జించి కోమలలీల
భాసిల్లు నాజాను ♦ బాహుయుగము
తే॥ గీ॥ సమర నెమ్మేనఁ దరువల్క ♦ లాంబరములు
సూరిమిధరించి తలజటా ♦ భారమూని
మౌనివోలె భవన్నాథుఁ ♦ డైన దామ
భద్రుఁడొప్పుఁ దిరస్కృత ♦ రుద్రుఁడగుచు॥

మఱియును,

సీ॥ కేలవాల్గోని లీల ♦ నాలమందున నిల్వఁ
బ్రళయకాలు నిమాడ్కి ♦ భయముఁ గొల్పు
శాంతాత్ముఁడై దయా ♦ సరణి నాశ్రితకోటిఁ
బ్రోచుచో నలవిష్ణుఁ ♦ బోలియుండు
పాలించితబుద్ధివై ♦ భవవిశేషమ్మున
నెలమిమై గీష్పతి ♦ కీడువచ్చు
అతులిత సౌందర్య ♦ మందుఁ జైత్రజయంత
కందర్పులకు సిగ్గు ♦ గలుగఁజేయు
తే॥ గీ॥ వినయ సౌజన్యకరుణా వి ♦ వేక శౌర్య
సాహస పరాక్రమోదార ♦ సరసతాది
ప్రకట సకలసులక్షణ ♦ భాసితుండు
నీ విభుం డల రఘుకుల ♦ స్వామి విభుండు॥

నీ మఱఁదియగు లక్ష్మణుఁడు సువర్ణకాయుండుగాని యన్నిట నన్నను బోలియుండును. అమ్మా! నీ హృదయేశుఁ డానవాలుగ నీ కంపిన యీ భద్రముద్రికం గొమ్ము. దీనఁ బూర్ణముగ నీ సంశయము వాయఁగలదు. (ముద్రిక నిచ్చును)

సీత—(సంతోషముతో) ఏదీ! (అని పుచ్చుకొని కన్నులనద్దుకొని) హా! మత్ప్రియకరశాఖాలంకార దివ్యాంగుళీయకమా! నిన్నింతకాలమునకుఁ జూడఁగలిగితిని!

తే॥ గీ॥ విభుఁడు పత్నీవియోగ శో ♦ కభరమంద
ననయముఁ దదీయకరశాఖ ♦ నాశ్రయించి
యున్న దానవగుటఁ జేసి ♦ యువిదఁగూర్చ
నరుగుదెంచితె కడుదూర ♦ మబ్ధిదాటి॥

(ఉంగరము ముద్దిడి యెదనొత్తుకొని ఆంజనేయునితో)
పావనీ!

తే॥ గీ॥ అనఘ! నీ శౌర్యబలము ల ♦ త్యద్భుతంబు
లమరులకునైన దుర్గమ ♦ మైనజలధి
దాఁటి తవలీల నా పాలి ♦ దైవమీవ
ప్లవగకులవర్య! నీరాకఁ ♦ బ్రీమదమాయె॥

అయ్యా! నా మనోవిభుఁ డెన్నఁడిటకరుదెంచును? నే నీచెఱనుండి యెప్పుడు విముక్తురాలనగుదును? దయయుంచి తద్వృత్తాంతమంతయు మఱల నొకసారి కర్ణానందముగ వినిపింపుము.

ఆంజ—జననీ! నేనిప్పుడు పోయి నీజాడ నెఱిఁగించినవెంటనే రామలక్ష్మణులు సుగ్రీవాది వానరచమూసమేతులైవచ్చి దుష్టుఁడగు రావణాసురుని సబాంధవముగ యమనిలయంబునకంపి నిన్నుం గొనిఁపోగలరు. నీవంతవఱకుఁ దాళఁజాలనందువేని నా వీపునఁగూర్చుండుము. నిన్నొక క్షణమాత్రమున రామపాదారవిందసన్నిధియందు డించెదను.

సీత—వానరోత్తమా! నీమాట లతిచిత్రముగనున్నవి. అల్పగాత్రుండవగు నీవు దైత్యులవాతంబడకుండ నన్నెట్లు జలధిదాఁటింపఁగలవు రాఘవుల చెంతకెట్లు కొనిపోఁగలవు?

ఆంజ—అమ్మా! లంకయందు నిన్నన్వేషింప నిట్లల్పగాత్రుండను కావలసివచ్చినది. నా నిజరూప మిదిగోఁజూడుము.

(నిజస్వరూపముఁ జూపుచున్నాఁడు)

సీత—(చూచి కన్నులుమూసికొని) ఓ మహాత్మా! నీ యద్భుతాకారమింకఁ జాలింపుము. నేను వీక్షింపనోపను.

ఆంజ—(మఱలఁ బూర్వరూపము ధరించును)

సీత—ప్లవంగపుంగవా! నీవెంతకైన సమర్థుండవుకాని నన్నుఁగొనియేఁగుతఱి నెవ్వరేని దైత్యులు నీకడ్డమైన వారితోనీవు భయంకరముగ సమరముచేయుచుండ నేను జూడఁజాలను. అదియునుంగాక యింకొక పరమార్థముకలదు. పతివ్రతలకుఁ బరపురుషగాత్రస్పర్శ తగదు. కావున నిప్పుడు నీతోరాఁజాలను. నీవన్యథా తలంపకుము.

ఆంజ—తల్లీ! నీసౌశీల్య మతిశ్లాఘాపాత్రము. నేనిచ్చట దడవుమసలరాదు. కాన

నిన్నుఁజూచిన శ్లోదేనియీయానవాలు రామునకిమ్ము. నేనీక్షణము పయోనిధి దాఁటి నీవిభునకు నీజాడఁదెలిపెదను. అంత నమ్మహాత్ముఁడు సకలవానర సేనాసమేతుఁడై వచ్చి మహాయుద్ధ నిజచండకాండంబుల రావణుని దుండగమడంచి నిన్నుఁ గొనిపోఁగలఁడు.

సీత—పావనీ! మున్ను మేము చిత్రకూటంబునవసియించుతఱి నొక్క కాకము మత్కుచాంతరంబున నఖాగ్రమున విదారింప నాథుండలిగి దానిపై నిషీక మొకటి మంత్రించివైచెను. అదియు బ్రహ్మాస్త్రమై వెంటఁదవిలిన నక్కాకము తుదకు జీవితేశుని శరణుజొచ్చి బ్రతికిపోయెను. ఈరహస్యవృత్తాంతమును రాఘవులకుం జెప్పుము. తరువాత,

తే॥ గీ॥ రమణుఁడు మదీయగండ స్థ ♦ లమునఁ దాను
వ్రాసినట్టి మనశ్శిలా ♦ పత్త్రరేఖఁ
దెలిపి యీపయి నీశిరో ♦ దివ్యరత్న
మానవాలిమ్ము రామభూ ♦ జాని కనఘ॥

(శిరోరత్నమిచ్చును.)

ఆంజ—(పుచ్చుకొని) జననీ! నాకింక ననుజ్ఞయిమ్ము.

సీత—మారుతీ! నీరాకకు సంతసించితిఁగాని నీవు పోవుటదలంప నాకు దుఃఖమొదవెడిని.

ఆంజ—తల్లీ! నీవు చింతదక్కియుండుము. నేను పోకున్నఁ గార్యమెట్లు నెఱవేఱును?

సీత—ఆంజనేయా! నీవరిగి నాథునకు నానమస్కారములని వచించి నావాక్యములుగ నిట్లనుము:

తే॥ గీ॥ ఇంతదాఁకను నినుఁజూతు ♦ నేమొయనుచుఁ
బ్రాణముల నెట్టులో చిక్కఁ ♦ బట్టియుంటి
నింక నొకనెలలోన నీ ♦ విటకురాక
తడసితివయేని మరణంబు ♦ తప్పదెట్లు॥

మఱియును దశప్రియాంగన నొక్కదనుజుఁడు చెఱఁగొనిపోవ నూరకుండుటక్షాత్రముకాదనియు నపకీర్తికారణమనియు వచింపుము. తరువాత నా మఱందితోఁ గుశలమడిగితినని వెండియు నావాక్యములుగ నిట్లనుము:

ఉ॥ ఓనయశీల! నిన్ననుచి ♦ తోక్తుల దూరినదాననంచు నీ
మానసమందుఁ గ్రోధ మణు ♦ మాత్రము నాపయిఁ బూనకయ్య నీ

వే నిటఁదత్ఫలం బనుభ ♦ వించితినింకఁ జలంబుపేడి ర
మ్మా ననుఁగావుమా యలుక ♦ మానుమ నీమదిలోన లక్ష్మణా॥

అటుపిమ్మట సుగ్రీవాదుల సేమమడిగితిననుము.

ఆంజ—మాతా! నీవు చెప్పిన ట్లందఱితో విన్నవించెదను. నాకింక నానతిమ్ము.

సీత—పవనతనయా! రామకార్యధురంధరుండవగు నీకెల్లెడల జయంబు చేకూరుఁగాక! నీవు నిరపాయముగ జలధిదాఁటి రామసౌమిత్రులకు నాజాడ నెఱింగించెదవుగాక! పోయిరమ్ము.

ఆంజ—తల్లీ! పతివ్రతామతల్లివగు నీ యాశీర్వచనప్రభావమె తక్కైనఁ జాలును. నేనింకఁ బోయివచ్చెదను. (కొంచెము ముందునకునడిచి స్వ) శ్రీరామకటాక్షమునఁ నావచ్చినకార్యము సఫలమైనది కాని నేనిట్లరికిం దెలియకుండవచ్చి మగిడి దొంగవలె నూరకపోవుట శూరత్వముకాదు. కొంతపౌరుషంబుఁ జూపెదఁగాక! మత్ప్రతాప మీలంకానాధునకుం దెలియుటకు తొలుత నీయశోకవనంబునఁగల తాల హింతాల రసాలసాల తక్కోలతమాలాదిభూరుహంబులు పెల్లగించి కుసుమఫలకిసలయంబులు రాల్చి వనమంతయు భంగమొనరించెదను. (గంతులువేయుచు నిష్క్రమించును.)

(యవనిక జారును.)

---

## 6 రంగము.

(ఆంజనేయుఁడు రాక్షసులతో యుద్ధముఁ జేయుచుఁ బ్రవేశించును.)

ఆంజ—ఓరోరి నిశాచరాధములారా! సురాపాన మాంసభక్షణాదులఁ గాయములు పెంచుకొని మత్తెక్కి నాతోఁ గయ్యముసేయవచ్చితిరా? మిమ్మందఱ నిప్పుడే యమసదనగతులఁ జేసెద చూడుఁడు. (కొందఱిని గుద్దియు కొందఱిని గఱచియు గొందఱిని వాలమున నురిబోసియు రాక్షసులనందఱనుజంపుచున్నాఁడు.)

అక్షయుఁడు—(తెరలో)

చ॥ మనమున భీతిలేకిటుల ♦ మాపురిఁ జేరి మనోజ్ఞమైన యీ
వనమును బెల్లగించి వన ♦ పాలకులన్ వధియించినాఁడవో
వనచర! నిల్వు, మచ్చటులఁ ♦ బాణశిఖిన్ నినుఁగాల్చెఁగా నిదే
యనిమిషభీకరుండనగు ♦ నక్షకుమారుఁడ నేనువచ్చితిన్॥

ఆంజ—రమ్ము. రమ్ము. త్వరగారమ్ము. నీకుఁగూడఁ బ్రాణములపై నాసలేదు కాఁబోలును.

(అక్షయుఁడు రథారూఢుఁడై సేనాసహితముగఁ బ్రవేశించును)

అక్ష—(కోపముగ)

చ॥ మనమున భీతిలేక (అను పైపద్యము చదివి)

ఓరోరి ప్లవంగాధమా! చతుర్దశలోకభీకరుండగు నాతండ్రిపరాక్రమ మెఱుంగక యిట్టిదుండగములుచేసిన నిన్నిప్పుడే శిక్షించెదను చూడుము. (బాణములు ప్రయోగించును)

ఆంజ—నీకింక నాయువులేదు. (అప్పుడిరువురు గగనవీధికెగసి పోరుచుండ నక్షయుని రథము విఱిగికూలును.)

అక్ష—వానరాధమా! మదీయరథము భగ్నమయ్యెనని సంతసింపకుము. ఇదేఖడ్గ పాణినై నీమదమడంచెదను.

ఆంజ—ఓరీ! నిన్ను బాలుఁడని యుపేక్షింపరాదు. నీవు తాంత్రముబాము వంటివాఁడవు. శీఘ్రము యమాలయంబునకుఁ బొమ్ము. (సేనాసహితముగ నక్షయుని వధించుచున్నాఁడు.)

శ్రీరామకటాక్షమున వీనినిఁగూడ జయించితిని. ఈతోరణస్తంభము పై నెక్కి కూర్చుండెదను. (అట్లు చేయును)

(తెరలోఁ గలకలము)

(ఆలించి) ఓహో! మరలనెవ్వఁడో వచ్చుచున్నాఁడు. నాప్రయత్నమున నేనుండెదను. (వృక్షపాషాణాదులేరి తెచ్చికొనుచున్నాఁడు)

ఇంద్రజిత్తు—(సేనాసహితుఁడై ప్రవేశించి) రే! మర్కటాధమా! వనభంగము చేయుటయేగాక మదించి నాప్రియసోదరుని నీపొట్టను బెట్టుకొంటివా? చూడుము, నిన్నిప్పు డేమిచేసెదనో!

ఆంజ—ఓరీ! నీతమ్ముఁడు నిల్లే తొలుత బీరములుపల్కి గతాసుండయ్యెను. నీవును నీయనుజునిఁ జూడఁగోరితివేని యుద్ధసన్నద్ధుండవుకమ్ము.

ఇంద్ర—ఛీ! తులువా! నోరుమూసికొనుము. జగదేకవీరుండగు నీమేఘనాదుని చెంత నింకనీయాటలు సాఁగవు.

ఉ॥ బాలకునక్షయుర్గ దునిమి ♦ బాహుబలాఢ్యుఁడనంచు నిక్కఁగా
నేల గణావనిన్ నిలువు ♦ మిప్పుడ మద్విలయోగ్రదారుణ
వ్యాళకరాళతీక్ష్ణకర ♦ వాలభయంకరధార సోలి నిన్
గాలుని చెంతకంపెద న ♦ ఖండ భుజాపటిమంబు పెంపునన్॥

ఇదిగోఁ జూడుము. పిడుగులవలె బెడిదములగు నా బాణములు నీయు రంబును వ్రక్కలింపఁగలవు. (బాణములు విడుచును.)

ఆంజ—(తప్పించుకొని) ఓరీ! మదాంధా! నా యీ వృక్షపాషాణములఁ దప్పించు కొనుము. నీవరాక్రమముఁ జూచెదను. (ఇంద్రజిత్తుపైఁ దరులు శిలలు ఱువ్వును.)

ఇంద్ర—(స్వ) అన్నా! వీఁడు సామాన్యమర్కటుఁడు కాఁడు. ఈఁతఁ డతిచమత్కా రముగ నాచేఁ బ్రయోగింపఁబడు బాణములన్నియుఁ దప్పించుకొనుచున్నాఁడు. వీని నెట్లయిన వధియింపవలయును గాని విడువరాదు. (ప్ర) ఓరీ! ప్లవంగా ధమా! చతుర్దశభువనభీషణంబై దుర్నిరోధమగు బ్రహ్మాస్త్రమును సమంత్ర కంబుగా విడుచుచున్నాఁడ. దీన సహాగ రడంగఁగలదు. (బ్రహ్మాస్త్రము ప్ర యోగించును.)

ఆంజ—(స్వ) ఈదైత్యుఁడిప్పుడు బ్రహ్మాస్త్రప్రయోగముఁ జేసియున్నాఁడు. కమలా సనవరంబున నాకు దీననపాయము లేదు గాని కొంతతడవు బద్ధుఁడనై యుండెదను.

(అంత బ్రహ్మాస్త్రము తాఁకి అంజనేయుఁడు పడిపోవును.)

ఇంద్ర—దానవులారా! యీమర్కటుని బంధించి తండ్రిగారిచెంతకుఁ గొనిరండు.

(రాక్షసు లాంజనేయుని బంధించి తీసికొని పోవుచున్నారు.)

(అందఱు నిష్క్రమింతురు.)

(యవనిక జారును)

---

(7 రంగము: రావణుని యాస్థానము)

ప్రవేశము:

(రావణుఁడు, ఇంద్రజిత్తు, విభీషణుఁడు, బద్ధుఁడైన యాంజనేయుఁడు.)

ఆంజ—(రావణునిఁ జూచుచు, స్వ) ఆహా! యీ నిశాచరుఁడు సామాన్యునివలెఁ

దోఁపఁడు. వీనిముఖమునఁ బరాక్రమమెగాక బ్రహ్మతేజ ముట్టిపడుచున్నది. దిక్కరికరోపమానంబులగు నీ యాజానుబాహుదండములును, విశాలమై విజయలక్ష్మీ నివాసయోగ్య మహాస్థానపీఠముపలెఁదోఁచు నీ వక్షస్థలమును, వేయేల, వీని సర్వావయవములును, నీతని ధైర్యశౌర్యసాహసాదులును జూడ నితఁడు పాపచింతనుండును, రాక్షసకులసంజాతుండును గాకుండెనేని దేవేంద్రాది సకలనిర్జరులకు నాథుఁడై చతుర్దశభువనముల కధిపతి కాఁదగినవాఁడని తోఁచుచున్నది.

రావ—(ఆంజనేయునితో) ఓరీ! కోఁతి! నిజముజెప్పుము. నీవెవ్వఁడవు? ఎవరిపంపున నిటకువచ్చితివి? నీ రాకకుఁ గారణమేమి? మావనమేల భంగమొనరించితివి? వనపాలకుల నేలవధించితివి? అబద్ధమాడిన శిక్షింతును.

ఆంజ—ఓరీ! నాఁడు సీతాహరణసమయంబున నామెతో సన్న్యాసినని పౌరుషహీనుండవై నీవబద్ధమాడి మోసపుచ్చితివిగాని నాకట్టి యవసరములేదు. నా యుదంతమువినుము. నిన్ను వాలపాశమునఁగట్టిన వాలిని సమరాంగణంబున వధించిన బలశాలియును, నిన్నుఁ జెఱగొన్న కార్తవీర్యుని ద్రుంచిన పరశురామునంతవాని భంగపఱచిన పరాక్రమశాలియు, నగు రామునకు నేను దూతను, సుగ్రీవసచివుండను. వారిపంపున సీతాసతి నన్వేషింప నిటకువచ్చితిని. అట్లువచ్చి సీతోఁగొంత సంభాషింపఁదలంచి లోకభీకరుఁడవగు నిన్నొండు విధంబునఁజూడ నశక్యంబుగావున వనభంగమొనరించి యాత్మరక్షణార్థమై దనుజులవధించి తుదకు నేనే స్వయముగ రాక్షసులచేఁజిక్కితిని. నాచెప్పఁదలంచినది చెప్పుచున్నాఁడ వినుము:—ఏమనిన,

చ॥ ఘనుఁడవు, లోకమాన్యుఁడ వ ♦ ఖండబలుండవు బుద్ధిశాలివిఁ
మనుమఁడ వావిధాత, కన ♦ మానయశుండవు నైన నీ విసీ!
కనికని ధర్మదూష్యమగు ♦ కార్యమొనర్చితి వన్యకాంత భూ
తనయను మ్రుచ్చిలించితి వ ♦ ధర్మవశాత్ముఁడవై దశాననా॥

ధర్మశీలుఁ డగువాఁ డెందును ద్రిలోకపూజ్యుఁడై సకలభోగము లనివార్యముగ ననుభవించును. పాపశీలుఁడు సదా పరాజయమందుచు దుఃఖభాజనుండగును. నీవు పరదారాపహరణమొనరించుటంజేసి మహాపాపివైతివి. కావున నిజసతీతస్కరుండవగు నిన్నాఖరాంతకుఁడు సబాంధవముగ నిర్మూలింపఁగలఁడు. ఇంతయేల? నిన్ను ద్రుంప నేనచాలుదునుగాని సుగ్రీవాదుల సమక్షంబున రాముండు నిన్ను వధింప బ్రతినచేసినకతంబున బ్రతికిపోయితివి. నీవెట్టి

వాఁడవైనను బరోపకారము సత్పురుషులకు యుక్తమగుటచే నీ వెందును నపాయమందకుండునట్లు చక్కని యుపాయముఁ జెప్పుచున్నాఁడ వినుము. రాముండు శరణాగతత్రాణబిరుదాంకితుఁడు. శరణార్థివై తివేని నిన్నాతఁ డవశ్యము రక్షింపఁగలఁడు. మఱియును,

చ॥ ఇలపయిఁ గొన్నినాళ్లు సుఖ ♦ యింపఁదలంచెదవేని రామభూ
తలపతికిమ్ము వేగ వసు ♦ ధాసుత, నట్లొనరింపవేని నిన్
లలి సమరావనిన్ ప్రబల ♦ రామమహోగ్రధనుర్విముక్త సూ
జ్జ్వలనిశితప్రచండ శర ♦ వహ్నులు భస్మమొనర్చు రావణా॥

రావ—(కోపమునఁ బండ్లుకొఱుకుచు) ఓరీ! మర్కటాధమా! మత్తెక్కి కండకావరంబున నతిక్రాంతమర్యాదుండవై కాఱులుప్రేలఁజొచ్చితివా? కుమారా! మేఘనాదా! యీ తుచ్ఛ నొక్కవ్రేటున వధించివేయుము.

విభీ—(నివారించి) అన్నయ్యా! దూతయగు నితఁడవధ్యుఁడు. ఇట్టివారికి ముండనంబును కశాఘాతంబును నాదిగాఁగల శిక్షలు విధించియుండ నీవిట్లాగ్రహపడి సంహరింపనాజ్ఞాపించు టనర్థము.

రావ—అట్లైన గోఁతులకు వాలము ప్రియకరంబుగావున నీతుచ్ఛునితోఁకఁగాల్చి లంకానగరరాజవీధుల నూరేగించి పంపివేయుఁడు. (నిష్క్రమించును)

(రాక్షసులాంజనేయునిఁ బట్టుకొని పోవుచున్నారు)

(అందఱు నిష్క్రమింతురు)

(యవనిక జాఱును)

---

(౨ రంగము - లంకాపురరాజవీధి)

ఆంజ—(మండుచున్న వాలము ద్రిప్పుచు ప్రవేశించి, రావణునుద్దేశించి) రే! దురాత్మా! దశకంధరా!

శా॥ ఓరీ! తోఁకనుగాలిపించితివి గ ♦ ర్వోన్మత్తతన్ నీ విదే
కూరారాహీంద్రకరాళమత్పటుమహా ♦ గ్రోద్రగ్రవాలాగ్ర దు

ర్వారానల్పకృశాను సంజనిత తీ ♦ వ్రజ్వాలలన్ నేఁడు లం
కారాజ్యంబు హుతాశనార్పితముగాఁ ♦ గన్ జేసెదన్ జూడరా!॥

తే॥ గీ॥ నీరసతృణాటవులఁ బ్రిశ ♦ యోరువహ్ని
కాల్చుకై వడి నీపురిఁ ♦ గల వినూత్న
భర్మహర్మ్యము, లా ♦ రామ పంక్తు లఖిల
శాలలును, బూది సేసెద ♦ జడుఁడ! గనుము॥

(అనంతరము ముందుకువచ్చి) శ్రీరామకటాక్షమునను బతివ్రతామతల్లి యగు సీతాసతి యాశీర్వచన ప్రభావమునను నగ్ని దేవుఁడు నాయెడఁ జందన మట్లు చల్లనై యుండుటచే నిరపాయముగ లంకాదాహ మొనర్చితిని. ఇంక నాయీ వాలము నంబుధియందుఁ జల్లార్చుకొని నాకై నిరీక్షించు నంగదాదులఁ గలిసికొని రామదేవునిపాలికిఁ బోయెదను. (నిష్క్రమించును.)

(యవనిక జారును.)








# పంచమాంకము.

## ప్రథమరంగము.

(రామలక్ష్మణ సుగ్రీవులును, ఆంజనేయాదివానరులును ప్రవేశింతురు)

రాము—(ఆంజనేయునితో) పవనతనయా! నీధైర్యసాహసాదు లతివర్ణనీయములు.

చ॥ అతులభయావహంబయి సు ♦ రాసుర దుర్గమమై యగాధమౌ
వితతమహార్ణవంబుఁ బటు ♦ విక్రమ సంపదమీఱ దాఁటి యు
ద్ధతి నల లంకఁజొచ్చి వసు ♦ ధాసుతఁగాంచి నిశాచరావళిన్
హత మొనరించినట్టి భవ ♦ దద్భుతశౌర్యము నెంతుఁ బావనీ!॥

నీవొనరించిన యీ మహోపకారమునకే నేమిప్రత్యుపకృతి సేయఁగలను? మదీయాలింగనంబుఁగొమ్ము. (కౌఁగిటఁ జేర్చుచున్నాఁడు)

ఆంజ—ధన్యోస్మి. ధన్యోస్మి. మహాత్మా! మీయనుగ్రహమున్న నాకేదియసాధ్యము?

రామః—(సుగ్రీవునితో) సూర్యనందనా! కపికులోత్తముఁడగు నీవాయుతనయుని వలన సీతావృత్తాంతమెఱిఁగి సంతసించితిఁ గాని సముద్రోల్లంఘనం బొనర్చి రావణుజయించుటెట్లు సాధ్యమగునాయని చింతించుచున్నాఁడ.

సుగ్రీవు—రాజశ్రేష్ఠా! నీవావిషయమై యాలోచింపఁ బనిలేదు. మేమందఱము నీదాసులము. చిచ్చుఁజొఱుఁడన్నను సంసిద్ధులమయ్యెదము. మఱియును ఘన వానరయోధాగ్రేసరు లెంతకైన సమర్థులు.

మ॥ బలదోర్దర్ప సమగ్రులై భువి గణిం ♦ పన్ రానటుల్ వేలు, ల
క్షలు, గోట్లర్బుదముల్ రణోగ్రులు ప్లవం ♦ గశ్రేష్ఠు లున్నారొగిన్
గలయంజూడుము, నీవు నీకొఱకు బ్రా ♦ ణాలైన నర్పించువా
రలు నీయాజ్ఞమెలంగి నీకిఁకవిచా ♦ రంబేల ధాత్రీశ్వరా!॥

రాము—అట్లైన నిప్పుడేమి కర్తవ్యము?

లక్ష్మ—అన్నయ్యా! నీకింకను కర్తవ్యము స్ఫురించుటలేదా? వినుము.

చ॥ ఖలుఁడయి మాయవేషమునఁ ♦ గాననసీమవసించు జానకీ
లలనను మ్రుచ్చిలించిన దు ♦ రాత్ము దశాస్యు సబాంధవంబుగా
నల హరుఁడడ్డమైన సమ ♦ రావనిఁ దీక్ష్ణశరాగ్నికీలలన్
శలభముమాడ్కిఁ గాల్చుటయె ♦ చయ్యన నిత్తఱిఁ గర్జ మగ్రజా!

కావున సకలవానరవాహినీసహితులమై మనము శీఘ్రము లంకానగరము
నకుఁ బ్రయాణము సేయవలెను.

ఆంజ—రాజపుంగవా? ఇఁక జాగేల?

శా॥ ప్రాకారంబులఁ గూల్చి గోపురములన్ ♦ భస్మంబుగావించి పెన్
పీఁకన్ వాజిశతాంగసద్భటగజా ♦ నీకంబు మర్దింపనో
గా కింకేటికి నాలసింప నరికిన్ ♦ గాల్ద్రివ్వ దుస్సార లు
త్సేకోదగ్రతఁ గీశయోధులు ధరి ♦ త్రీనాథచూడామణీ॥

అంగ—దేవా! విజయసూచకములగు బహునిమిత్తములు తోఁచుచున్నవి. జయ
లక్ష్మి మిమ్మవశ్యము వరింపఁగలదు. కావున సుముహూర్తమున బయలు
దేఱి లంకకరుగవలయును.

రాము—అంగదా! అట్లైన నీదినము ప్రయాణమునకెంతయు బాగుగనున్నది కావున
సత్వరమ వటయుసన్నాహము సేయింపుము.

మ॥ జలరాశిన్ దరియించి భీకరమద ♦ స్త్రవాశ్రితజాతోజ్జ్వల
జ్వలనాభీల శిఖాస్ఫులింగములదో ♦ స్సారంబుదీపింప దై
త్యులనెల్లన్ వెసరూపుమాపి దశవ ♦ క్త్రోదగ్రమూర్ధాళి ని
ష్ఠులితాస్మత్కరవాలధార నిలఁ గూ ♦ ల్తున్ యుద్ధరంగంబునన్॥

అంగ—(వానరసేనాభిముఖుఁడై) అఖండభుజపరాక్రమసంపన్నులగు నో వానర
యోధులారా! రామకార్యార్థమై మనమిప్పుడు లంకపై దాడివెడలవలయుఁ

గావున మీరందఱుఁ దరుశిలాపాణులై బయలుదేరుఁడు. (నలునితో) నలుఁడా! నీవు లక్షకపులతో బలంబులకుఁ దోవఁజూపుచు ముందునడువుము.

నలు—చిత్తము. (అప్పుడు వానరులందఱుఁ దరుశిలాపాణులై వెడలుచున్నారు.)

(అందఱునిష్క్రమింతురు.)

(2 రంగము: రావణుని కొలువుకూటము.)

[రావణుఁడు, కుంభకర్ణుఁడు, విభీషణుఁడు, ఇంద్రజిత్తు, అతికాయుఁడు, మహాకాయుఁడు, ప్రహస్తుఁడు, ధూమ్రాక్షుఁడు, ప్రవేశము.]

రావ—అసామాన్య మహిమాభిశోభితులగు నోమంత్రిసత్తములారా! సేనానాయకులారా! రామలక్ష్మణు లసంఖ్యాకమగు కపిసైన్యముతో సముద్రోల్లంఘన మొనర్చి లంకంబ్రవేశింప నుద్యోగించుచు జలధియావలితీరంబున విడిసి యున్నట్లు చారులవలన నెఱింగియుంటిమికదా! వైరుల నేవిధముననైన జలధి దాఁటకమున్నె భంజించిపంపుట నాకు బాగని తోఁచుచున్నది. ఐనను సర్వజన సమ్మతమగుకార్య ముత్తమముకావున నిందు మీయభిప్రాయములుగూడ వినఁగోరుచున్నాను.

మ॥ వెలయన్ మీరలనేక సంగరములన్ ♦ విశ్వంబుకంపింప ను
జ్జ్వలశౌర్యంబునుజూపి మేటి విజయం ♦ బారూఢిఁగైకొన్న ధీ
రులు దుర్వారబలాఢ్యులుద్ధతిఁ ♦ దిరిమూర్తుల్ వచ్చినన్ గెల్వఁగా
గలవారెంతయు బుద్ధిమంతు ల ♦ రయన్. గర్తవ్యమూహింపుఁడీ!

ప్రహస్త—ప్రభూత్తమా! మశకమాత్రులగు నరవానరుల సమయింప నింతయాలోచన మెందులకు? నాకానతి యిండు, క్షణమాత్రమున నందఱ నవనికి బలి యిచ్చి వచ్చెదను

రావ—వాహినీశ్వరా! నీవంతటి సమర్థుఁడవేకాని, నాఁడు లంకాదహన మొనరించిన మర్కటాధముని ప్రతాపముఁ జూచినదాది వానరులన్న నాయెడఁద కొక్కింత దడ గల్గుచుండును. కావున నద్దురాత్ముల సామాన్యులని నిరసింపక తగురీతి సర్జింపవలయును.

ఇంద్ర—తండ్రీ! ఎన్నఁడో జరిగినవృత్తాంతమును దలంచి హీనులగు వానరులకు బెగడ నేల? త్రిలోకవిదితంబగు మత్పరాక్రమం బీవెఱుంగవా?

మ॥ సురలోకంబున కేఁగి దివ్యుల ననిన్ ♦ సుక్కించి పాకారిను
ద్ధుర బాహాబలదర్ప మొప్ప శరబ ♦ద్ధుంజేసి యత్యుద్ధతిన్

జెఱఁగొన్నట్టి మహాబలాఢ్యుఁడు ద్విష ♦ త్సేనాటవీపావకుం
డరయన్నీసుతుఁ డింద్రజిత్ప్రవరుఁడుం ♦ డన్ జింత నీ కేటికిన్॥

అతి—దైత్యేశ్వరా! మృత్యువదన గుహాంతరముం జొరఁదలంచిన ట్లీ నరవానరులు లంకం బ్రవేశింప జూచుచున్నారు. వీరి కెట్లును మనచేఁ జావుతప్పదు. నీవు విచారింపనేల?

మహా—ఔను. మనకింకఁ జేతులనిండఁ బనికలుగును. మన యాయుధముల తుప్పు వీడును.

ధూమ్రా—నాకుఁ గొంతకాలమునుండి సమరవిహారము లేనందునఁ గుతియెత్తి నట్లున్నది. నేఁటికది తీఱుకాలము వచ్చినది.

విభీ—సేనాపతులారా! మంత్రులారా! వానరులతో వైరము కలిగినందులకు మీరు సంతసించుచున్నారు గాని నాకుమాత్ర మిప్పుడు రిపులఁ గెలుచుట దుర్ఘట కార్యముగఁ దోఁచుచున్నది. ఏమనిన,

మ॥ మునులిలన్ ప్లవగుం డొకండు వెసనం ♦ భోరాశి లంఘించి లం
కను భంజించి, యశోకమున్ బెఱికి, పీ ♦ కన్ దైత్యులం జంపి, ది
గ్గన వాలాగ్నిఁ బురంబుఁ గాల్చిచనె, నొ ♦ క్కండయ్యె నిప్డట్టికి
శనికాయంబు లనేకకోట్లుగలవే ♦ చందంబునన్ గెల్తురో॥

మఱియును ఖరదూషణాద్యనేక దానవవీరులఁ బరిమార్చిన యా రామలక్ష్మణులు ధూర్జటికైన నజయ్యులు. అది యట్లుండఁ బ్రథమమున సామదానభేదంబులను త్రివిధోపాయములు ప్రయోగించి చూచి పిమ్మట విక్రమోద్యోగంబు సలుపవలయును గాని ధర్మవిరుద్ధముగఁ దొలుతనె యుద్ధసన్నద్ధుల మగుట తగనిపని. అదియునుంగాక రామలక్ష్మణులయం దిసుమంతయుఁ దప్పు కానరాదు. ఊరకుండక సీతను తెచ్చుటచే నమ్మహాత్ములు కోపావేశపరవశులై యిట్లు వచ్చియున్నారు. బాగుగ విచారించి చూడఁ దప్పంతయు మనయందె కానఁబడుచున్నది. కావున నేవిధముననైన సంధికుదుర్చుకొనుట శ్రేయస్కరమని నాయభిప్రాయము.

రావ—తమ్ముఁడా! నీవు పలికినది సమంజసముగ లేదు. ఏమనిన,

తే॥ గీ॥ కన్నుఁగానక గడు కండ ♦ కావరమున
మన కనుఁగుచెల్లెలైన శూ ♦ ర్పణఖబట్టి
క్రూరులై ముక్కు జెవులును ♦ గోసినట్టి
ఖలు లవశ్యము వధ్యులు ♦ గారె చెపుమ॥

విభీష—అన్నా! తొలుత మనశూర్పనఖ సీతను మ్రింగఁబోవుటచే వారట్లొనర్చిరి కావున నిందు వారిలోపము కనుపట్టదు.

రావ—విభీషణా! నీప్రసంగము లిఁకఁజాలుము. తిన్న యింటివాసము లెన్నినట్లు నీవు నాతమ్ముఁడవై యుండియు నావైరుల ననపరాధులుగను నన్నపరాధిగను నిరూపించుచున్నాఁడవు. ఇదియా నీభక్తి!

ఇంద్ర—తండ్రీ! యీతండెప్పుడును బగవారిపక్షమునను మాటలాడుచుండును. ఆనాఁడే శ్రీరంగసేతువులు చెప్పి చేతఁజిక్కిన మర్కటులవిడిపించె. ఆవానరాధముఁ డప్పుడు మడిసియుండిన నింతవఱకు వచ్చియుండునా?

విభీ—(స్వ) నిజమాడిన నిష్ఠురమనుట యిట్టిదే. ఐనను నాశక్తికొలఁది చెప్పిచూచెదను. (ప్ర) అన్నయ్యా! నీవు వారివీరిమాటలు విని దుష్పథము నవలంబింపకుము. అపారసత్వసంపన్నులగు రామలక్ష్మణులఁ గెలుచుటయన్న దిక్పతులఁ గెలుచుటకాదు. వారనహాయశూరులు. తదనుచరులగు మర్కటులును నసాధ్యులు. ఇంతియగాక విష్ణుదేవుఁ డసురవధార్థము రామావతారమెత్తినట్లు నేనొకనాఁడు నారదముఖంబున వినియున్నాఁడను. కావున నమ్మహాత్మునితో వైరముఁబూని దనుజకులనాశన మొనరింపకుము.

చ॥ మనుజులటంచు రాఘవుల ♦ మాన్యుల నల్పులుగాఁ దలంచి యా
యనఘులతో బగంగొనుట ♦ యారయఁ గీడగు మాలమింక న
మ్మనమునఁ దొంటికార్యమును ♦ మాని ధరాసుతఁ గొంచుబోయి సొం
పెనయఁగ రామభూవరున ♦ కిచ్చి సుఖించుట శ్రేయము నగ్రజా!

రావ—నీయుపన్యాస మింకఁ గట్టిపెట్టుము. (కుంభకర్ణునితో) తమ్ముఁడా! కుంభకర్ణా! వింటివా వీనిమాటలు. ఈతఁడు మనదానవవంశంబు జెఱుపఁబుట్టినాఁడు.

కుంభ—అన్నా! నీవాగ్రహమందిన నేఁ జెప్పఁజాలనుగాని వయసున మనకన్నఁ బిన్నవాఁడైనను తమ్ముఁడగు విభీషణుఁడు చెప్పినది బాగుగనే యున్నది.

రావ—ఓరీ! నీవును నాతోవనే త్రొక్కుచున్నాఁడవా?

కుంభ—నాకీగొడవ యెందులకు? మీరేమైనఁ జేసుకొనుఁడు. నిద్రాదేవత నాతలపైఁ దాండవమాడుచున్నది. నాకింక ననుజ్ఞయిమ్ము, పోయి నిద్రించెదను.

రావ—నీవుండి చేయునదేమి పొమ్ము.

కుంభ—(నిష్క్రమించును.)

విభీష—అగ్రజా! నిన్ను బ్రతిమాలుకొందును. నామాటవిని నీదుశ్చింత విడిచి సీతను రామున కిచ్చివేయుము. దానవకులము నుద్ధరింపుము. కార్యము మించినపిమ్మటఁ జేయునది లేదు.

రావ—(కోపముతో) ఛీ దుష్టుఁడా! నీయధిక ప్రసంగము లింకఁ జాలింపుము.

(తన్నుచున్నాఁడు.)

విభీ—(నేలపైఁబడును.)

రావ—ఈదురాత్ము నిప్పుడే కడ తేర్చెదను. (నఱుకఁబోవును.)

ప్రహస్త—(అడ్డమువచ్చి) మహాప్రభూ! తమ్మునిపై గోపింపవలదు. శాంతింపుఁడు.

రావ—ఈతుచ్ఛుని నాకొలువునుండి వెడలనడువుము.

ప్రహ—విభీషణా! మహారాజుగారికి నీయెడఁ బూర్ణముగ నాగ్రహమువచ్చినది. ఇంక నిచ్చట నీయునికి తగదు. నడువుము.

విభీ—(లేచి రావణునితో)నీచుఁడా! నీమేలుఁగోరి చెప్పిన నన్నిట్లు దురాగ్రహాగ్రహగ్రసితచేతస్కుఁడవై నిండోలుగంబునఁ దన్ని పరిభవించిన నీవేపాటిసిరి ననుభవింపఁగలవో చూచెదఁగాక. అమృతోపమానములగు నానీతులు నీకు విషతుల్యములయ్యెఁగా? కానిమ్ము. నీకర్మము నీవే యనుభవించెదవు.

చ॥ జనకజ ముచ్చిలించి రఘ ♦ సంబునఁదెచ్చిన దానికుగ్రులై
యనిమొనరామలక్ష్మణుల ♦ నంత నిశాతశిలీముఖంబులన్
దనుజులఁగూల్చి సీతలను ♦ ధారుణిఁదాళఫలంబులట్లు రా
ల్చినతఱి నాదువాక్యము లె ♦ ఱింగెదుగాకిపు డీవువిందువే? ॥

(నిష్క్రమించును.)

రావ—కుమారా! పోవుదము రమ్ము. (అందఱు నిష్క్రమింతురు.)

---

(౩ రంగము – వేలావనము)

(రామ, లక్ష్మణ, విభీషణ, సుగ్రీవాదులు ప్రవేశింతురు.)

రాము—(విభీషణునితో) పౌలస్త్యా! నీవింతటినుండి మాకుఁ బరమాప్తుఁడవైతివి.

ఉ॥ నీనయవాక్యముల్ వినక ♦ నిండుసభన్ గడుదుష్ప్రవర్తనం
డై నినుఁగాలదన్నిన దు ♦ రాత్ముని రావణు మచ్ఛరాగ్ని నం

భోనిధి డాఁగినన్ వెసఁ దిృ మూర్తులు బాసటయాచు నిల్చినన్
బూని వధించి లంకకుఁ బ్రి మోదముగన్ నిను రాజుఁజేసెదన్॥

విభీష—మహాత్ములగు మీయనుగ్రహమున్న నాకదియే పదివేలు. నేనును నా శక్తికొలఁది మీకు సహాయమొనరించుచు రాక్షసమర్మము లన్నియు మీ కెఱిఁగించుచుందును.

రాము—లక్ష్మణా! సముద్రజలంబు గొనివచ్చి లంకారాజ్యంబున కీవిభీషణు నభిషేకంబు సేయుము.

లక్ష్మ—చిత్తము. (అట్లుచేయును)

సుగ్రి—(రామునితో) ఆర్యా! నేను మిమ్మొక్కటి యడుగుచున్నాఁడ—ఇప్పు డా రావణుఁడు సీతామహాదేవి నప్పగించి శరణార్థియైవచ్చి మిమ్ము వేఁడుకొన్న నెట్లగును?

రాము—(నవ్వి) భానుతనయా! ఇదియా నీసంశయము. ఆదుష్టున కట్టిసద్బుద్ధియే కలిగిన నతనికి నాయయోధ్య నొసఁగి నేను తపస్వినై వనములనుండెదను.

సుగ్రి—మహాత్మా! మీయుదారగుణ మనన్యసామాన్యమైనది. (విభీషణునితో) నిశాచరాగ్రణీ! రాఘవులిప్పుడు వానరసేనాసహితముగ సముద్రమును దాఁటవలసియున్నది. కావున బుద్ధిశాలివగు నీ వీవిషయమై తగినయాలోచనముం జెప్పుము.

విభీ—కపిశ్రేష్ఠా! యీ రఘూత్తముండిప్పుడు సముద్రుని భక్తియుక్తుఁడై ప్రార్థించిన గార్యము నెఱవేఱఁగలదు.

లక్ష్మ—అన్నయ్యా! ఈ విభీషణుని యభిప్రాయము బాగుగనున్నది.

రాము—ఔను. నే నొకచో నియమితుండనై జలనిధి నారాధించెదగాక! (నిష్క్రమించును.)

---

(ప్రవేశము – అంతరిక్షమున శుకుఁడు.)

ఓసుగ్రీవా! నీకు మా రాజగు దశకంధరుం డొకసందేశ మంపియున్నాఁడు విసుము. ఏమనిన "నల్పుఁడగు రామునకు సహాయముగనున్న నీ కావంతయు లాభము లేదు. కావున బలవంతుఁడునగు నాతో విరోధమునుమాని శీఘ్రము గ నీసేనలతోఁ గిష్కింధకు మరలిపొమ్ము. లేకున్న నీవు ససైన్యముగ నాచే మడియఁగలవు" అని,

సుగ్రీ—కపులారా! వీఁడెవఁడో దానవాధముఁ డంతరిక్షమున నిలిచి కాలులుపేలు చున్నాఁడు పట్టుకొందురు రండు.

(అందఱు నిష్క్రమించి)

(శుకునిఁబట్టి కొట్టుచు ప్రవేశింతురు.)

శుకుఁడు—(మొఱపెట్టుచు) బాబులారా! నేను నిరపరాధుఁడను. నన్ను బాధింపకుఁడు నేను రాజునానతి సందేశంబుగొనివచ్చిన దూతను. నన్ను విడిచిపెట్టుఁడు. మీకుఁ బున్నెమువచ్చును.

రాము—(లోపలినుంచి) ఓసుగ్రీవా! ఓవానరులారా! వార్తావహుఁడగు నితనిని వధియింపఁజనదు కావున వదిలివేయుఁడు.

సుగ్రీ—ఓరీ! రాముననుగ్రహమున బ్రదికిపోయితివి పొమ్ము. (శుకుని విడిచిపెట్టు చున్నారు.)

శుకు—అయ్యలారా! మీకు నమస్కరించెదను. నాకిఁక బుద్ధివచ్చినది.

(నిష్క్రమించుచున్నాఁడు.)

(అందఱు నిష్క్రమింతురు)

---

(4 రంగము: రావణుని కొలువుకూటము)

(రావణుఁడు మంత్రులు ప్రవేశము.)

సేవకుఁడు—(ప్రవేశించి) మహారాజా! దేవరదర్శనార్థ మొకవానరుఁడు వచ్చియున్నాఁడు.

రావణు—లోనికిరానిమ్ము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును.)

అంగ—(ప్రవేశించి) ఓయీ! దశాననా! తడవుమసలుటకు వీలులేదు కావున శీఘ్రమ నావచ్చినకారణ మెఱింగించుచున్నాఁడ వినుము. ఏమనిన శ్రీరాముఁడు ధార్మికుండును రాజనీతిజ్ఞుఁడును నగుటచేఁ దొలుదొల్తనె రణంబునకుద్యమించుట తగదని నీకొకసందేశ మంపియున్నాఁడు. అది సావధానుండవై యాకర్ణించి తోఁచినప్రత్యుత్తర మిమ్ము.

రావ—ఆ సందేశమేమని?

అంగ—ఇదిగోఁ జెప్పుచున్నాఁడ—ఇవి రామునివాక్యములు.

ఉ॥ పౌరుషమేది దొంగవలెఁ ♦ భామిని సీతను దెచ్చినట్టి నీ
వారయ శీఘ్రకాలమున ♦ నాహవధారుణి బ్రహ్మదీయ దు
ర్వార త్రిలోకభీమధను ♦ రభ్రవినిర్యదమోఘమార్గణా
సారమునన్ మునింగి యమ ♦ సన్నిధి జేరకపోవుదుష్టుఁడా!॥

ఉ॥ కానరణంబుఁగోరిన న ♦ ఖండధృతిన్ దగ వచ్చినిల్వు కా
దేని "కుబుద్ధివై పడఁతిఁ ♦ దెచ్చితిఁ దప్పుక్షమింపు" మంచు శీ
ఘ్రాసఁ బురంబుపీడి యెట ♦ కైనను బోయివసింపు మింక నె
ట్లైనను మా విభీషణుఁడె ♦ లంకకు రాజగుఁ బంక్తికంధరా॥

రావ—(కోపముతో) ఓరీతులువా! నోటికివచ్చినట్లు కాఱులు పేలుచున్నాఁడవా? ఓదానవవీరులారా! యీ దురాత్మునిపట్టి బంధింపుఁడు.

(రాక్షసు లంగదునిఁ బట్టుకొనఁబోవ నందఱను తప్పించుకొని నిష్క్రమించుచున్నాఁడు.)

రాక్షసులు— పట్టుకొనుఁడు, పట్టుకొనుఁడు.

(అందఱు వెంటఁ బరుగెత్తుచున్నారు.)

(యవనిక జాఱును.)



---

(5 రంగము—ఇంద్రజిత్తుమందిరము)

ఇంద్ర—(ప్రవేశించి స్వ) ఓరా! వానరు లెంతపరాక్రమవంతులు. వారికని మాకును జరిగిన సంకులయుద్ధమున నొక్కొక్క వానరుఁడు విజృంభించి చతురంగ బలంబులపై గవిసి దానవయోధుల మారిమసంగినట్లు నిర్మూలించుచుండ మేము శౌర్యముదక్కి తుదకుఁ బ్రాణములు దక్కించుకొని పాఱిపోవలసిన వారమైతిమి. ఐనను నింతటితో నద్దురాత్ముల విడుతునా? మదీయమాయా బలంబునఁ గపిసేనయందు గాఢాంధకారమును గల్పించి మహామేఘముల సృష్టించి యుఱుములును, మెఱుములును బిడుగులును జూపి యేకాకింగానరాకుండ వియత్పథంబున సాంద్రజీమూతమండలమందు నిలిచి యమోఘము లగు శరవర్ష ధారాపరంపరల గురియించి శత్రువుల బాధింతుఁగాక.

(నిష్క్రమించును.)

(6 రంగము - యుద్ధభూమి.)

(రామాదులు నాగపాశబద్ధులై పడియుందురు.)

రాము:—అక్కటా! మే మీనాగపాశబంధములనుండి విముక్తిఁజెందుట యెట్లు? దైవమా! మాకెంతయవస్థఁ దెచ్చిపెట్టితివి. వైరివీరుల హృదయపుటంబు లవియించు మాపరాక్రమమంతయు నేఁడెందునకుఁ బనికిరాకుండఁ జేసితి వేమి?

చ॥ స్తుతమగు భాస్కరాన్వయ వి ♦ శుద్ధపయోనిధి జన్మమొంది, యు
ల్లతిబలశౌర్యసంయుతుల ♦ మంచు ధరాస్థలిఁ బేరుఁగాంచి, యీ
గతిఁ దుది దైత్యకృత్రిమము ♦ గానక బద్ధులమై రణాంగణ
క్షితిఁబడినార మక్కట! మృ ♦ గేంద్రము నక్కకుఁజిక్కినట్లుగా॥

అయ్యయో! మరల మూర్ఛవచ్చుచున్నది. (మూర్ఛిల్లును.)

సుగ్రీ—విభీషణా! ఇది యేమిసంకటము?

విభీ—సూర్యనందనా! ఇది యుద్ధమున దెబ్బలుతినిపోయిన యింద్రజిత్తు మనయెడలఁ గ్రుద్ధుఁడై చేసిన మాయాకృత్యమని తోఁచుచున్నది. ఇట్టి విద్యలయందు వాని కెవ్వరును సాటిలేరు.

సుగ్రీ—పౌలస్త్యా! ఇప్పుడు కర్తవ్యమేమి?

విభీ—నాకును స్ఫురింపకున్నది.

సుగ్రీ—అయ్యయో! ఇంక నేదిదిక్కు?

ఆంజ—అక్కటా! మారామయ్య కెంతయవస్థ వచ్చినది!

విభీ—వానరోత్తమా! చింతించిన నేమిప్రయోజనము? ధైర్యము వహించియుండుము.

(అప్పుడు నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

నారదు—(స్వ) ఇంద్రజిత్తుచేసిన మాయాయుద్ధమునందు దాశరథులు నాగపాశబద్ధులై పడియుండ వానరులందఱు నుపాయమెఱుంగక చింతించుచున్నారు. నే నాచింతఁ దీర్చెదను.

విభీ—ఓహో! నారదమునీంద్రుఁడు కాఁబోలును వచ్చుచున్నాఁడు. ఇప్పు డీముని పుంగవునిరాక యెంతయు శుభంకరమని నేఁ దలంచెదను.

నారదు—(రాముని సమీపించి ప్రకాశముగ) దేవా! నీవు త్రిగుణాత్మకుండవై త్రిమూర్తిస్వరూపుండవై సృష్టిస్థితిలయకారణుండవైన నిఖిలమయుండవు. సర్వేశ్వరుండవు. ఇట్టి నీవు సర్వజ్ఞుండవయ్యు మాయామానుషవిగ్రహుం

డవై కర్తవ్యమెఱుంగనివానివలె నున్నాఁడవు. నీవిప్పుడు నీవాహనంబగు వైనతేయునిఁదలంచిన నతఁడు మిమ్ముల బంధవిముక్తులఁ జేయగలఁడు. మీకు జయంబు గలుగుగాక. పోయివచ్చెదను. (నిష్క్రమించును.)

రాము — ఈ నారదమునీంద్రుఁడు చెప్పినట్లు గరుత్మంతునిఁ దలఁచెదను. ఓ విహంగాధిపా!

తే॥ గీ॥ దనుజమాయకుఁజిక్కి దు ♦ ర్దశనుజెంది
నవయుచున్నార మిత్తఱి; ♦ నాగపాశ
బంధములనూడ్చి మమ్ముఁగా ♦ పాడుమయ్య
మాననీయ! సురధ్యేయ! ♦ వైనతేయ! ॥

గరుత్మంతుఁడు — (లోపల) ఓమహాత్మా! త్రిలోకపూజ్య! నేనిదే వచ్చుచున్నాఁడ. చింతదక్కుము.

రాము — ఆహా! ఈతనిరాకసడి విని యిప్పుడే మమ్మీనాగబంధములు విడచినవి. (రామలక్ష్మణులు లేచుచున్నారు.)

వాన — (సంతోషముతో గంతులువేయుదురు.)

గరు — (ప్రవేశించి) మహనీయులారా! మీరు బంధవిముక్తులైతిరి. నాకింక ననుజ్ఞయిండు పోయివచ్చెదను.

రాము — ఖగేశ్వరా! నీవు మాకు మహోపకారివైతివి. పోయిరమ్ము.

గరు — (నిష్క్రమించును.)

సుగ్రీవు — వానరయోధులారా! మనమిప్పుడు లంకపైగవిసి చతురంగబలంబుల నుగ్గుచేసి రావణుని మదమడంచి వత్తము రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

---

(7 రంగము — రణభూమి)

(సైన్యసమేతుఁడగు కుంభకర్ణుఁడును, వానరులును చెఱియొక ప్రక్కనుంచి ప్రవేశించుచున్నారు.)

కుంభ — రే వానరాధములారా! రిపుజనప్రళయకాలుండనగు నాయెదుటఁబడి మీరింక నెందుఁబోఁగలరు? మిమ్మందఱ నిప్పుడే భూమికి బలియిచ్చెదను. జూడుఁడు.

(వానరులపై దుమికి యుద్ధము సేయుచున్నాఁడు.)

వాన—(తత్తఱముతో) ఓరామచంద్రా! ఓలక్ష్మణా! రండు రండు. మమ్మీకుంభకర్ణుఁడు బ్రతుకనిచ్చుటలేదు. వీనిముందు మేము నిలువఁజాలకున్నాము.

రాము—(లోపలినుంచి) ఓహో! వానరులారా! భీతిల్లకుఁడు నేనిదె వచ్చుచున్నాఁడ.

అంజ—(స్వ) అబ్బా! ఇదివఱకు ప్రహస్తాకంపన ధూమ్రాక్ష మహాకాయాది దానవుల నెందఱినో యుద్ధమున మట్టుఁబెట్టితిమి గాని వీనియెదుట మాశౌర్యమంతగాఁ బనికిరాకున్నది. ఈదురాత్ము నారాముఁడె వధించుఁగాక.

(రామలక్ష్మణులు ధనుర్బాణపాణులై ప్రవేశింతురు.)

రాము—రే! దుర్గుణసంపూర్ణా! కుంభకర్ణా!

చ॥ మదమున నల్పసత్త్వులగు ♦ మర్కటులన్ వధియించుటేటికి?
ట్లిదె కను ముగ్రదానవుల ♦ కెల్ల లయాంతకుఁడో యనంగ దు
ర్మదపరిపంథిసంచయ వి ♦ రాముఁడ రాముఁడ వచ్చినాఁడ న
న్నెదిరి జయంబు గైకొను మ ♦ హీనబలుండవయేని చూచెదన్॥

(అప్పుడు గదద్రిప్పుచు విభీషణుఁడు ప్రవేశించును.)

కుంభ—(విభీషణునితో) తమ్ముఁడా! విభీషణా! రామచంద్రు నాశ్రయించి నీవెంతయు ధన్యుండవైతివి. నీవాతనికరుణచే దానవవంశబీజ మంతరింపకుండ లంకఁ బాలింపఁగలవు. మేమెట్లును పాతకవర్తులమై మడియనున్నాము. ధర్మతత్పరమతివగు నీయెడ దైవము ప్రసన్నుఁడై యుండి సదా నిన్నుఁ గాపాడుఁగాక! నీకుసకలశ్రేయము లొదవుఁగాక!

విభీష—అన్నయ్యా! నీకు పగతుండగు రామునిం జేరినకతమ్మున నిన్నుజూచి సంభాషింప లజ్జించుచున్నాఁడ. ఐనను నిది నాబుద్ధిపూర్వముగఁగోరి చేసినది కాదు. సీతనిమ్మని నేనెంతచెప్పినను వినక,

తే॥ గీ॥ నిండుకొలువునఁ బంక్తిము ♦ ఖుండు నాఁడు
కాలదన్నిన కతన నీ ♦ లీల మిమ్ముఁ
బాసి వచ్చితి ననుచితం ♦ బనుచు నాత్మ
నెఱిఁగియుఁ బరాభవాగ్ని స ♦ హింపలేక॥

కుంభ—నీవనుచితకార్య మొనరింపలేదు. నీనీతివర్తనంబున కేనెంతయు సంతసించి

తిని. నాయనా! నీవు మనవంశము నిలుపవలసినవాఁడవు కావున నాతో యుద్ధముచేయక తొలఁగియుండి చూచుచుండుము. (వానరసేనాభిముఖుఁడై) ఓరీ! మర్కటాధములారా! పాఱిపోక నిలువుఁడు, మీమదమడంచెదను. (వానరులపైఁ బడబోవును.)

రాము—దానవాధమా! నిలువుము. నేనుండ వారిపై కెట్లు పోఁగలవు. ఘోరాశనిసంకాశంబులగు నాబాణంబు లివిగోఁ దప్పించుకొనుము. (బాణములు విడుచును)

కుంభ—(నవ్వుచు) నీ బాణము లేమైనవో చూచితివా?

రాము—(స్వ) ఔరా! ఈ నిశాటునిసత్త్వ మెంతయుఁ గొనియాడఁదగినది.

తే॥ గీ॥ అతిభయంకర విలయకా ♦ లాభ్రముక్త
ఘోరనిర్ఘాతతుల్య మ ♦ త్యుగ్రశరము
లంబునిధి డిందు జలధార ♦ లట్లు వీని
యొడలియందు యడంగుచు ♦ నున్న వహహా!॥

(ప్ర) ఓరీ! ఈ వాయవ్యాస్త్రమున నీ దక్షిణకరంబు ఖండించివేసెదఁ జూడుము. (అట్లుచేయుచున్నాడు.)

కుంభ—(కోపముతో) రే నరాధమా! నిన్నంతకునిచెంత కంపెదనుండుము. (ఎడమచేతితో నొక వృక్షమునుబెఱికి రామునిపై గదియుచున్నాఁడు.)

రాము—దైత్యాధమా! ఈ యైంద్రాస్త్రమున నీ రెండవభుజముగూడఁ దునిమెదవీక్షింపుము. (కుంభకర్ణుని వామహస్తముగూడ నఱకును.)

కుంభ—(భూమిపైబడి పొరలుచున్నాఁడు.)

(వానరులు కుంభకర్ణునిక్రిందఁబడి నలుగుచున్నారు.)

రాము—(స్వ) ఇప్పు డీయామ్యాస్త్రమున నీ దనుజాధముని శిరచ్ఛేదన మొనర్తుఁగాక. (అట్లుచేయును.)

వానరులందఱుఁ గరతాళధ్వనులు చేయుచున్నారు.)

(తెరవాలును.)

---

(8 రంగము.)

ఇంద్రజిత్తు సీతను జుట్టుపట్టి యీడ్చుచుఁ బ్రవేశించును.)

ఇంద్ర—ఓ పాపాత్మురాలా! మృత్యుదేవతవలె మా లంకకు నీవెక్కడ దాపురించితివే? (అని కొట్టుచున్నాఁడు)

సీత—(ఏడ్చుచు) హా! రామచంద్రా! హా! సౌమిత్రీ! హా! వాయుతనయా! హా! కపులారా! నన్నీ దురాత్ముఁడు బాధించుచున్నాఁడు. రండు రండు. విపద్గ్రస్తయగు నీ దీనురాలిని గాపాడి పున్నెముఁ గట్టుకొనుఁడు.

ఆంజ—(ప్రవేశించి) హా! కఠినకర్మా! ఎంతసాహసమునకుఁ బాల్పడితివిరా! ఓరీ! నీచుఁడా! సాధ్వియగు నీ సీతామహాదేవి నిట్లేల బాధించెదవు, విడువుము. పౌరుషంబున్న నాతో ననిసేయుము.

సీత— ఓ యాంజనేయా! నీవైన నీదుష్టుని వధించి నన్ను విడిపింపుము. (ఏడ్చుచున్నది).

ఇంద్ర—ఛీ! నోరుమూసికొనుము.

ఉ॥ పాతకురాల! నిన్నుఁగొని ♦ వచ్చుట రాక్షసవీరులెల్లరకా
గాతుకలైరి కోట్లు కద ♦ నస్థలమందటుగాన నీయెడకా
జేతమునందు జాలివిడి ♦ చెండెద నీదుశిరమ్ముఁ దక్కపి
వ్రాతము రామలక్ష్మణులు ♦ వందుర నిఁదఱమోర్లిఁ జూడుమా॥

(సీతను ఖడ్గముచే నఱుకుచున్నాఁడు.)

ఆంజ—(కన్నులుమూసికొని) హా! చూడఁజాల. చూడఁజాల. కార్యముమించిపోయినది. అక్కటా! దైవమా! తుద కీపతివ్రతాతిలకము నెట్టిమస్మరణము పాలుచేసితివి. (ఆగ్రహముతో) రే! దైత్యాధమా! ఇంతపనిఁజేసిన నిన్నుఁక బ్రతుకనిత్తునా? నిలువుము. (ఇంద్రజిత్తుపై గవియును.)

ఇంద్ర—(పాఱిపోవుచున్నాఁడు.)

ఆంజ—ఓ వానరవీరులారా! రండు రండు. క్రూరాత్ముండగు వీని నంతకునిచెంతకంపుదము.

(వానరులందఱు నింద్రజిత్తువెంటఁ బరుగెత్తుచున్నారు.)

(యవనిక జాఱును.)

---

(9 రంగము.)

రాము—(దుఃఖముతోఁ బ్రవేశించి)

ఉ॥ హా! నళినాస్య! హా! జలరు ♦ హాయతలోచన! హా! సుశీల! హా!
సూనసమాంగి! హా! భువన ♦ సుందరి! హా! గజరాజయాన! హా!
మానితసాధ్వి! హా! గుణస ♦ మంచిత! హా! యలినీలవేణి! హా!
జానకి! క్రూరుఁడై యొక ని ♦ శాటుఁడు నిన్ దుదముట్టఁజేసెనే!॥

(మూర్ఛిల్లును.)

లక్ష్మ—(దుఃఖముతోఁ బ్రవేశించి) హా! పాపిదైవమా! మాకెన్నియిక్కట్టులఁ గూర్చుచున్నావు! అక్కటా! ధర్మమార్గావలంబనము జయాస్పదమనియును శుభంకరమనియు నార్యులు వచింతురుకదా? అది రిత్తయయ్యెనే? నిరంతర ధర్మాచరణపరాయణుండైన యీ రాజశేఖరునకు, జనకునాజ్ఞఁ బాలింప రాజభోగములన్నియుఁ ద్యజించి పత్నీసహితుఁడై కానలకువచ్చిన యీ సత్య శీలున కిట్టియాపద రాఁదగునా?

రాము—(లేచి) హా! ప్రేయసీ! హా!సీతా! తుదకు నీ వెంతదిక్కుమాలినదాన వై మడ సితివి. నీ కైకదా వాలినిసమయించి సుగ్రీవునితో సఖ్యంబువాటించి వానరసేన లంగూడి జలరాశిబంధించి యనేకదానవుల వధియించితిని. నాయీకష్టమంత యు నడవిపాలు చేసిపోయితివా? నీకప్పుడే నూరేండ్లునిండెనా? హా! నేనింకఁ బ్రాణము లెట్లుభరింతును?

విభీషణుడు—(ప్రవేశించి) ఏమిది వింతగానున్నది. ఈరామసౌమిత్రులు శోకార్తులై యున్నవారు. హేతువు దెలిసికొందుఁగాక. (ప్ర) పూజ్యులారా! మీవిచార మునకుం గారణమేమి?

లక్ష్మ—హా! పౌలస్త్యా! ఇంకేమున్నది. సర్వమును ముగిసినది. జగత్పావనయగు సీత కుఁ దుదకెంతగతి పట్టినదో చూడుము.

ఉ॥ ఏసతికై కపిప్రవరు ♦ లెల్లరు దుర్ఘటసేతుబంధనా
యాసపరిశ్రమంబునకు ♦ నాదటనోర్చిరో? యే సుసాధ్వికై
యాసురకోటులన్ వెస ర ♦ ణావని గూల్చుచునున్నవారమో,
యాసతి నింద్రజిత్తుఁడు ఖ ♦ లాత్మకుఁడై వధియించె నేమనన్॥

విభీ—ఏమేమి? ఆదుష్టుఁడంతపని చేసియున్నాఁడా? (యోజించి) కాదుకాదు. ఇది యంతయు నామాయకుసికృతిమము.

రాము—అయ్యో! విభీషణా! కనులార నాంజనేయుఁడు చూచివచ్చినదానిని కృత్రిమమందువేమి? ఈ నిర్భాగ్యుని కంతటియదృష్టమా!

విభీ—దేవా! ఇది నమ్మఁదగని వృత్తాంతము.

తే॥ గీ॥ సీతఁ బూతచరిత్రిన ♦ ప్రాతకుండు
పట్టిత్రుంచుటె నిజమైన ♦ వానిశిరము
కోటిశకలంబులై భువి ♦ గూలకున్నె?
నిప్పుఁ జెదలంటునే? యువ ♦ నీతలేంద్ర!

ఇప్పు డద్దురాత్ముఁడు జయాభిలాషియై నికుంభిలయం దొనరింపఁబోవు హోమము నిర్విఘ్నముగ సాగుటకై యాపన్నగడఁ బన్ని మాయాసీతను వధించి మిమ్ము భ్రమింపఁజేసియున్నాఁడు. ఇంతియె గాని సీతామహాదేవి కేయపాయంబును గలుగలేదు. రాక్షసమాయలు కడునద్భుతములు. కావున మీ రిప్పుడు చింతఁదక్కి శీఘ్రమ్మున లక్ష్మణుని సైన్యయుతుంజేసి హోమవిఘ్న మొనరించి యాఖలుని వధింపబంపవలయును. కాకున్న మోసము వాటిల్లగలదు.

రాము—నిశాచరాగ్రణీ! నీవు నిజముగ మాకుఁ బ్రాణదాతవుసుమీ! నీ వీవృత్తాంతము వివరించిచెప్పకున్న నేనీపాటి కేపాటుఁజెందియుందునో? (లక్ష్మణునితో) తమ్ముఁడా! నీవిఁక శీఘ్రమునఁబోయి యాకుటిలుని మదమడంచిరమ్ము.

లక్ష్మ—మహాప్రసాదము.

రాము—సోదరా! ఒకమాట. ఇంద్రజిత్తు నల్పదానవులలోఁ బరిగణించి యజాగ్రతగ మెలంగెదవుసుమీ!

తే॥ గీ॥ అతులబలశాలి; మాయకుఁ, ♦ డతిసమర్థుఁ
డభ్రమండలమునడాఁగి ♦ యనియొనర్చు
దురములందు సురాసుర ♦ దుర్జయుండు
మేఘనాదుండు వానినె ♦ ట్లెయివధింతొ?

కార్య మతిసమర్థుండవై నిర్వహించిరావలయును. నీ కాత్రిమూర్తులును నగ్నిదేవుండును సర్వభూతములును సకలనిర్జరులును జయంబొనఁగూర్తురుగాక! పోయిరమ్ము.

లక్ష్మ—మీయాజ్ఞానుసారము మెలఁగెదను. (అందఱు నిష్క్రమింతురు.)

(10 రంగము - రణభూమి)

(రథారూఢుఁడై యింద్రజిత్తును, నాంజనేయునిపై నధిష్టించి లక్ష్మణుండును ప్రవేశించుచున్నారు.)

లక్ష్మ—ఓరీ! దుష్టదైత్యుఁడా! మాయాసీతం జంపినట్లుకాదు. నిన్నిప్పుడు పాతాళంబున దూరినను విడువక సమయింప నీలక్ష్మణుం డేతెంచియున్నవాఁడు. పౌరుషంబుకలదేని చూపుము.

ఇంద్రి—ఓరీ! నాగపాశబద్ధుండవై పడియున్ననాఁడు నీ యీప్రతాప మేమయ్యెను? సిగ్గులేక యింకను ప్రగల్భములాడెదవా?

తే॥ గీ॥ భయము లేకిట్లు నోటికి ♦ వచ్చినట్లు
లేల బీరము లాడెద ♦ వాలమందుఁ
జటుల శౌర్యజితస్వర్గ ♦ సమరభర్గ
నన్ను నెదిరించు శూరుఁడెం ♦ దున్నవాఁడు?

ఈకుబేరాస్త్రము నిన్నేమిచేయునో చూడుము.

(అస్త్రము ప్రయోగించుచున్నాఁడు.)

లక్ష్మ—ఈయామ్యబాణము దానినినడుమనే నిర్జించుఁగాక! (బాణము ప్రయోగించును.)

ఇంద్రి—(స్వ) ఆహా! యీతనిబల మతివర్ణనీయము.

లక్ష్మ—(కోపముతో) ఓరీ! లోకకంటకా! నీవొనర్చిన యపకృతికి నాయొడలు మండుచున్నది.

తే॥ గీ॥ ఆహవంబునఁ బటుశక్తి ♦ నస్మదీయ
భయదకోదండనిర్ముక్త ♦ పటుశరాగ్ని
నోలి నినుదున్మి గృధ్ర, కా ♦ కోల, జంబు
కాళిఁదన్పుదు నీమాంస ♦ ఖండములను॥

ఇంద్రి—ఛీ! ఛీ! నోరుమూసికొనుము. నిర్జరసేనాసముద్రబడబానలుండనగు నన్ను నీవా వధించువాఁడవు?

లక్ష్మ—(ఆగ్రహముతో) ఓరీ! జగదపకారివగు నిన్నింక నుపేక్షింపరాదు. ప్రళయకాలజీమూతసముత్పన్న ఘోరనిర్ఘాతనిష్ఠురంబగు బాణము ప్రయోగించుచున్నాఁడ. దీన నీపొగ రడంగఁగలదు.

ఉ॥ రాముఁడు శాత్రవవ్రజవి ♦ రాముఁడు ధర్మరతుండయేని, ఆ
భూమిజ సత్యశీలయును ♦ బుణ్యచరిత్రియునేని, యిద్ది స
ర్వామరకోటికిన్ విహిత ♦ మై తగు కార్యమయేని, వేగ నా
యీమహనీయబాణ మొగి ♦ నీతనిశీర్షముఁ ద్రుంచుఁగావుతన్॥

(బాణము ప్రయోగించును.)

ఇంద్ర—హా! (అని తల తెగి పడిపోవును.)

(యవనిక జాఱును)

---

(11 రంగము: రావణునిగృహము)

రావ—(దుఃఖముతో ప్రవేశించి) హా! సుతా! మేఘనాదా! న న్నెంతయన్యాయ ముచేసి పోయితివి?

సీ॥ అమరులదోశ్శక్తి ♦ నాజినిర్జించిన
నీచండతేజ మే ♦ నీటఁగలసె?
శక్రాదులగు దిగీ ♦ శ్వరులఁదోలిన నీదు
చటులసాహసమెందు ♦ సమసిపోయె?
కాలకేయాదుల ♦ నాలమం దడఁచిన
యట్టినీబలిమి యే ♦ యగ్గిబ్రుంగె?
గడగడ మమ్మార్తు ♦ లడలంగఁజాలు నీ
యెనలేనిశౌర్య మెం ♦ దింకిచనియె?
తే॥ గీ॥ కడిమి జగముల జిచ్చఱ ♦ పిడుగుభంగి
నడరి సత్కీర్తి దశదిశ ♦ లందునించి
అక్కటా! తుదకిట్లొక ♦ యధముఁడైన
నరునిచేఁజిక్కి యనిఁగూలి ♦ నాఁడవయ్యె॥

నా కా పాడుసీత యెక్కడ దాపురమయ్యె. మహామారి యనఁదగు నీ పాపురాలికతమ్మున లంకయంతయు నాశనమగుచున్నదిగదా?

తే॥ గీ॥ సీత నేచెడువేళ దె ♦ చ్చితినొ గాని
యాచెనటి లంకఁజొచ్చిన ♦ దాదిగాఁగ
నతిబలసమగ్రులైనట్టి ♦ యసురవరుల
కపజయము వృద్ధిగనె; జయం ♦ బరిదియయ్యె॥

(కోపముతో సీతనుద్దేశించి) ఓసీ! దుష్టురాలా! సీతా! కులోద్ధారకుండగు నాతనయుని నీపొట్టను బెట్టుకొంటివిగదే! నిన్నిప్పుడే నాయీఖడ్గమున కెర గావింతుఁ జూడుము. ―――――― (నిష్క్రమించును.)

(12 రంగము: అశోకవనము)

సీత―(స్వ)

ఉ॥ ఎన్నఁటి కింక నాదుహృద ♦ యేశుఁడు దానవులఁ వధించి యు
త్పన్నతిఁ బంక్తికంధరుని ♦ సంగ్రరణంబున నేలఁగూల్చుఁ? దా
నెన్నఁడు నన్నుఁ గైకొని యు ♦ హీనగతిఁ సుఖయించునంచు నే
నెన్నుచునుంటి సంతత మిఁ ♦ కెప్పు డభీష్టము సిద్ధిఁబొందునో॥

రావ―(అగ్రహముతోఁ బ్రవేశించి)

తే॥ గీ॥ నాకుఁ బ్రియసుతుండగు మేఘ ♦ నాదుఁ డాజి
నీ చెడుగుసీతకతమున ♦ నీల్గెఁగాన
నస్మదీయనిశాత ఘో ♦ రాసి దీని
కుత్తుకనుగోసి కసిదీర్చు ♦ కొందుఁగాక॥

(నఱుకఁబోవును.)

సుపార్శ్వుఁడు―(శీఘ్రముగవచ్చి నివారించి ఖడ్గముఁబట్టుకొని) రాజా! శాంతింపుము. శాంతింపుము. త్రిలోకశూరుండవగు నీ వాడుదానిని వధింపవచ్చునా? ఇది యెందైన వీరధర్మమా! నీ వంటివాఁడు లోకనిందకుఁ బాలుగాఁదగునా? అయ్యయో! ఇది యెంతయపకీర్తికిమూలము? ఆఱునెలలుసాముసేసిమూలనున్న ముసలమ్మ నోడించినట్లు నీ మహాశౌర్య మీయబలపైనా చూపుట? వలచితెచ్చినకాంత నెట్లైనఁ జేపట్టి సుఖించితీఱవలయుఁగాని యిట్లు త్వరపడి వధించినచో నీవుపడిన ప్రయాసముసకంతకు నేమిఫలముండును? కావున నింతటితో నీ వాగ్రహవిముక్తుండవై మగంటిమికలదేని రామలక్ష్మణులపైకి నీవు స్వయముగా యుద్ధమునకు బయలుదేఱి కసిదీఱ శత్రువుల నిశ్శేషముగఁ బొలియించి జయంబుఁగైకొమ్ము. అప్పు డీసీత తనంతటదానె స్వయముగ నిన్నుఁ జేపట్టునో లేదో చూచెదను.

రావ―సుపార్శ్వ! నీవుచెప్పినది బాగుగనున్నది. ఇప్పుడే రణమునకు వలయు సన్నాహ మొనరించెదను.

(నిష్క్రమింతురు.)






## షష్ఠాంకము

(ప్రథమరంగము.)

[మూర్ఛితుఁడైన లక్ష్మణునిశిరముఁ దొడపైనుంచుకొని రాముఁడు దుఃఖించుచుండును.]

(ఆంజనేయుఁడుతక్క తక్కినవా రుందురు.)

రాముఁడు—(దుఃఖముతో) హా! సోదరా! నిన్నా దశకంఠహతకుఁ డెంతపనిఁ జేసెను. అయ్యయో! యిట్లగునని యొక్కనాఁడును స్వప్నావస్థయందైనఁ దలంచి యుండనుగదా! అనుజా! నన్నేమిచేసిపోయితివి? నాపై నింతయలుకేల? నా యెడఁగల భక్తియంతయుఁ బోవిడచి యిట్లేల మైమఱచి రణభూమిని నిద్రమునింగి యున్నాఁడవు?

సీ॥ 'పుత్త్ర' 'పుత్త్ర' యని ♦ పొగులునీజననికి
చెడువార్త నేమని ♦ చెప్పవాఁడ?
కన్నీరు మున్నీరు ♦ గానేడ్చు నూర్మిళా
తరుణి నెబ్భంగి నో ♦ దార్చువాఁడ?
భరతశత్రుఘ్ను లా ♦ తురత నిన్నడఁగోర
నేమనియుత్తరం ♦ బిచ్చువాఁడ?
నినుఁగూర్చియడుగ వ ♦ చ్చిన పురప్రజలతో
సిగ్గేది యెట్లుభా ♦ షించువాఁడ?
తే॥ గీ॥ రక్తసిక్తాంగమునఁబెను ♦ శక్తిఘాత
నవనిఁబడియున్న నినుఁగాంచి ♦ నవ్వుదెల్ల

మొదనుబుకు శోకమెట్లు భ ♦ రించువాడ
తమ్ముఁడా! యెట్లుప్రాణముల్ ♦ దాల్చువాఁడ?

సుగ్రీ-విభీ—దేవా! ఊఱడిల్లుఁడు. ద్రోణగిరికి సంజీవిఁ దేఁబోయిన వాయుతనయుం డీపాటికి సమీపమునకే వచ్చియుండును. లక్ష్మణుం డిప్పుడే తెలివొందఁగలఁడు.

రాము—భానుతనయా! ఇంకెక్కడి లక్ష్మణుఁడు? అయ్యయ్యో! అప్పుడే తూర్పుదిశ తెల్లవాఱుచున్నది! ఆంజనేయుం డింకను రాఁడయ్యె. అదిగో! భానుబింబము గూడ వెడలఁబోవుచున్నది. అన్నా! యీసూర్యభగవానునకుఁగూడ నిజకుల సంజాతులమగు మాపైఁ గరుణలేదుగదా! ఔరా! వీరి నింకఁ బాప మన వచ్చునా? (ఆగ్రహముతో) ఓరీ! చండకరా!

మ॥ రిపుఘాతన్ పెనుమూర్ఛచే ననుజుఁ డు ♦ ర్విన్ గూలియుండంగ నీ
వపుడే పుట్టిమునింగినట్లు దురితా ♦ త్మా! వచ్చుచున్నాఁడ, వీ
కపటోద్యోగమెఱింగినాఁడ నిఁక నీ ♦ గర్వంబుసర్వం బు మ
ద్విపులాఖండధనుర్విముక్తవిశిఖా ♦ భీలాగ్నిదూలించెదన్॥

(బాణము నెక్కువెట్టుచున్నాఁడు.)

సుగ్రీ-అంగ—ఓమహాత్మా! శాంతింపుము. శాంతింపుము. ఇంత దారుణకృత్యము తగదు. ఒకనికై లోకములన్నియు సంహరింపఁజూచుట పాడిగాదు.

జాంబవం—రాజేంద్రా! వాయుతనయుండు ద్రోణాద్రిగైకొని వచ్చుచున్నాఁడు. ఆకనుపట్టునది దివ్యౌషధతేజముగాని భానుతేజముగాదు. నీవింక నాగ్రహంబువదలి దుఃఖముమాని యుండుము.

రాము—ఏమి! నా కంతభాగ్యము పట్టునా? నాతమ్ముఁడు మరల నాకు లభించునా?

ఆంజనేయుఁడు—(ద్రోణాద్రితో ప్రవేశించి) రామచంద్ర! ద్రోణగిరియం దౌషధములు కానరామి నప్పర్వతముం బెకలించి తెచ్చితిని. నడుమ నాకుఁ గొన్ని విఘ్నములు గలుగుటచే నింతజాగయ్యె. కోపింపకుఁడు.

ఉ॥ ఏనటు ద్రోణశైలమున ♦ కేఁగుటెఱింగి దశాస్యుపంపునన్
దానవులెందఱో నను ను ♦ దగ్రగతిం జననీక యడ్డమై
రా ననిఁదున్మించి, యాజిగిరి ♦ రక్షకసేన నదల్చి వచ్చితిన్
గానఁ దడర్థమేఁ దడయఁ ♦ గా వలసెన్ క్షమియింపు భూధవా!

రాము—మారుతీ! ప్రాణదాతవగు నీవునన్ను క్షమాపణ మడుగవలయునా? నీవొనరించిన యీయుపకారము జన్మాంతమువఱకు మఱపునకు వచ్చునా?

సుగ్రీ—మామా! సుషేణా! నీవింక నీయద్రిపైఁగల సంజీవకరణిని వెదకితెచ్చి సౌమిత్రిని సప్రాణునిఁగఁజేయుము.

సుషే—మంచిది. (అని అట్లుచేయుచున్నాఁడు.)

(లక్ష్మణుఁడు లేచుచున్నాఁడు.)

రాము—(తమ్ముని కౌఁగిలించుకొని) సోదరా! రావణశక్తింబడిన నీవీయాంజనేయుని కరుణచే సంజీవకరణిప్రభావమునఁ బునర్జీవితుఁడవై నాశోక మపశమింప జేసితివి. (ఆంజనేయునితో) పావనీ! మావంశము నుద్ధరించిన నిన్నేమని కొనియాడఁగలను! నీవు మాకెన్నియేని మహోపకారము లొనర్చితివి.

చ॥ ధరణిజఁ బాసి శోకమునఁ ♦ దద్దయు నేను మునింగియుండ భా
స్కరసుతుతోడి నెయ్యమును ♦ సంఘటియింపఁగఁజేసి యంత స
త్వరగతి సీతజాడను ము ♦ దంబునఁ దెల్పితి విప్డు సోదరుఁ
గరుణ సజీవుఁజేసి తన ♦ ఘాత్మ! భవదృణమెట్లుతీర్తునో॥

పావని! నీవింక నీద్రోణశైలము నెప్పటిచోట డించిరమ్ము.

ఆంజ—చిత్తము. (ద్రోణాద్రినెత్తుకొని నిష్క్రమించును.)

(యవనిక జాఱును.)

---

(2 రంగము: రావణుని గృహము.)

రావణుఁడు—(విచారముతో ప్రవేశించి) హా! హా! నాయుదంతంబు దలంచిన గుండెలు బ్రద్దలైపోవుచున్నవిగదా!

సీ॥ అరిగజంబులకు సిం ♦ హస్వప్నమైతోఁచు
    నతిబలుం డక్షయుం ♦ డాజిమడసె
జగము లన్నియుమ్రింగి ♦ సరవిఁ ద్రేపఁగఁజాలు
    కుంభకర్ణుం డనిఁ ♦ గూలినాఁడు
దేవతలను ముప్పు ♦ తిప్పలు వెట్టిన
    యింద్రజిద్ఘనుఁడును ♦ నేఁగె దివికి
అతికాయ, కుంభ, ధూ ♦ మ్రాక్షాదులగు మేటి
    బల్లిదుల్ ప్లవగుల ♦ వాతఁబడిరి
తే॥ గీ॥ యుద్ధనిపుణుండును గుశాగ్ర ♦ బుద్ధియైన
యనుజుఁడారీతిఁ బగవారి ♦ యుందుఁ జేరె

నింకనా కేటి కడియాస? ♦ యేటివిజయ
మెక్కడిప్రభుత్వ? మీలంక ♦ యేలదక్కు॥

ఉ॥ తమ్ముఁడు మేలుఁగోరి విహి ♦ తమ్ములు నాఁడటుపల్క నాదుచి
త్తమ్మున కెక్కమికి నిజప ♦ దమ్మున నాగ్రహమంది కొల్వుకూ
టమ్మునఁ దన్నిఁ బుచ్చితిక ♦ టా! కలుషాత్ముఁడ మందబుద్ధి నిం
కెమ్మెయి రామలక్ష్మణక ♦ పీంద్రుల నాహవభూమిగెల్తునో॥

ఉ॥ ఎవ్వరు నాకుదిక్కు? తెరు ♦ వెయ్యది? యోజి జయంబొసంగ నిం
కెవ్వరి వేఁడువాఁడ? మది ♦ నేమియుఁ దోఁపదు నేటి కక్కటా!
గర్వముఁగూడ నిట్లుగొఱ ♦ గానయితిన్; రణభూమి నాతలల్
ద్రెవ్వఁగనేయ కి కరణ ♦ ధీరుఁడు రాముఁడు మిన్నకేఁగునే?॥

భార్గవానుమతంబున యజ్ఞమొనర్ప సమకట్టి దీక్షాబద్ధుఁడనై యుండ నెవ్వరో చెప్పినట్లు నారహస్యస్థలము నెఱిగివచ్చి దుష్టవానరులది విఘ్నముఁ జేసిరి. ఈ క్రొత్తగుంపు కు దానవమర్మములన్నియు నెట్లు తెలియుచున్నవో తోఁపదు. (యోజించి) ఇందుల కావిభీషణహతకుఁడే మూలము! ఆదుర్మార్గు నాదినమున యమాలయంబున కంపియే యుందును గాని ప్రహస్తుఁ డడ్డమువచ్చుటచే బ్రతికిపోయెను. అట్లుజరిగియేయున్న నాలంకకింత చేటు మూఁడియుండదని తలంచెదను. ఓహో! నేనుపారఁబడి బుద్ధిమంతుఁడగు విభీషణు నకారణముగ నిందించుచున్నాఁడ. ఇందెవ్వరిని నిందించిననూ లాభములేదు. క్షేమంకరంబులును సుధాతుల్యంబులును నగు సోదరుని నీతిబోధనములు విషప్రాయములుగను కర్ణశూలంబులుగను దోపించి సర్వనాశనమగువఱకును నన్నువదలని నామూర్ఖతను నేనునిందించుకొనవలసియున్నది. అన్నన్నా! యీరణంబున నెన్నిభద్రగజంబులు హతములైనవి! ఎన్ని మహాసైంధవములు నేలపాలైపోయినవి! ఎన్నిమణిస్యందనములు నుగ్గయినవి! ఎందఱు సుప్రసిద్ధులగు దైత్యభటులు స్వర్గస్థులైరి?

మఱియు,

తే॥ గీ॥ చుట్టములు, నాప్తవశ్యులు, ♦ సుతులు, హితులు,
సర్వబలములు నరులచే ♦ సమసిపోవ
బర్ణశాఖావిహీనమౌ ♦ పాదపంబు
పగిది జీవచ్ఛవంబన ♦ బ్రతికియుంటి.

నేనిప్పు డేమిచేయుదును? సితను రామునకర్పించి యింతటనైన సుఖముగ లంకనేలుకొందునా? ఛీ! ఛీ! సర్వశూన్యమై పుత్త్రమిత్త్రామాత్యాదిహీనమై

పాడువాఱియున్న యీలంక నాకేల? మఱియేమిచేయుదును? (ఆలోచించి) ఓహో! నాకింక విచారమేల? రాముఁడు విష్ణుదేవుండనియును సీత లోకమాతయనియును వానరులు నిర్జరులనియును నెఱింగియు మహాత్ముండగు నయ్యినకులావరేణ్యునిచేఁ బొలియఁదలంచియేకదా చేసేఁత నేసిట్లు చేయుచుంటిని! నాయభీష్టము సిద్ధించినది. నేనిప్పుడే రణసన్నద్ధుండనై బయలుదేఱిపోయి రామశరాగ్నిసాక్షిగ ముక్తికాంతాకరగ్రహణ మొనరించి తదీయ శాశ్వత నిరుపమసౌఖ్యానందజలరాశి నోలలాడెదఁగాక. (నిష్క్రమించును)

---

(3 రంగము: యుద్ధభూమి)

(రామ లక్ష్మణ విభీషణులు, సుగ్రీవాది వానరులు ప్రవేశింతురు)

(తెరలోఁ గలకలము)

రాము—ఆలకించి ఆకలకల మేమైయుండును? (దృష్టిసారించి) ఓహో! మనపైకి నిశాచర సేనలువచ్చుచున్నవి. తమ్ముఁడా! అటుచూడుము.

ఉ॥ చీఁకటి మ్రాఁకులోయనఁగఁ ♦ జెన్నగు కాటుకకొండలుంబలెన్
వీఁకఁ గరంబులన్ నిశిత ♦ నిష్ఠురఖడ్గశరాదిసాధనా
నీకములన్ ధరించి సమ ♦ రేచ్ఛఁ బ్రగల్భములాడికొంచిదే
భీకరభంగి దైత్యభట ♦ వీరులు వచ్చి రుదగ్రశౌర్యులై॥

లక్ష్మ—అదిగో శాత్రవు లప్పుడే సమీపమునకు వచ్చినారు.

రాము—తమ్ముఁడా! ఈచతురంగబల మెట్లున్నదో కనుము.

సీ॥ ధూర్జటి నాజి వి ♦ స్ఫూర్జిత భుజశక్తి
నిర్జింతుమను పూర్వ ♦ నిర్జరులును
కొండలనైన ను ♦ ద్దండత డీకొను
దండియేనుఁగుగున్న ♦ తండములును
మేటిధారావేగ ♦ పాటవంబున దిశల్
దాఁటి నీటునుగొల్పు ♦ ఘోటకములు
అ. దంబులై సుర ♦ మందిరంబును నవ్వి,
నిందించు సుందర ♦ స్యందనములు
తే॥ గీ॥ భట పదాఘాత ఘన రథ ♦ చటులనేమి
పటు హయఖురాగ్రనిర్ఘాత ♦ పాంసుపటల

కల్పితానల్ప గాఢాంధ ♦ కారభరిత
భూనభోంతర మీవైరి ♦ సేనఁగంటె?

ప్లవంగపుంగవులారా! మీపరాక్రమంబున మీరుండుఁడు.

సుగ్రీ—ఓ వానరయోధులారా! మీమీ యవక్రపరాక్రమంబు లిప్పుడు సంపూర్ణముగఁ జూపవలయును.

లక్ష్మ—సుప్రసిద్ధబలసమగ్రులగు నోకపిశ్రేష్ఠులారా! మీకుఁ జెప్పవలసిన యవసరము లేదు. కాని యిటువినుఁడు.

క॥ వెఱవకుఁ డాహవభూమిని
పరుగెత్తకుఁ డజుఁడు హరుఁడు ♦ వచ్చికదిసినన్
బోరిఁగొనుఁడు వైరివీరుల
నఱకుం డోగిఁ జెఱకుగడల ♦ నఱకినకరణిన్॥

శాశ్వతంబగు యశంబుసంపాదింప నిదియెయదను. సుగ్రీవా! మనమందఱము ముందునడచి వైరులం దాఁకుదము రమ్ము.

(రాముఁడుతక్క తక్కినవారందఱు నిష్క్రమింతురు.)

రాము—వానరవీరు లప్పుడే దానవులఁ గదిసి యమోఘముగఁ దరుశిలావృష్టి గురిపించుచున్నారు. పోరు ఘోరమైనది. చూచుచుండఁగనే వేనవేలు దానవసైన్యములు నేలపాలైనవి. అదిగో దశముఖుండు ప్లవంగుల నందఱఁ దప్పించుకొనుచు నాకడకు వచ్చుచున్నాఁడు. రానిమ్ము. వీనిమద మడంచెదఁగాక.

రావ—(రథారూఢుఁడై ప్రవేశించి రామునితో)

తే॥ గీ॥ ఓరి! నీపాలికాలుని ♦ యోజని దిగో (జచ్చియు—కాదుకాదు.)
వచ్చియున్నాఁడ మరణంబు ♦ వలతువేని
రమ్మనికిఁ, గాక బ్రతుకద ♦ లంతువేని
మగువ నాకిచ్చి సేనతో ♦ మరలిపొమ్ము॥

రాము—(కోపముతో) ఓరీ! నిశాచరాధమా!

క॥ దుడుకుఁదనంబున సీగతి
గడుకావరమూని పేలఁ ♦ గాఁజొచ్చితి; ని
న్నడిదమునఁగోయ కిఁక నే
విడువను హరుఁడడ్డమైన ♦ వేల్పులుడిఁగడిమిన్॥

రావ—ఛీ! నరాధమా! నీ వీసంగరేచ్ఛ విడువుము. ఎందరెందఱో మహావీరులు సమరరంగంబున మదీయప్రతాపాగ్నికి శలభాయమానులై స్వర్గసుఖము లనుభవించుచుండిరి. నీకును నట్టిగతి పట్టును. తెలివిదెచ్చుకొనుము.

ఉ॥ లీలను మేరువున్ దగరు ♦ డీఁకొనఁగోరినమాడ్కి నేఁడు న
న్నాలమునన్ వెసన్ గెలువ ♦ నాత్మఁదలంచుచు నున్నవాఁడ వో
బాలిశ! నీవు దండధర, ♦ పావక, వాసవ, మారుతాది ది
క్పాలురకన్న నుగ్రరణ ♦ పాండితి నంత మహాఘనుండవే॥

రాము—రాత్రించరాధమా! ఎన్నఁడో దిక్పాలుర జయించితినని త్రుళ్ళిపడకుము.

మ॥ బలగర్వంబున విఱ్ఱవీగి మునులన్ ♦ బాధించి శక్రాద్యమ
ర్త్యుల గాఱించుటకాదు కన్గొనుము మ ♦ త్క్రోధాగ్ని నీయుగ్ర దో
ర్బలసారంబు హరించి నీపదితలల్ ♦ బ్రహ్మాండభీమంబుగా
నిలపైఁగూల్చెద దాటిపండ్లవలె నీ ♦ వెచ్చోటునన్ డాఁగినన్॥

రావ—ఏమిరా! నీవా నాతలలు గూల్చువాఁడవు?

ఉ॥ నీచుఁడ! నీశరావళి న♦నింబడ నల్ల ఖరుండగాను, మా
రీచుఁడగాను, మోసమొన ♦ రించి వధింపఁగ వాలిగాను, నా
రాచశిఖాళిఁగీశుల ధ ♦ రాస్థలిఁగూల్చి రణంబునందు నీ
పీఁచమడంతు నేనిపుడె ♦ భీతి నయోధ్యకుఁ బాఱవేనియున్॥

వాసవగర్వనిర్వాపణప్రవీణాఖర్వదోర్వీర్యధుర్యుండగు నీదశాస్యునిబల శౌర్యరణకౌశలాదు లెఱింగి మాటలాడుము. జాగ్రత!

రాము—ఓరీ! చోరుఁడా! నీప్రతాప మెవ్వరెఱుఁగరని చెప్పుచున్నాఁడవు.

సీ॥ కార్తవీర్యుఁడు నిజా ♦ ఖండబాహాశక్తి
మించి గర్వంబుదూ ♦ లించినపుడు
జనకజన్ వరియింపఁ ♦ జని గిరీశునివిల్లుఁ
బైవేసికొని లజ్జఁ ♦ బాఱినపుడు
లీలమై నవ్వాలి ♦ వాలాగ్రమునఁగట్టి
వంచించి జలధుల ♦ ముంచినపుడు
ఘనతరాస్మద్బాణ ♦ ఘాత కోర్వఁగఁజాల
కనిఁగాందిశీకుండ ♦ వైనయపుడు
తే॥ గీ॥ ఈప్రగల్భము లీశౌర్య ♦ మీబలంబు
నీ మహారణకౌశలం ♦ బెందుఁజనియె

చాలుఁ జాలును నోర్మూసి ♦ చనక నిలిచి
యేల తలయెత్తి ప్రేలెద ♦ విట్లు దుష్ట!॥

నీతివిహీనుండవును ధర్మదూరుఁడవును కుటిలాత్ముండవును నగు నీ దుష్ప్రవర్తనంబును, ననేక పరాజయములందిన నీబలంబును నేరికిఁ దెలియవు?

రావ—ఓరీ! జగదేకవీరుఁడనగు నాతప్పు లెన్నుచున్నాఁడవా? నీవంత ధర్మశాలివి నీతిశాలివి బలశాలివి కాఁబోలును!

సీ॥ అఘభీతిఁదోలి స్త్రీ ♦ హత్యకుఁ బాల్పడి
చానఁ దాటకఁ బట్టి ♦ చంపుటయును
అనుజుండు రాజ్యంబు ♦ గొని పురి వెడలింపఁ
బత్తితో గానకు ♦ వచ్చుటయును
సతిఁ గోలుపోయి దో ♦ స్సారంబు లేమినిఁ
జేసి భానుజు పంచఁ ♦ జేరుటయును
ఎదుట నిల్వఁగ భీతి ♦ చెదరి మ టునడాఁగి
కుటిలత నవ్వాలిఁ ♦ గూల్చుటయును
తే॥ గీ॥ నీమ ధర్మతత్పరతయు ♦ నీబలంబు
నీదు శౌర్యము నీ రాజ ♦ నీతిగుణము
నెల్లెడలఁ జాటుచుండంగ ♦ నింకఁ బరుల
నేల నిందించెదోరి సి ♦ గ్గేది చెనటి॥

(తెరలో)

ఓ దశకంధరరాక్షసేంద్రా! ఈహనుమంతుఁడు మన ఖడ్గరోమున నన్యాయముగాఁ జంపుచున్నాఁడు. రమ్ము రమ్ము.

రావ—(ఆలించి) ఇదిగోవచ్చితిని. కాలకేతూ! రథముఁ దోలుము.

కాల—చిత్తము. (రావణుఁడు రథముతో నిష్క్రమించును.)

రాము—ఓరీ! నేనుండ నీవెచ్చటికిఁ బోఁగలవు నిలువుము.

(రావణుని వెంట నిష్క్రమించును.)

(అప్పుడు మాతలి రథముతోఁ బ్రవేశించును.)

మాతలి—కేశవాంశసంభూతుండగు రామమూర్తి దేవహితముగఁ గ్రూరుఁడగు రావణునిఁ ద్రుంప సమకట్టి పేదమానవునివలె నేలపైనిలిచి పోరుచుండుటఁ జూచి మాస్వామియగు దేవేంద్రుఁడు తన రథసారథినగు నన్ను రామునకు

రథంబు గొనిపొమ్మని పంచె. నేనిప్పు డీయరదంబు నమ్మహాత్మునిచెంతకుం గొనిపోయి నేఁడు మదీయసారథ్యకౌశలంబును సంపూర్ణముగఁజూపి పేరు సంపాదించెదను.

(రథముతో నిష్క్రమించును.)

దేవేంద్రాదులు—(ఆకాశముననిలిచి చూచుచు)

ఓహో! రామరావణసంగ్రామ మెంతభయంకరముగా నున్నది! త్రిలోకదుర్జయుండగు నీ పౌలస్త్యునిగెలువ నీపురుషసింహునకుంగా కొరులకుశక్యమా? భానుకులదీపకుండగు రాముఁడు విభీషణుఁడు వచియించిన ట్లీదశాస్యుని నాభిస్థలామృతంబు నాగ్నేయాస్త్రమున నాస్వాదించి వీని నేకశిరస్కునిగను గరద్వయునిగను జేసినను నద్దురాత్ముఁ డింకను వెనుదీయక పోరుచున్నాఁడు గదా. ఆహా! ఈ రావణునిపరాక్రమ మెంతశ్లాఘనీయము! కావుననే దేవతలమగు మేముగూడ నీతని ప్రతాపాగ్ని కింధనప్రాయులమైతిమి. అదిగో మాతలి యేమోయనుచున్నాఁడు విందము.

మాతలి—(తెరలో) ఓ రాజవరేణ్యా! రామచంద్రా! యీదశాస్యు నిప్పుడు బ్రహ్మాస్త్రమున వధించి లోకంబులకు హితముసేయుము. జాగే ?

దేవేంద్రాదులు—మాతలి చెప్పుటయెతడవుగ నిమ్మహాత్ముఁ డప్పుడే కోపరక్తారుణితలోచనుండై ప్రళయకాలానలసదృశజాజ్వల్యమానమగు బ్రహ్మాస్త్రమును ప్రయోగించినాఁడు. ఆయస్త్రము భూనభోంతరమునిండు భయంకరారావముతో దశాస్యుని సమీపించుచున్నది. ఈదైత్యపతి మొగము వెలవెలబాఱుచున్నది. వీఁడు భయకంపితుఁడై వడఁకుచున్నాఁడు. భళీ! భళీ! త్రిలోకకంటకుఁడగు రావణుఁడు నేలఁగూలినాఁడు! మేలు! మేలు! (దుందుభులు మ్రోయించి పుష్పవర్షము గురిపింతురు.)

[యవనికనెత్త రణభూమియందు రావణుఁడు మృతుఁడై పడియుండును. కపులందఱు సంతోషించుచుందురు.]

రాము—ఆహా! ఇప్పు డీరణరంగవాహిని యెంతవింత గొలుపుచున్నది!

సీ॥ సంగ్రామనిహతరా ♦ క్షసకళేబరవార
గళదసృగ్జలతరం ♦ గములతోఁడ
అనుపమకరవాల ♦ ఘనతరభుజదండ
భయదపన్నగకదం ♦ బములతోఁడ
దతపరిచ్ఛిన్నావ ♦ దాతచామరబృంద

ధవళడిండీరసం ♦ తతులతోడ
మలినమేదోమాంస ♦ మస్తిష్కసంచయా
పటునాంద్రజంబాల ♦ పటలితోడ
తే॥ గీ॥ విమలశరకుంతఖడ్గమీ ♦ నములతోడ
వికచకచపక్ష్మశైవాల ♦ వితతితోడఁ
దనరిసంగ్రామరంగవీ ♦ తరుణమందు
డంబుమీఱెను శోణిన ♦ దంబుపగిది॥

ఇప్పటికి సంపూర్ణవిజయంబు గైకొన్నవాఁడనైతిని. తమ్ముఁడా! నేను కార్ముకముఁ దాల్చినపని తీఱినది. కావున నింకఁ దీని నెక్కుడించెదను. (అట్లుచేసి) ఇది నీయొద్దనుంచుము. (ధనువు లక్ష్మణునకిచ్చును.)

(యవనికజాఱును.)

---

(4 రంగము:)

(రాముఁడు విచారముగనుండును. విభీషణుఁడుతక్క తక్కినవారుందురు.)

లక్ష్మ—(స్వ) రామునానతి సీతామహాదేవిం గొని రానరిగిన విభీషణుఁ డింకను రాకున్నవాఁడు. మాయన్న సమరంబున సంపూర్ణజయంబుఁ జేకొన్నవాఁడయ్యు నేఁడేలకో విచారాక్రాంతునివలెఁ గన్పట్టెడిని. సీతం దోడ్కొనిరమ్మని పౌలస్త్యునితోఁ జెప్పునప్పుడుగల ముఖవికాసాది సంతోషచిహ్నము లిప్పుడీయనయందు చూపట్టుట లేదు.

తే॥ గీ॥ అల శరత్పూర్ణిమాచంద్రు ♦ నవఘళించి
ముద్దుగులికెడు తనదునె ♦ మ్మోమునందు
విన్నఁదనమూనిఖిన్నుఁడై ♦ యున్నవాఁడు
ఈమహాత్ముఁడు కారణం ♦ బెఱుఁగరాదు॥

ఈ పురుషసింహునిఁజూడ నీయనయాంతరంగిక భావము లద్భుతపరివర్తనమునందుచు సముద్రతరంగములవలె నుయ్యేలలూఁగుచున్నట్లు తోఁచుచున్నది. ఇందులకేదియో ప్రబలకారణ ముండితీఱవలయును. మహాత్ముల చిత్తవృత్తుల గనిపెట్ట నెంతవారు కావలెను? ఇప్పుడీయనను బలుకరించుటకుఁగూడ నాకు భయమగుచున్నది. నీతిజ్ఞులగు నీ పురుషుల హృదయములు కడుగంభీరములై మహార్ణవమువలె నగాధములై యుండును. కానిమ్ము. నిదానించినఁ గ్రమ

ముగ సర్వమును దెలియఁగలదు. (దృష్టిసారించి) వాఁడుగో! విభీషణుఁడు జానకీదేవిం దోడ్కొనివచ్చుచున్నాఁడు.

విభీషణుఁడు—(ప్రవేశించి రామునితో) దేవా! భవదీయాజ్ఞానుసార మిదే సీతామహా దేవి వచ్చుచున్నది.

రాము—(నిట్టూర్పువిడుచును.)

లక్ష్మ—(స్వ) ఇదియేమిచిత్రము? శీతకరకిరణప్రసారముసఁ బొంగు పయోనిధివలె నిజపత్నిరాక విన్నంతనె యీయనచిత్తవికారములు విషాదసమావృతములై యధికములగుచున్న ట్లీరాజవర్యునిముఖలక్షణములు చెప్పుచున్నవి. ఈయన నిజమనోభావములను లోలోన మ్రింగఁజూచుచున్నను నవి యపారములై వెలికి నుబుకుచున్నవి. వానియర్థముమాత్రము దుర్గ్రాహ్యమైయున్నది. శ్వేతోత్పలసదృశంబులై శాంతరసంబుగురియు నీయనవీక్షణంబు లిప్పుడు రక్తవర్ణభయంకరములైవి స్ఫులింగముల రాల్చుచు దురవలోక్యములుగ నున్నవి. ఇదియంతయుఁ జూడ నామన మపరిమితశంకాసంకలిత మగుచున్నది. ఏమికీడు మూఁడనున్నదో తెలియదు.

సీత—(ప్రవేశించి) హా! మనోనాథా! మి మ్మెంతకాలము విడనాడి యుండవలసివచ్చెను. (రామునిఁ గౌఁగిలించుకొనబోవును.)

రాము—(చివాలునలేచి దూరముగఁబోయి) ఆ! ఆ! సీతా! నన్నంటక తొలఁగి యుండుము.

సీత—(విన్నబోయి) హా! జీవితేశ్వరా! ఇదియేటి కాఠిన్యము?

తే॥ గీ॥ వరహిమాంశుకరస్పర్శఁ ♦ బాసియున్న
కుముదినివిధానఁ గుందు మీ ♦ కూర్మిపత్ని
నాదరంబునఁ గౌఁగిట ♦ నలరఁజేయ
కిట్టి విషమాచరితు లిం ♦ కేల నాథ॥

రాము—యువతీ! ఇది పరీక్షకాదు. దాఁపనేల? ఒకసంగతిఁ జెప్పెదను వినుము. రావణాపహృతవై లోకనిందకుఁ బాలైన నిన్ను ప్రాకృతునివలె మరలఁ జేపట్టి నిష్కళంకమగు నిక్ష్వాకుకులంబును గళంకీభూతముగఁజేయ నాకిష్టము లేదు. నేను బ్రాణహానికైన నోర్తుగాని మానహానికోర్వఁజాలను. నీ యిష్టమువచ్చినచోటికిఁ బొమ్ము.

సీత—(చెవులుమూసికొని) నాథా! ఇదేమియన్యాయము?

చ॥ అసయము మీపదాబ్జముల ♦ నాత్మఁదలంచుచు నెప్డు మిమ్ములన్
గనఁగొనుదానవోయనుచు ♦ గంటికి నిద్దురలేక యున్నయున్
దిన కొకరీతిఁ గుందు సుద ♦ తిన్ నను నక్కటా! యీవిధంబుగా
మన మెరియంగ జెట్టిదపు ♦ మాటలనాడి కలంచు టొప్పునే॥

రాము—నీ వెన్ని చెప్పినను నా మనము నిన్నొల్లకున్నది. నీమాటలు విశ్వసనీయములు కావు.

తే॥ గీ॥ మత్తుఁడును బరదారాభి ♦ మర్శకుండు
నైన రావణు వింటని ♦ న్నాళ్ళు నీవు
పరఁగవసియించి పావన ♦ చరిత నన్ను
నళినలోచన నే నెట్లు ♦ నమ్మువాఁడ॥

నీ వొక వేళ స్థిరచిత్తవై యున్నను నీ యప్రతిమానసౌందర్యమునుజూచి పరాంగనారతుండగు దశాస్యుఁడు బలిమినైనఁబట్టియుండును గాని నిన్నూరక విడచియుండఁడు.

సీత.—అక్కటా! హృదయేశ్వరా! మానప్రాణశరీరములు నీకర్పించి సర్వదా నీయభ్యుదయంబె కోరుచు సర్వస్వము నీవెయని నమ్మియున్న నిష్కళంకచరిత్రనగు నన్నుఁ బిన్నతనమాది నాగుణగణంబులెఱిఁగి నాసత్ప్రవర్తనముం దెలిసిన సర్వజ్ఞుండవగు నీవిట్లు ఘోరనిందకుఁ బాలుసేసి యనరానిమాట లాడి నొప్పింపఁజెల్లునా? అగ్నిసాక్షిగఁ బాణిగ్రహణ మొనరించిన సహధర్మచారిణిన గునన్నిట్లకారణముగఁ దూలనాడి త్యజింపఁజూచుట సకలధర్మాధర్మసంవేది వగు నీకు న్యాయమా? నే నొకవేళ నీ కంతపనికిరానిదాననేమైన నాఁడు హనుమంతుని నా చెంతకంపునప్పుడు నీ తలంపు నాతనిచే నాకెఱింగించియున్న నీవువచియించిన కఠినోక్తుల వినకుండ నప్పుడే ప్రాణములఁ ద్యజించియుండును గదా? అయ్యయ్యో! నాకుఁ బ్రాణములువాయునంతటి భాగ్యముకూడనా? నేనంత యదృష్టవంతురాలనైన నీయాపదలన్నియు నెవ్వతె యనుభవింపఁ గలదు? దైవమా! అశనిసంకాశములగు నీయనవాక్యములువినియును బగిలి బ్రద్దలై కూలక నిలిచియున్న నా యీ హృదయమును వజ్రమునకన్నఁ గఠిన ముగ నేలనిర్మించితివి? అక్కటా! పతివిడచిన నాకింక నేదిగతి? (ఆలోచించి) స్ఫురించినది. (లక్ష్మణునితో) సౌమిత్రీ! అన్నియుం దెలిసిన మీయన్న గా రాడువాక్యములు వినుచున్నాఁడవుగదా? పరేంగితజ్ఞుండవును బుద్ధిశాలి వగు నీవు నాయుం దేయెగ్గైనఁ జూచుచున్నాఁడవా? ఇంతయేల? ఎల్లరసంశ

యంబులు వాయునట్లు నేనిప్పుడే యగ్నిప్రవేశముచేసెదను. కావున శీఘ్రిమ సొద చేర్చుము.

లక్ష్మ—(దీనవదనుఁడై రామునిఁ జూచుచున్నాఁడు)

రాము—లక్ష్మణా! సందేహింపక సీతచెప్పినట్లు చేయుము.

లక్ష్మ—(స్వ) అక్కటా! మాయన్న నేఁ డెంతదారుణకార్యముఁ దలపెట్టుచున్నాఁడు. ఏమిచేయుదును? విధివిధాన మిట్లున్నది కాఁబోలును.

(నిష్క్రమించును.)

సీత— తే॥ గీ॥ అష్టదిక్పతులార! యో ♦ యమరులార!
యక్షవరులార! గుహ్యకా ♦ ధ్యక్షులార!
అంబునిధులార! పంచభూ ♦ తంబులార!
గగనచరులార! న్యాయంబు ♦ గనుఁడుమీరు॥

(ప్రిక్కకుఁ జూచి)

సకలపాపవినాశనా! హుతాశనా!

తే॥ గీ॥ అనఘ! వేదచయంబు నీ ♦ యందుగల్గి
ప్రిబలుటను జాతవేదాఖ్య ♦ బరఁగినాఁడ
వరయ రాజసూయాదిమ ♦ హాధ్వరములఁ
బూజ్యుఁడవు వీతిహోత్రి! య ♦ ద్భుతచరిత్రి॥

మ॥ పతినే దైవముగాఁదలంచుచు మనో ♦ వాక్కాయకర్మంబులన్
సతతంబున్ భజయింతునేని నను నీ ♦ శశ్వత్కృపాదృష్టి నం
చితభంగిన్ వెడలింపు మొండయిన న ♦ క్షీణోగ్రియుష్మచ్ఛిఖా
వితతిన్ భస్మమొనర్చి నిర్దయతను ♦ ర్విన్ గూల్చు వైశ్వానరా!

(నిష్క్రి.)

(అప్పుడు శివుఁడును దేవేంద్రుఁడును బ్రిహ్మయు బ్రివేశింతురు)

(అందఱు నమస్కరించుచున్నారు)

దేవేం—(రామునితో) దేవా! ఆర్తజనశరణ్యా! సుగుణగణ్యా! లక్ష్మీమనోహరా! శాంతించి మామనవిఁ జిత్తగింపుము. సాధ్వీమతల్లియగు నీమె నిర్హేతుకనిందకుఁబాలై రోషవశంబున నగ్నిప్రివేశముఁ జేయుటవలన గరుడగంధర్వ కిన్నర కింపురుషాదులెల్ల తల్లడిల్లుచున్నవారలు. లోకములు కంపమొందు

చున్నవి. నీవిత్తఱిఁ గోపమువిడచి యీమెయెడఁ బ్రసన్నతవహింపవలయును. నీవు కినుకఁదాల్ప మూఁడులోకంబులును నిలువఁజాలవు. నీవెవ్వరనుకొంటివి?

సీ॥ నిగమముల్ హరియించి ♦ నిధిఁజొచ్చిన నిశాటుఁ
బొరిగొన్న జలచర ♦ మూర్తివీవ
అమరదానవులు దు ♦ గ్ధాంభోధి మథియింప
శైలమెత్తిన ఘులీ ♦ శ్వరుఁడవీవ
బ్రహ్మ— ఇలఁ జాపఁజుట్టిన ♦ ఖలునిఁ గాంచననేత్రు
నవనిఁగూల్చిన వరా ♦ హంబవీవ
కనకకశ్యపు మహో ♦ గ్రనఖాగ్రధారల
జీల్చితుంచిన నర ♦ సింహమీవ
శివుడు— తే॥ గీ॥ పుడమి మూఁడడుగులువేడి ♦ వడి బలీంద్రు
నడఁగద్రొక్కిన యల వామ ♦ నుఁడవునీవ
జామదగ్న్యుఁడవీవ వి ♦ శ్వంబుఁబ్రోవ
నవతరించితి విట్లు మ ♦ హానుభావ॥

మహాత్మా! త్రిభువనపూతయగు నీలోకమాత యభ్రంకషకీలాభయంకరంబగు నీ మహాగ్నిలోఁ బ్రవేశించియు నెట్లనపాయయై విలసిల్లుచున్నదో చూడుము. ఇట్టి పతివ్రతాలలామ నీవిధముగ నిందింపఁదగదు. కావున సత్వరమ దయాంతరంగుండవై యీమెను బరిగ్రహింపుము.

(అగ్నిదేవుఁడు సీతతోఁ బ్రవేశించును)

అగ్ని— దేవా! త్రిమూర్తిస్వరూపా! నీమహాత్మ్యము వర్ణింప భోగీంద్రుఁడైన నసమర్థుఁడు. నీవనంతకోటి బ్రహ్మాండమండితోదరుఁడవు. మాయామానుషమూర్తివి. పృథివ్యాదిభూతపంచకంబును సూర్యచంద్రాది నవగ్రహంబులును సప్తసముద్రములును చతుర్దశభువనములును వేయేల! దృశ్యాదృశ్యంబంతయు నీవయై నిండియున్నవాఁడవు. నీవుసర్వజ్ఞుండవు. నీవెఱుంగని దెద్దియులేదు. పావనచరిత్రయగు నీసీత యాదిలక్ష్మిగాని సాధారణ యువతి గాదు. ఈమె యకల్మష. ఈసతీమతల్లి సర్వదా నీధ్యానము దప్ప నన్యమెఱుంగదు. మానససరోవరంబున విహరించు హంసి యల్పపల్వలంబులపై నాసఁగొనన ట్లీకాంతాతిలకము త్రిలోకాభిరాముండవగు నిన్నుగాక న్యుల నపేక్షింపదు. ఈకాంత పరమసాధ్వీతిలకము. ఈమె నాయందుఁ బ్రవేశించుటచే లోకములను శుచిగ నొనరించు నేను మఱింత శుచిత్వముజెంది

కృతార్థుండ నైతిని. ఇంతయేల, పదునాలుగు జగములనైన నొక్కపెట్టునఁ గాల్చివేయఁజాలిన నాయందుఁ జొచ్చియు నీమేనులత రవంతయు గందకుండుటయు శిరమునందలి కుసుమములు చెదరకుండుటయుఁ జేల మొప్పటియట్ల మేనఁ దనరుటయును జూచిన నీ మహిళాలలామమహిమ సర్వము దేటపడుచున్నది. కావున నింక సంశయింపక యీశుభచరిత్రం జేపట్టి లోకములఁ గాపాడుము.

రాము—మహానుభావులారా! మీరు సాక్షాత్కరించుటచే నా సంశయములన్నియుఁ దీరినవి.

తే॥గీ॥ దేవనదివోలె భూసుత ♦ దివ్యచరిత
పావనసుశీల నాయెడ ♦ భక్తిగలిగి
వినయభంగి మెలంగు న ♦ త్యనఘ యనుచు
ముదితవర్తన మే నెఱుం ♦ గుదును మున్నె॥

అట్లెంతయు నెఱిఁగియు,

తే॥గీ॥ దశముఖుండు హరించిన ♦ తరుణి మరలఁ
గామవశుఁడయి కొనివచ్చె ♦ రాముఁడనుచు
నెల్లలోకము నన్ను నిం ♦ దించుఁగాన
నా పడిని బాపుకొన నింతఁ ♦ జేసినాఁడ॥

ఇప్పటికి నాహృదయము కుదుటఁబడినది. మీయాజ్ఞానుసారము పవిత్రచరిత్రయగు జానకి నిప్పుడే పరిగ్రహించితిని.

సీత—నేనిప్పటికి ధన్యురాలనైతిని.

శివు—రామచంద్రా! మీజనకుండగు దశరథుండు మీజయంబున కలరి దేవగణపూజితుండై పుష్పకము నెక్కి స్వర్గమునుండి మిమ్ముఁజూడ వచ్చుచున్నాఁడు.

(దశరథుఁడు పుష్పకారూఢుఁడై ప్రవేశించును.)

(రామలక్ష్మణులు, సీత నమస్కరించుచున్నారు.)

దశరథు—(కుమారులఁ గౌఁగిలించుకొని) నందనులారా! దిగంతవిశ్రాంతయశోవిరాజితులగు మిమ్ము దనయులుగాఁ బడయుటచే నేను కృతార్థుండ నైతిని. (రామునితో) నాయనా! రామా! నేను నీయెడఁ గావించిన మహాపకారమునకు నిన్నుఁజూడ సిగ్గుపడుచున్నాఁడను.

ఉ॥ పాపపుఁగైకమాటవిని ♦ పట్టముఁగట్టఁగ సిద్ధమయ్యు ని
న్నాపగిదిఁ వనీస్థలికి ♦ నంపిన దుష్టుఁడ మందభాగ్యుఁడఁ
బాపుఁడ నీవు రాజ్యపరి ♦ పాలన మల్లనసేయ నత్తఱిఁ
జూపులు ధన్యమొంద నినుఁ ♦ జూడఁగనోఁచఁగనైతి నక్కటా!

స్త్రీలోలుండనై చేసేత నింత తెచ్చుకొంటిని. ఎంతటిధీశాలియైనను నాఁడుదానిచేఁజిక్కిన గుడ్డిగవ్వకైనఁ బనికిరాడుగదా!

తే॥ గీ॥ యుక్తము నయుక్త మెద నభి ♦ వ్యక్తపడదు
బుద్ధియును బెడతోవన ♦ పోవుచుండు
యాశము నశియించు నపయాశం ♦ బావహిల్లుఁ
బుడమిస్త్రీలోలురైనట్టి ♦ పురుషులకును॥

తినయా! నిన్నింతచేసిన యీపాపాత్మురాలు కైకమాత్రమేమిసౌఖ్య మనుభవించినది లెమ్ము. ఎందును ధార్మికులే దైవసహాయము కలిగియుం దురు. నీవు ధర్మాచరణదీక్షాపరతంత్రుఁడవగుటచే సర్వదా నీకు సకల శ్రేయములొదవుఁగాక! (లక్ష్మణునితో) పుత్రా! "పితృసమో జ్యేష్ఠ"యను నార్యోక్తింబట్టి రాముఁడు నీకు జనకసమానుండును బూజ్యుండును నై యు న్నాఁడు. నీ వీతనిని రాజమాతృనిగా నెంచక భక్తియుక్తుండవై భజియించి కీర్తిశాలివి కమ్ము. (సీతతో) అమ్మా! జనకపుత్త్రీ! మహారాజుకూఁతురవయ్యుఁ గాలవశంబున నీవిట్టి పడరానియిడుములకుం బాలైతివి. ఎట్టివారికైన నాఁ దలు తప్పవు. నీపవిత్రచరిత్రము త్రిలోకపూజ్యమైనది. నీమూలమున మా సూర్యవంశమెల్ల తేజోవంతమైనది.

తే॥ గీ॥ పుట్టినింటికి వన్నెయు, ♦ మెట్టినింటి
కెన్నికను దెచ్చుటకు తగ ♦ నిన్నుఁబోలు
లలనయొక్క తెచాలదే ♦ కులము జెలుపఁ
గలుగ నేటికి వేవురు ♦ కులట లవని॥

అమ్మా! నీవు నీపతియాగు రాముని వలె కులవిస్తారకులై జగత్కీర్తనీయులై మహాపరాక్రమాభిరాములగు తనయులంబడసి దీర్ఘసుమంగలివై వర్ధిల్లు దువుగాక! సర్వదా నిన్ను నీపాతివ్రత్యమె సంరక్షించుఁగాక!

17

దేవేంద్రు—మహాత్మా! రాఘవేంద్ర! మానిమిత్తము నీవిన్ని శ్రమలకోర్చి దుష్టుడగు రావణుని దునిమించితివి. జగన్నాథుండవగు నీకు వరములిచ్చెదననుట హాస్యాస్పదంబైనను నియిచ్చవచ్చినదాని నడుగుము. సమర్పించెదను.

రాము—నిర్జరనాయకా! నీప్రసాదమున మాకేకొఱంతయు లేదుగాని నిన్నొకటి మాత్రము కోరుచున్నాఁడ. రణమున నాకు సహాయముగవచ్చి దానవుల వాతంబడిన వానరవీరులఁ బ్రదికింపుము.

దేవేం—నీకోరినట్లు రణనిహతులైన కపిపుంగవులనెల్ల సుధావర్షము గురిపించి సజీవులఁ జేసితిని.

శివుఁడు—రామచంద్రా! వానరులందఱు బునర్జీవితులైరి. మీకొఱకచ్చట భరతాదులును గౌసల్యయు సుమిత్రయు నిరీక్షించుచుందురు. కావున మీరింక శీఘ్రముగ నయోధ్యకు బయనముకండు. మీకు శుభములు కలుగుఁగాక! మేము పోయివచ్చెదము.

(శివుఁడు, దేవేంద్రుఁడు, అగ్ని, బ్రహ్మ, నిష్క్రమింతురు.)

దశ—నాయనా! రామచంద్రా! నేనింక నాలోకమునకుఁ బోయెదను. నీవు సురక్షితముగ నయోధ్యఁబ్రవేశించి పట్టభద్రుండవై రాజ్యమేలుము.

రాము-లక్ష్మ—జనకా! నమస్కరించుచున్నాము.

దశ—పుత్త్రులారా! చిరంజీవులై వర్ధిల్లుఁడు.

సీత—మామగారూ! నమస్కృతులు.

దశ—అమ్మా! నీకు సర్వదా శుభములొదవుఁగాక! (నిష్క్రమించును.)

రాము—విభీషణా! మేమింక సాకేతపురంబున కరుగవలయును. మార్గమధ్యంబున ననేక వననదీనదంబులు గడచి కడుదవ్వు చనవలయుఁగావున నీనాఁడే బయలుదేరెదము. వలయుసన్నాహము చేయింపుము.

విభీ—ఆర్యా! మీ రీవిషయమై విచారింపవలదు. కుబేరుని గెల్చి యాతనివలన మాయన్న కైకొన్న పుష్పకంబు నాయొద్దకలదు. మీరు దానినధిష్ఠించిన యామార్గమాత్రంబున నయోధ్య కేఁగఁగలరు.

రాము—మంచిది. అయిన నిప్పుడే వెడలెదము—సఖా! విభీషణా! లంకారాజ్యాధిపత్యము లభించెఁగదా! ఇంక నీకుఁ గావలసినదేమి?

విభీ—మీయనుగ్రహమునకన్న నింకేమున్నది? అయిన నిట్లగుఁగాక!

చ. అతులిత ధర్మమార్గమున ♦ నందుఁ జరింతురుగాత పూరుషుల్
పతిహితవర్తనంగలిగి ♦ భాసిలుచుందురుగాత కామినుల్
మతిఁ గడుభక్తితోడ నిను ♦ మానక కొల్చెడువట్టివారికిన్
సతతము సర్వభాగ్యములు ♦ సంఘటియిల్లెడుగాత నుర్వరన్.

రాము—తథాస్తు.

(అందఱు నిష్క్రమింతురు.)

సంపూర్ణము.

